శ్రీ

# మహాభారతము

## యక్షగాన ప్రబంధము





వేంకట్రామ అండ్ కో,
విద్యా విషయ ప్రచారకులు
కింగ్సువే, సికింద్రాబాదు.

పరిమిమ బ్రహ్మణ్యకవి
పోతనమూరు



# విజ్ఞప్తి.

---

తే. గీ. వ్యాసవిరచిత సంస్కృత ♦ భారతమ్ము
దెలుగుజేసిరి తిక్కనా ♦ దులు; శివార్ప
ణమ్ముగానది యత్నుగా ♦ నప్రబంధ
సరణిరచియింతు నాజన్మ ♦ సార్థకముగ.

ఉ. తప్పులకుప్ప నాకయిత ♦ దానికిదోడుగ గొప్పసాములే
జెప్పగబోనిమేటి కత ♦ జెప్పగబూనితి నెక్కసక్కెమా,
జప్పనగాదె బాసబిగి ♦ చాలనియల్లిక, నాకొలందికిన్
బప్పనగాలు వేయకసె ♦ బాసనిపించుట నోటిమాటలే.

చ. పెదవులజాఱుకేతడవు ♦ పిన్నలు సైత మెఱుంగగా రసం
బాదవ నొకొక్క పద్దెమున ♦ కొక్కొక నెత్తురుచుక్క నోడ్చుచుం
బదనుగ పేలవంబు గను ♦ పట్టగవీక చరిత్రమంత యుం
బదిలముగా రచించిచెలు ♦ వంబిడుదుం గవితాకుమారికిన్.

తే. గీ. భారతముదెనిగించిన ♦ వారిలోన
వినుతి పాత్రులుగావ ♦ కవిత్రయమ్ము
సరస తిరుపతి వేంకటే ♦ శ్వర సుకవు
లెలగి యష్టావధానసూరి ♦ చితిని నేను.

సీ. పావల్య పురాగ్రహార ♦ ప్రాంతమందేను కా
పురముండుదు భోత్తున ♦ రప్పరసార్థ భావ
పరిమితంతపుమత, శా ♦ ఖ స్తంభసూత్రుడ
హరితసగోత్రుడ ♦ ధరణీసురుడ
సుబ్బరాయడుతాత ♦ సుందరరాముండు
జనకుండు, జనయిత్రి ♦ కనకమాంబ

యిందీవరాక్షి న ♦ న్నెలమి బెంచిన తల్లి
తనరారు మహాలక్ష్మి ♦ ధర్మపత్ని
గురువరేణ్యుడు గుడి ♦ గుంట లక్ష్మీపతి
హనుమడే నమ్మికో ♦ న్నట్టి వేల్పు

తే. గీ. సుతుడొకండును, గలరాత్మ ♦ సుతలిరువురు
వయసు ముప్పదియేనవ ♦ వత్సరంబు
హరికథలు సెప్పజాలిన ♦ యట్టి సుకవి
సకలజనులు సుబ్రహ్మణ్య ♦ డంద్రు నన్ను

సీ. జమునయొడ్డునకోడ ♦ సత్యవతీదేవి
కన్యప్రాయంబునం ♦ గన్న కొ
నాల్గువేదముల ది ♦ న్నగవిభాగించి ప
ల్గాథలల్లినమేటి ♦ కయిపరయ్య
చవులూరభారత ♦ చరితమెల్లరు విన
హాయిగాబాడిన ♦ కోయిలదొర
తొలుకారుమబ్బులం ♦ దులకించు సొబగైన
తనుకాంతినొప్పారు ♦ తపసిమిన్న

తే. గీ. వెన్నవఱారమనువాసి ♦ గన్నసామి
పరమభాగవతాగ్రణి ♦ బ్రహ్మవేత్త
కాలవేది సార్థక[illegible] ♦ కాలజీవి
యగు పరాశరసుతు వ్యాస ♦ నభినుతింతు.

ఉ. ఎన్నడు నాడిబొంకడు స ♦ మిద్ధగుణుండు ప్రశాంతమూర్తి పే
ర్వెన్నికగన్న సత్య[illegible] ♦ డొంతయు గొన్నకుమారుపోల్కి న
న్నెన్నివిధమ్ము లంగమద ♦ [illegible] సన్నుతింతు [illegible]
[illegible] పెంటపాటికుల ♦ పార్థివ [illegible] సత్య[illegible]న్.

శ్రీ

# మహాభారతము

## భీష్మప్రతిజ్ఞ

శ్రీవిఘ్నేశమిభాభాస్యం । సేవకాభీష్టదాయకం
ఏకదంతముమాపుత్రం । నమామి గణనాయకం॥

భైరవి — రూపకము

ప॥ ఆనందం బానందం - బాలింప మహాభారత ॥మా॥
అ॥ నానావిధ పుణ్యఫలస - మంచిత పంచమవేదం ॥బా॥

చరణము

మోదితధర్మార్థకామ - మోక్షములకు సాధనంబు
వేదవ్యాసోరుధీప - యోధిజనిత దివ్యామృత ॥మా॥

సీ. తొల్లికల్మాష పా ♦ దుండను ఱేడు, వి
శ్వామిత్రు పంపున ♦ జని వసిష్ఠ
నందనులంగూల్చ ♦ నందుశక్తిమునీంద్రు
వనితయదృశ్యంతి ♦ యనులతాంగి
నిండుచూలాలు వం ♦ ద్రెండువత్సరములు
మోసిగర్భమ్ము, వ ♦ రాశతనగ నె
వేద వేదాంగసం ♦ వేది బుధాగ్రగ
ణ్యుండు, పరాశరమౌని ♦ యొకదినాద

తే. గీ. యమునవలోదడ గడపు, తొ ♦ య్యలినొకర్త
ఘనిమనంబు చలింప, ధ ♦ గ్గరి యభీష్ట
మెరుకపరుప లజ్జించి యా ♦ కిల్కంత దొలగి
మునితియము ల్లొలుకబల్కెనా ♦ ముద్దుగుమ్మ.

మోహన - ఆది

ప॥ పల్లెజేనికాతుర సామీ నా - పై నీకింతటి వలపేమినే ॥పల్లె॥

అ॥ తల్లిదండ్రులున్నారు నాకప్వ - తంత్రతురాల మేగిరపడదేలా ॥పల్లె॥

చ ర ణ ము

తనువుమీాల దుర్గంధమయము, రో-తంబుట్టింపదె నాతో కూటమి
అనఘ! కన్యకను కన్యకావ్రతం-బంతరింప వలువురనగుబాటగు॥ప॥

తే. గీ. ఎల్లవేదమ్ము లెఱుంగు జి ♦ తేంద్రియుండు, ప
రాశరమహామునీంద్రుండా ♦ దాశరాజు
పట్టితో గంగయొడ్డున ♦ పట్టపవలు
గలసె ననునడి నిలచు లో ♦ కముల జిరము.

వ. అనిన నమ్మునివరుండు తనతోడి కూటమింగన్యాత్వంబు సెడకుండ వరంబిడి నీవు వసువను రాజర్షి వీర్యంబునం బుట్టిన దానవుగాని సూతకుల ప్రసూతవు కావని చెప్పి శరీర సౌగంధ్యంబుయోజన పరిమితం బగునట్లు ప్రసాదించి, యోజనగంధియనియు గంధవతి యనియు బిలువం బడెదవుగాక యనుచు దాసేయ నుద్యోగించిన చీకటి త ప్పొరు లెఱుంగకుండ

మం జ రి

తపోమహిమ నమ్ముని బయలెల్ల ♦ తమోమయము గావించె
తపోధనుం డా పరాశరుడు స ♦ త్యవతింగూడి రమించె
పరమేష్ఠికల్పుడగు పరాశరు స ♦ మాగమమున సత్యవతి
వర సద్యో గర్భంబున వేద ♦ వ్యాసుంగనియె స్తుతమతి
తనకోరినవరములిడి మౌనియుం ♦ జనియెనట తనూజుండు
పనిగల్గిన ననుదలపుమా తల్లి ♦ యనిచనియెను వ్యాసుండు

వ. ఇది యట్లుండ,

చ. భరతకులాగ్రగణ్యుడు ప్ర ♦ పాలితలోక్యుడు, పుణ్యమూర్తి, సు
స్థిర విభవాభిరాముడు ప్ర ♦ తీప కుమారుడు శంతనక్షమా
వరుడొకనాడు వేటకని ♦ వచ్చి వనాంతర భూములెల్ల గ్రు
మ్మరి, తుది గాంగసైకత స ♦ మంచిత చారుధరాతలమ్మునన్.

సీ. నల్లనౌ మునుకురుల్ ♦ నాచుదీవలు గాఁగ
లలిమేని ముడుతలే ♦ యలలుగాఁగ
వెడద వాల్గన్నులౌ ♦ క్రేఁడ గండు మీల్గాఁగ
మురిపెంపు చిఱునవ్వు ♦ నురువుగాఁగ
తోరంపు దిటవు చ ♦ న్దొకవలమురిగాఁగ
పాలిండ్లు మేటి గు ♦ బ్బలులుగాఁగ
నెసగు పిఱుందులే ♦ యిసుక తిన్నెలు గాఁగ
మేలిపరాల్ ♦ రతనాలుగాఁగ

తే. గీ. పిక్కలు మొసళ్లు ♦ లోతైన పొక్కిలిసుడి
గాఁగలావణ్య జలరాశి ♦ గాదనర్చు
చివురుబోఁడి నొకర్తుగాం ♦ చి సుమశరుడు
సంభ్రమము గొల్పడగ్గఱి ♦ శంతను డనె.

కేదార – ఆది

ప॥ ఎవరిదాన విందేలవచ్చితి – వేకతంబ యిట్లున్న హేతువే ॥ఎవ॥
అ॥ చివురుబోఁడి రాచిల్క చౌతుపై – మిన్నులపగిలి వచ్చినరతివో సీ॥ ఎవ॥

చరణము

మోహనాంగి పాంధుఁడ నే డస్సితి – మోవిపానకంబిమ్మా
బాహుమూలమునవదిమినాతాప–భారముడిపిపాలింపు మొకతూరి॥ఎవ॥

చరణము

ఏడుదీవులెనలేనివిభవమున – నేలువాఁడనో కాంతా శంతనుఁడ
వేడుకొందు నన్గూడుమా శంక – వీడినేడు మారాడపాడిగా ॥ఎవరి॥

చ. అనవిని యత్తలోదరియు ♦ నా జననాయకు సాభిలాషయై
కనుగొనునంత నొండొరుల ♦ గాటపుజూడ్కులు సాయకాళిగా
గొని వెడవింటిదంటయును ♦ గొబ్బున వారల ధైర్య వల్లులం
దునియలుగానొనర్ప నృపు ♦ తో గడకిట్లనె నమ్మృగాక్షియున్.

మ. వినుమేనెవ్వతెనైననేమి ♦ సకలోర్వీనాథ నన్నాలిగా
గన నీవుం దలపున్న నృపియము వ ♦ ల్లాంభోజ వాంఛింపఁగా

కనుమోదింపుము నా యొనర్చు పనులి • ట్లైనన్, భవత్కాంక్షితం
బెనయింతున్ బ్రతికూల మెప్పుడగు న • ట్లైనాదు నిచ్చారతిన్.

ఆ. వె. అనిన శంతనుండు • విని యొడంబడి దాని
ప్రేమమీఱ దోడ్తె • పరిగ్రహించె
నెలమి గంగ వాని • కిష్టోపభోగముల్
సలుపుచుండ నంత • శాపవశత

సీ. వరుణాదివసువు లా • వనితకు బుత్రులై
పుట్టుచునుండ న • ప్పొలతి వారి
పుట్టినప్పుడ గొని • పోయి నిర్దయయై జ
లంబులవైవ గ • డంగ నృపతి
గని దాని వారింప • గా నోడు జెలువ త
న్నెడబాసి పోవునం • చెద దలంచి
యంత గొన్నాళ్ళ క • క్కాంత కష్టమతన
యుం డుదయార్క తే • జుండు బుట్ట

తే. గీ. బుడుత నెప్పటియట్టు లం • బువుల వైవ
బోవగని శంతనుం డతి • పుత్రమోహ
మున నివారింప దలకొని • మునుపొనర్చు
సమయభంగంబుగా నిట్లు • చానకనియె.

సావేరి—ఆది.

ప॥ కొడుకుల నేమ్వర మడియించితివి
ఘోరమేమి సుతఘాతినివైతివి ॥కొడు॥

అ॥ కడుపారగన్న బుడుతల జలముల
బడవైవగ నీచేతులెట్లాడె ॥కొడు॥

—• చరణము •—

సమయము భంగమువకోడి నీ చేయు - సాహసము నివారింపగానైతి
భ్రమరవేణి బాలార్కతేజు నీ - బాలునైన బ్రతికింపుమా నేడు॥కొ॥

క. సంతతికై గావింతురు
కాంతలు పుణ్యవ్రతాది • కము లెంతయు నీ

వంతున గన్న కుమారుల
నంతముగావింతు రే ? జ ♦ లాంతరమందున్.

వ. అన విని జాహ్నవియు

—♦ మ: జరులు ♦—

సమయభంగముగ నడ్డుజెప్పితివి - జనెద నిన్నింకవీడి
కుమారరమణ నేగంగను నేడే - సరి సూటమి నీతోడి
అష్ట వసువులు వసిష్ఠ శాపమున - నాత్మభవులైరి మనక
నష్టమవసు వీపుత్రకుండు దీ - ర్ఘాయుష్కుండై బ్రదుకు.

తే. గీ. అనుచు జాహ్నవీదేవి ధ ♦ రాధిపునకు
స్వస్వరూపంబుజూపి దే ♦ వవ్రతుం డి
తండు నాకడ బెరుగునం ♦ తకు వసించు
నని సుతుంగొనిచనె, భూపు ♦ డతిగె పురికి.

ఉ. వేద చతుష్టయంబు సది ♦ వెం బ్రియమార వసిష్ఠునొద్ద, ధ
ర్మాది సమస్తశాస్త్ర విదు ♦ డై గురుశుక్రుల బోలికన్ ధను
ర్వేదము నభ్యసించె సర ♦ విగ్ భృగు రాముకడన్ సనత్కుమా
రాదులవోలె తత్త్వవిదు ♦ డయ్యె నృపాలతనూజు డెంతయున్.

ద్వి ప ద లు.

అంత గొన్నిదినంబు ♦ లరిగినయంత
శంతనుండును తనూ ♦ జాతు డున్నెడకు
జని సమస్త కళా వి ♦ శారదుండైన
తనయు దోడ్కొని గృహం ♦ బున కేగుదెంచి
సకల భూవర సమ ♦ క్షమున గాంగేయు
బ్రకటితంబుగ యువ ♦ రాజ్యాభిషిక్తు
గావించి యొకనాడు ♦ ఘన యమునాన
దీవారిలో నొక్క ♦ తెఱవ తా నోడ
గడపుచో జని దాని ♦ గని యబ్బురముగ
వెడవింటి దొరబారి ♦ బడి మెచ్చె నిట్లు.

కమాచి—ఆది.

ప॥ ఊతను సమ్మోహనాస్త్రం బనదగు
నయ్యారే వెయ్యేటి కొయ్యారి ॥యతి॥

అ॥ ప॥ మతిమాలిన బ్రహ్మాదీని జాలరి
మగువగా జేసెనే తెలివిమాలి ॥అత॥

చ ర ణ ము.

చెల్లరే పన్నజాజులం గోయ - చేయిగందు పల్లవమృదుపాణికి
తల్లిదండ్రులీటు లోడనదుప నీతలిరుబోడి నియమించిరెంచ కే॥యతి॥

చ. అతనుడు దుండగీడు, వారి ♦ గాత్రివివాహితయో, తదన్యయో
సుతుడుగలాడు, మోహామొగి ♦ జూడదు మంచియుచెడ్డయున్, నిరూ
పితముగ వర్ణసంకరపు ♦ బెండిలి యాడహాసించు లోక, మీ
సతి ననుసమ్మతించునో ప్ర ♦ సన్నతవీడి నిరాకరించునో.

సీ. ఘనతరధనధాన్య ♦ కనకసద్వస్తువా
హనముఖ్యభోగభా ♦ గ్యములకన్న
సకలలోకైక సం ♦ స్తవనీయ వివిధ వి
ద్యానిరంతరశచా ♦ త్వమునకన్న
నిఖిలసామంతరా ♦ ణ్ణికరసమిత్సాజి
తధరాధినాయక ♦ త్వమునకన్న
నజరామరణ దీప్తి ♦ తానంద విభవ వి
స్తార సురాధిప ♦ త్యమునకన్న

తే. గీ. వాడివయసువ నిండు జ ♦ వ్వనులతోడ
నెఱపు గాటంపు కూటమి ♦ నిముసమేని
శీఘ్రమొడగూర్చు తనువు దా ♦ ల్చినఫలంబు
అంగనాసంగ మానంద ♦ మనుపమంబు.

వ. అని తలపోయుచు న జ్ఞనిభుం డా లతాతన్వి కడకుం జని.

ఉ. సామ్యములేకయో సహజ ♦ సుందరివై నను మన్మథంపు మో
హమ్మున ముంచజాలిన ల ♦ తాంగి, భవత్కుల మెద్ది? నీ నివా

సమ్మోట? నామమెయ్యది? యొ ♦ సంగుమిదే తనివార రాచసుం
కమ్మగ మోవిపానకము ♦ కాయజుశాసన మిద్ది ముద్దియా!

వ. అనిన విని తొయ్యలిపయ్యెద సద్దుకొనుచు నొక్కింత తొలగి.

మోహన—చతురస్ర.

ప॥ నేను పల్లెదాన - నీ కేలనాపై మనసీవిధాన ॥నే॥
అ॥ సూనశరుని క్రొవ్వాడికోలలకు - స్రుక్క నేల తగు నేయిది మేల ॥నే॥

చరణము.

దాశరాజు కూతురను నాని - వాసమదియె కనుమాభయాతురను
నే సేయుదు నీపని నాజనకుని - శాసనమున నాపేరుసత్యవతి ॥నే॥

చ. నరవర రాచసుంకముగ ♦ నా మనసిచ్చెద కామినీమనో
హరుడవు, యస్వతంత్రనుగ ♦ దా తలిదండ్రులచాటుదాన, నీ
వరుగుము దాశరాజుకడ ♦ కాతడు సమ్మతిజూపు, నాపయిం
బరిణయ మాడుగాక నవ ♦ వారిజనాయకుసాక్షిగాననున్

ఆ. వె. అనినవిని నృపాలు ♦ డతిమోదమంది, తత్
క్షణమ దాశరాజు ♦ కడకుజని ఘ
నోభిమతము దెలుప ♦ నత్యంత భక్తి బూ
జించియతడు సంత ♦ సించె పలికె.

ఉ. నాయక కన్నియం దగిన ♦ వానికొసంగుట లోకవర్తనం
బేయెడ దల్లిదండ్రులకె ♦ దృష్టమెకా నిను బోంట్లకిచ్చుటల్
ఈ యలివేణి నాల్గిగ ♦ హింపపథలం పుదయించెనేని భూ
నాయక! నీపరోక్షమున ♦ నా మనుమండె నృపుండుగాఫలెన్

తే. గీ. అనిన గాంగేయు యువరాజు ♦ నాత్మ దలచి
వసుమతీపాలు డెద్దియుం ♦ బాలుపోక
చని నిరుత్తరుడై నిజ ♦ సదనమునకు
నెంతయుంగుందె నిటు దు ♦ రంతచింత.

నాదనామక్రియ—ఆది.

ప॥ నేనేటికై వేటకై పోయి యమునా - నానదీ తీరమునం జేరితి తుద ॥నేనే॥
అ॥ ప॥ మానుగా సత్యవతి నేలగరటి - దానిపై తగని వలపేలగొంటి ॥నేనే॥

చ ర ణ ము.

దాశరాజు తన దౌహిత్రుని భూ - మీశుగా జేయుమని గోర నేల
దోసముశక గాంగేయు నేరితి - ద్రోసి రాజాను గాంతాలోలత॥ నే నే॥

ఉ. బాహుపరాక్రమాంచితుడు ♦ పౌరవవంశవివర్ధనుండు, ఘో
రాహవదోహలుండు నిఖి ♦ లాస్త్రవిదగ్రణియైన పిత సం
దేహముని జాహ్నవీతనయు ♦ నేటికి నే నొక పల్లెదానిపై
మోహముచే నధర్మవిధి బోలునె ♦ రాజ్యవిహీను జేయుటల్ ?

చ. పలువురు గేలి సేయ నిజ ♦ నందనుడుండగ పెండ్లియాశ ని
ర్మలగుణు జాపగాతనయు ♦ రాజ్యవిహీను నొనర్చి జాలు, న
య్యలికుల వేణిపై గలుగు ♦ నగ్గలపుందమి సైపజాల, నా
తొలపలె నూగులాడు మన ♦ మొద్దియు వోచ ది నేమి సేయుదున్.

గీ. అనుచు వలవంతగుందు శం ♦ తనుడు రాజ్య
పాలనము సేయ డాహార ♦ పానములి గ్ర
హింప డొక్కింత నిదుర వో ♦ డి విధాన
మరసి గాంగేయు డొకనా ♦ డనియెనిట్లు.

కన్నడ - రూపకము.

ప॥ ఈవిచారమునకు హేతు - వేమో యెరిగింపు తండ్రి ॥యీ॥
అ॥ ప॥ దేవేంద్ర విభవమున ధా - త్రీతలమును యేలు వాడ ॥ఈ॥

1. అవిధేయులుగారు పౌరు - లారయ శాత్రవులు లేరు
భవదీయ సంతతిగను నాజ్ఞకు - ప్రతికూలము లేదెన్నడు ॥ఈ॥
2. ప్రాకటముగ నీ కెందుకు - జేకూరని కోర్కె గలదె
నాకనదీసంభవుండ - నందనుండ నేనుండగ ॥నీ॥

ఉ. వాడిమగండ, వా దివిజ ♦ వర్గము సైతము ధైరి చూడగా
నోడు నిరంతరుండవు నృ ♦ పున్నత చాపకళాధురీణతన్
బోడిమి గన్న వాడవు మ ♦ హాభుజ, భోగ్యమి వాంఛితంబు పెం
పారగ దెల్పు మిందు మన ♦ సౌయి మనోరథమంతయు దీర్చెదన్ ॥౧౦

వ. అనిపల్కు దేవవ్రతు గౌగిలించుకొని,

కేదార - రూపకము

ప॥ నాయనా గంగానందన - నలినవైరికుల భూషణ ॥నా॥
అ॥ ప॥ సాయక విద్యారహస్య - సంవేదివి నీకెదురేది ॥నా॥

చరణములు

1. ఏకపుత్రు డనపత్యుడు ♦ నెందే నో రూపటంద్రు
నీకుదోడుగా బుత్రుల ♦ నేబడయ దలంచినాడ ॥నా॥
2. ఎనమండ్ర కుమారులగని ♦ యనిమిషనది నిను నా కిడె
తనలోనే గలిపికొనియె ♦ తక్కిన కొమరులనపుడే ॥నా॥

చ. మగటిమిగల్గువాడ వరి ♦ మర్దన, సాహసి కుండ వౌదు వె
న్నగ నటుగాన నీయునికి ♦ నమ్మగరాదు, వివాహమయ్యెదన్
దగిలెను నామనం బొక ని ♦ తంబినిపై నది దాశపుత్రి, య
మ్మగుదను నాకొసంగ దల ♦ షోయుచు తాననె నడ్డదిడ్డముల్.

వ. అనవిని గాంగేయుండు,

పూర్వకళ్యాణి - త్రిశగతి.

ప॥ నీమనోభిమతము దీర్తు - నికమిదియే నా ప్రతిజ్ఞ ॥నీ॥
అ॥ ప॥ ఏమాయెయి నాపల్లెతేని - నెటులో సమాధానపరచి ॥నీ॥
చ॥ వ్రతములు తపములు జపములు - పితృసేవకు సాటిగావు
"పితృదేవోభవ"యటంచు - వేదము వాకొనుగాదే ॥నీ॥

క. అనిపల్కి గంగకొడుకొ
య్యన బయనంబయ్యె నంత ♦ యమునకడను శం
తనుని వియోగము సైపమి
వనజాయతనేత్ర సత్య ♦ వతి పనరునిటుల్.

పున్నాగతోడి - మిశ్రగతి

ప॥ అందరానిపండ్లు - కాశింప ఫలమేమి
బయల గాలిలో మేడ - లల్లసార్థకమేమి ॥అం॥
అ॥ కందర్పశతకోటి - సుందరుడా తేని
పొందునాకెట్లబ్బు - మందభాగ్యురాలి ॥అం॥

చరణము

నమ్మి నాన బోసుకొంటి - పేర్మి
నాటి రాచవాని మాటలు నిజమని
నెమ్మొయిరాదేమిసేతు బేలనైతి
నీవియోగజలధి - నెట్లు గడచుదాన ॥న॥

చ. పురుషులనమ్మరాదు, పువ్వు ♦ బోడుల నిర్మల చిత్తవృత్తులం
దలచి, ప్రమోహబీజములై ♦ దగ వెదజల్లి యసత్యవాక్పయో
ధర జలధారలం దడిపి ♦ దర్పకతాప నిదాఘతీవ్ర దు
ష్కర కిరణప్రసారముల ♦ గాల్తు రభీష్టనవాంకురంబులన్.

తే. గీ. సత్యవతి యీవిధింగుందు ♦ సమయమందు
సురనదీ సూనుడా పల్లె ♦ దొరను జేరి
జనకు నభిమత మెరిగింప ♦ ననె నతండు
తొంటియట్లంత దేవవ్ర ♦ తుండు బలికె.

ఉ. అక్కర లేదు నాకు పర ♦ మాత్ముని సాక్షిగ రాజ్య మింతయు
న్నిక్కము మేదినీవరుడు ♦ నీమనుమండగుగాత; యేను న
ల్దిక్కుల గెల్చి యాతనికి ♦ దేజము పెంపును గూర్తు గావునన్
దక్కము సంశయం బభిమ ♦ తం బొడగూర్పుము నాదుతండ్రికిన్.

వ. అనిన విని దాశరాజును.

తే. గీ. ఆడితప్ప నెఱుంగుదు ♦ నది యటుండ
నీ కొమరు లేని మనుమలే ♦ నియు వివాద
మునకు ముందెన్నడే వత్తు ♦ రని తలంతు
దీనికేమి చెప్పెదు సమా ♦ ధాన మనఘ!

వ. అని పల్కు దాశరాజుంగని దేవవ్రతుం డిట్లనియె.

ఉ. ఆరయ బెండ్లియాడిన గ ♦ దా మరి సంతతి గల్గు చేరికే,
నూరక బ్రహ్మచారినయి ♦ యుందును పెండిలి మానుకొందు నా
సాసరమిత్ర చంద్రముల ♦ సాక్షిగ నమ్ముము; నీకు శంతన
క్ష్మారమణుండె యల్లుడగు ♦ కన్నను కొండొకభాగ్య మున్నదే.

వ. ఇట్లు రాజ్య పరిత్యాగంబును, బ్రహ్మచర్య వ్రత పరిగ్రహంబును జేసిన దేవవ్రతుని భీష్ముండని పొగడుచు సురలు సుమవృష్టిం గురిసిరంత దాశరాజు సంతసిల్లి యొసంగిన సత్యవతిం దోడ్కొని కరిపురి కరుగ శంతనుండును గాంగేయు నాలింగనం బొనర్చి.

తోడి - ఆది

ప॥ కురుకుల వర్ధన - గంగానందన - కొమరుడవన నీవే - నాకోర్కె దీర్చినావ ॥కురు॥

అ॥ సరిలేరీ ముజ్జగముల నీకు - సంభావ్య జితేంద్రియత్వమున నో ॥కురు॥

చరణము

రామ పూరు నరపతులుదక్క - గల - రా! పుత్రులలోనన్ - పితృ భక్తిరతులు ॥రా॥

నామనోభీష్ట మీడేర్చితివా-నాతండ్రీ స్వేచ్ఛాజీవివి గమ్మునో ॥కురు॥

శా. ఆలోచింపగ నాకు మాత్రము వివా ♦ హంబేల? నీయట్టి స
చ్ఛీలుం డాత్మజుడుండ; నింద్రియము లెం ♦ తే జంచలంబుల్; కుమా
రా! లోకుల్నను గాముకుండనుచు దూ ♦ రం జాతు రిప్పట్టునన్
జాలింపందగు నీవొనర్చిన ప్రతి ♦ జ్ఞల్నీవ దేవవ్రతా!

వ. అన విని భీష్ముండును.

సీ. పలికి బొంకని మహా ♦ త్ములకాలవాలమై
కొమరారు వంశంబు ♦ కురుకులంబు
విష్ణుపాదమున నా ♦ విర్భవించిన లోక
పావనిగంగాభ ♦ వాని తల్లి
ధర్మతత్పరుడవై ♦ ధరణి బాలించు శం
తనుడవు నన్గన్న ♦ తండ్రివీవు
పరశువుం గయిబూను ♦ పరమ మునీంద్రుడా
యగ్ని తేజుడుజామ ♦ దగ్నిగురుడు

తే. గీ. ప్రకట సత్యవ్రతుండ దే ♦ వవ్రతుండ
నట్టి నేనెట్టు పట్టిన ♦ పట్టువీడి

యమృతకిరణాన్వయఖ్యాతి ♦ నగ్గి గల్పి
ప్రతినగావించి తిరుగు ది ♦ ప్పగిది తండ్రి !

తే. గీ. ఆయురారోగ్యములు హెచ్చు ♦ నాశలడగు
యశము ప్రాపించు, నడుగంటు ♦ స్వార్థపరత
వెడలు హైన్యంబు తనుకాంతి ♦ పెచ్చు పెరుగు
నలరు బ్రహ్మచారులకు నా ♦ త్రైలోక్య మవల.

వ. ఇట్లు పలుక తనూభవు మనోనిశ్చలత్వంబున కబ్బురపడి శంతనుండు సంతసింప నంత నమాత్యవరులెల్ల కరిపురం బలంకరింప నొక్క శుభ ముహూర్తంబున.

కళ్యాణి — ఆది.

ప॥ సత్యవతీ శంతనుల వివాహము -జరిగె మహావైభవముగ నయ్యెడ॥స॥
అ॥ ప॥ నిత్యసత్యవ్రతుడుగాంగేయుడు-నిరుపమానందవార్ధి దేలగ॥స॥

చ ర ణ ము

ధరణింగల రాజన్యులెల్లరును-పరికింపగ కన్నులపండువుగా
మురిపెంబునసామజపురమునగల-ముగుదలెల్ల బేరంటముసేయగ ॥సత్య॥

తే. గీ. లలితసత్యవతీ శంత ♦ నుల వివాహ
వైభవము గాంచి యానంద ♦ వార్ధి దేలి
రెల్లవారు దంపతుల దీ ♦ వించి రంత
చేడెలు న్మంగళారతుల్ ♦ బాడిరిట్లు.

శ్రీ

# మహాభారతము

## భీష్మవిజయము

కాంభోజి - ఆది.

ప॥ గురుశిష్యుల సంగ్రామ కథవినుడు
గురుతరానందమందు డానాటి ॥గురు॥

అ॥ ప॥ నిరతధర్మతత్పరుడు భీష్ముడా
పరశురాము గయ్యమున జయించిన ॥గురు॥

చరణము

చిత్రాంగదుడు విచిత్రవీర్యుడన - పుత్రులనిర్వుర గనియె నాదాశ
పుత్రివారుయౌవనులుగాకుండ- పోయెదివికిశంతనుమహీవరుడు॥గు॥

చ. జనకున కుత్తరక్రియలు ♦ సల్పి పదంపడి దేవవాహినీ
తనయుడునిల్పె బేర్మి పెద ♦ తమ్ముని సింగపుగద్దెపై; నతం
డును సురసిద్ధసాధ్య గరు ♦ డోరగ దానవ మానవావళిం
గొనకొని చీరికింగొనడ ♦ కుంఠిత ఘోర రణాభిలాషియై.

మంజరులు

చిత్రాంగదుడను గంధర్వవిభుడు - చెలగి మహాసమరమున
చిత్రాంగదు నొకనాడు పోరాడి - చెనకె కురుక్షేత్రమున
ఆపగేయుడు విచిత్రవీర్యు రా - జ్యాభిషిక్తు గావించి
యాపై గాశీరాజుకూతుల స్వ - యంవర మాకర్ణించి
తమ్మునకు వివాహమ్ము సేయగా ♦ దలంచి తా ధనుర్ధరుడై
శీఘ్రమ్మున రథమెక్కి యొక్కరుడు వా ♦ రాణసీపురోన్ముఖుడై
చని యందు స్వయంవరమున మూగిన ♦ జననాథులు వెఱగుపడ
కొన కన్యల రథంబెక్కించు ♦ కొనిపల్కె పిడుగులుబడ.

శంకరాభరణము - త్రిశ్రగతి

ప॥ మీ సమున్న సన్నద్ధుడు - మీరో శూరమ్మన్యులు ॥మీ॥
అ॥ ప॥ నాస హాహాదరున కిల్లాం - ద్రంజేసెద నీముప్వుర ॥మీ॥
చ॥ జగమున గాంధర్వరాక్షస - వివాహములు త్తమములు
జగతీనాథులకుగాన - మగటిమి గన్పర్చి యిపుడె ॥మీ॥
సీ. అనిపల్కి కాశీ వి ♦ భునకు జెప్పి బిరాన
నరుగుచో రాజు లె ♦ ల్లరును దాక
నోడించి పెక్కుర ♦ నుగ్గాడి యేక వీ
రుండయి పోవ సా ♦ ల్వుండు గదిసి
పటుసాయకమ్ములం ♦ బ్రహరింప బ్రళయ రు
ద్రునివోలె భీష్ముండు ♦ క్రుద్ధుడగుచు
విరథు గావించిన ♦ విమనోరథుండు సా
ల్వుండును నిజపురం ♦ బునకు జనియె
తే. గీ. నంత శాంతనవుండు క ♦ న్యకల ముగుర
తమ్మునకు బెండ్లి సేయ యం ♦ త్న పడుచుండ
నందు బెద్దదియగు నంబ ♦ యనియె నను వ
రించె సాల్వుండు సాల్వు వ ♦ రించితేను.
క. అనవిని గాంగేయుం డం
బను సాల్వుని కొఱకు విడిచి ♦ వర శుభలగ్నం
బున తన యనుజాతున కొ
య్యన బెండిలి జేసె నంబి ♦ కాంబాలికలన్.
వ. అంత నంబయు సాల్వునికడ కేగి తా వచ్చిన విధ మెరింగింప నతండును "భీష్ముచే నంటబడి రథంబున నుంచబడితివి గాన నిన్నొల్ల" ననుచు మందిరము వెడల నడిచిన నాపెయు భీష్ముని కడ కేతెంచి తన యవస్థ నివేదించుకొన శాంతనవుండును "నీవ న్యాను రక్తచిత్తవు గాన నిన్ను నా తమ్మునకు వివాహంబు

సేయనొల్ల” ననిన నంబయు నుభయభ్రష్టయై కొనకు మున్యాశ్రమం
బుల పొంత తపం బొనర్ప నుద్యోగింప నామె మాతామహుం డగు
హొత్రవాహనుం డను రాజర్షి వచ్చి తద్వృత్తాంతంబు విని యంబను
పరశురాము నాశ్రయింపజేయ నమ్మహానీయుండు నంబను వెంట
నిడుకొని కురుక్షేత్రమ్ము్మనం గల సరస్వతీతీరంబున విడిసి దేవవ్రతుం
బిలువనంప నతండు నయ్యెడకుం జని జామదగ్ని నర్చించుచు,

శ్రీరాగము - ఆది

ప॥ గురువరేణ్య తావకపల్లవమృదు-చరణంబులకివెనానమస్కృతులు॥
అ॥ప॥ శరణాగత వత్సలుడవుకరుణా-శరధివంబుజాసనతుల్యుండవు॥గు॥

చ ర ణ ము

విత్తమందున నిరాశయుఁ సమర-విజయంబును సత్యవ్రత దీక్షయు
చిత్తశుద్ధియున్ బ్రహ్మచర్యసం-సిద్ధిగలుగ నాశీర్వదింపుమా ॥గు॥

సీ. మిక్కిలికంటెసా ♦ మింగొల్చి కఱకుట
 మ్ములవిద్య కడముట్ట ♦ దెలిసినావు
బిరుదురామగల సం ♦ బరము లొకేడ మాపి
 కేలగాజులు దొడి ♦ గించినావు
తూలించి మన్నింద్ర ♦ నేలనాల్గుచెఱంగు
 లొగ్గి బాపలకు దాన ♦ మొసగినావు
యెక్కిమీరాంద్ర రక్తంపు ♦ టేఱులం బాఱించి
 పితరులం దృప్తిగా ♦ వించినావు
తే. గీ. తపసిమిన్నవు నాల్గు వే ♦ దములెఱుంగు
 దిట్ట వాత్మైక వేద్యుండ ♦ వట్టి నీకు
 దిన్నసగుభక్తి భాగీర ♦ థీసుతుండు
 శిష్యపరమాణు విదె నమ ♦ స్కృతియొనర్చు.
వ. అనవిని జామదగ్ని దేవవ్రతుం జేరదీసి బుజము దట్టుచు,
ఉ. నీసుగుణంబు లన్నియును ♦ నేవిని సంతసమందుచుంటి నేఁ
 డే సరిరారు నీకొరులు ♦ శేఖరచి రింయ్యాషువిద్య నాకడన్

భూసుర భూమిపాన్వయులు ♦ బోలరు నిన్నెవరైనగాని శా
బాసు! భవన్నిమిత్తమున ♦ భవ్యయశం బొనగూడెనాకునున్.

ఉ. తమ్ముని పెండ్లి కంబనువ ♦ దాగొని తెచ్చి పరిత్యజించినా
విమ్మయి తా ననాథయయి ♦ యేన్చుచు నాశ్రయముం దెనన్న పా
యమ్మగు వాడుదాని యును ♦ రంటిన, దుర్యశమబ్బు, గావునన్
దమ్మునకిచ్చి పెండిలియొ ♦ నర్చుము నా పలు కాలకింపుమా.

వ. అనవిని యాప గేయుండును.

ఫలయమూరుతము - చతురశ్రగతి.

ప॥ తెలియనిదేమున్నది సర్వజ్ఞులుఁ కలితధర్మ వేత్తలు గురువర్యులు ॥తె॥

అ॥ ప॥ వలపుగలదుసాల్వునిపైతనకని - పలికినందునపరిత్యజించితిని॥ తెలి॥

చ ర ణ ము.

చనువుమాలి కోపించినం జెప్ప - జాలగాని కాలాహింవిధంబున
ననను రాగ దాంపత్యము కుల నా-శన కారణముగుగా దే తలపగ॥ తె॥

తే. గీ. సమధి కాశ్రితపక్షపా ♦ తమున నిట్టు
లంటి రేకాని వాసు దే ♦ వాంశజులు భృ
గూత్తములునైన మీకు శి ♦ ష్యుడను నాకు
తప్పునని నేత గల్గునే ♦ యెప్పుడైన?

వ. అనవిని జమదగ్ని కుమారుండును కోపియై.

ఉ. ఈ వనితాలలామయెడ ♦ నించుక లోపము గల్గబట్టియే
యీ విషయంబు మావఱకు ♦ నిట్టుల వచ్చుట, మేము సెప్పుటల్,
నీవు తృణీకరించుటయు ♦ నేడు తటస్థములయ్యె; మూర్ఖ మొం
తేవిడు మింతమాత్రమున ♦ క్షీఫ నధోగతిపాలు జేసెదే?

బిలహరి - చతురశ్రగతి.

ప॥ నాయానతి జవదాటెదవా - నన్నునీవెఱుగవా శాంతనవా ॥నా॥

అ॥ ప॥ సాయకాగ్నిపాల్జేసి నిన్ను నీ
సహజన్మునిసమయింతు నిప్పుడే ॥నా॥

చ ర ణ ము.

వీరుడవని గర్వించితివా నను - భీరునిగా భావించితివా ॥వీరు॥
పోరినాపరశుధార తెలియవా-యోరినిమిషమాత్రమున్ననపోలియవ॥నా॥

తే. గీ. ఈపె కీవెద్దియే గతి ♦ జూపవేని
యెవ్వడేని మఱొక డాద ♦ రింపడేని
దురిత మీయము యౌవన ♦ దుర్మదమున
సేయ, తద్దురితంబు ని ♦ న్జెందుజుమ్ము.

తే. గీ. సహజవైరంబు క్షత్రియ ♦ జాతియందు
నాకుగలదది మాను కొ ♦ న్నాడ కొంత
కాలమునునుండి ఛాత్రులు ♦ గా గొని మిము,
చెనటివై యొడల్ రగుల జే ♦ సితివి మరల.

వ. అని పలుక జామదగ్న్యంగని భీష్ముండును

ఉ. అంటివిగాని సేయగల ♦ వా సమరమ్ము గుమారుతోడ, ము
క్కంటికి సాటివచ్చు మొన ♦ గాడవు నీ కెదు రేది? పోర న
న్నంటిన నీకు గల్గునొకొ కీరితి ? ♦ నేను జయంబునంది పే
ర్గొంటివయేని యాపయిని ♦ లోకులు కాకులు గేలిసేయరే ?

తే. గీ. అనినవిని జామదగ్ని కా ♦ లానలంబు
వోలె మండుచు మొనలేర్చి పో ♦ ర రమ్ము
వేగ వాక్చాపలత గట్టి ♦ పెట్టు మనగ
కనలి యిట్లనె గురునితో ♦ గంగకొడుకు.

కేదారగౌళ — ఆది

ప॥ నీకఱపినయానాటి మేటి విలు - నేరుపుజవిజూచెదవో గురువర ॥నీ॥
అ॥ ప॥ రాకొమరుడ నాపై మీశిష్యుడ-రణమన్నను వెనుదీయుదు నేభళి॥
చ॥ భూసురుడవు, గురుడవు, పూజ్యుడవని-నే సందేహించితి నింతదనుక
నీ సమరము తప్పక వచ్చెగాన-నిదెనిల్చితి నీతోనని సేయగ ॥నీ॥

చ. ఇరువది యొక్క మారులు ధర ♦ ణీశుల గెల్చితినంచు సారెకున్
గరువము లాడుచుందు వట ? ♦ నా దరి కుంజరవార వీరికే

సరి సురవాహినీసుతుడు ♦ శాంతనవుం డుదయింప కుంటచే
బిరుదముసెల్లె; జెల్లదిక ♦ బీరము, లీవును నన్నెఱుంగవే.

తే. గీ. సేనలేటికి మున్ను మీ ♦ సేవజేసి
నే గడించిన విద్యయే ♦ నేడునాకు
సమరతలమందు నిలుచు బా ♦ సటగ, విజయ
కరము తావక పదభక్తి ♦ గురువరేణ్యా !

కం. అనిపల్కి సర్వమయ్యది
చనుదెంచియు విన్నవించి ♦ సత్యవతికి; నా
య్యనవచ్చి రథముడిగి వా
కొనియెన్ గాంగేయుడిట్లు ♦ గురువర్యుని తోన్.

సీ. భృగుకుల క్షీరవా ♦ ర్నిధి పూర్ణచంద్రాయ
పరశురామాయ తు ♦ భ్యం నమోస్తు
సజ్జన స్తుతిపాత్ర ♦ జమదగ్ని పుత్రాయ
పరశురామాయ తు ♦ భ్యం నమోస్తు
సమరశోషిత సమ ♦ స్త ధరాధి నాథాయ
పరశురామాయ తు ♦ భ్యం నమోస్తు
అఖిలాస్త్ర శస్త్ర వి ♦ ద్యా రహస్యజ్ఞాయ
పరశురామాయ తు ♦ భ్యం నమోస్తు

తే. గీ. పుణ్యశీలాయ భూరిత ♦ పోధనాయ
సచ్చిదానంద రూపాయ ♦ శాశ్వతాయ
గురువరేణ్యాయ ధారుణీ ♦ సురవరాయ
వాసుదేవాంశజాయ తు ♦ భ్యం నమోస్తు.

తే. గీ. నేను రథమందు మీరు క్షో ♦ ణీతలమున
నిలిచి యుద్ధంబుసేయుట ♦ నీతిగాదు
మీరరద మెక్కుదురో ? నన్ను ♦ తేరువాయు
మందురో సెలవిందు మ ♦ హానుభావ.

వ. అనిపల్కు గాంగేయుంగని సంతసించుచు నత్తపసి తే డిట్లనియె.

బాగు—ఆది.

ప॥ కరమానందించితి నీ భక్తికి - గాంగేయా భువనత్రయగేయ ॥క॥
అ॥ప॥ నెఱినమస్కార మొనరుపకున్నడ-నినుశపించిచంపుదునీపాటికి॥క॥
చ॥ భళిభళిరా భారతవీరుండవు - భాగ్యమేమందు నా శిష్యుండవు
బలునోములు తానేమినోచెనో - భాగీరథి నిన్గంట కబ్బాయి ॥కర॥

క. అనిపల్కి జామదగ్నియు
మునుకొని రథమెక్కి సమర ♦ మున ముంగట భీ
ష్మునిపై శరవర్షము గురి
సిన నయ్యవి రథము చెంత ♦ జేరకయుండన్.

తే. గీ. శంతనుసుతుండు వారించి ♦ సరగనొక్క
భల్లమున భృగురాముని ♦ విల్లు విఱుగ
గొట్ట నొండొక విలుగొని ♦ కుపితుడగుచు
రాము డేసెను తీవ్రమా ♦ ర్గణశతంబు.

క. సాయక నికరమ్మున గాం
గేయుడు గురునంగకములు ♦ గిఱిగొననేయన్
గాయమ్ము సుడివడన్ మూ
ర్ఛాయత్తుండగుచు సోలె ♦ నరదమ్ముపయిన్.

వ. అంతగొంతతడవునకు మూర్ఛదేరి,

నాట - చతురశ్రగతి

ప॥ వీరుడవగుదువు గాంగేయానా-విల్లుదునిమి మూర్ఛిల్లజేసితివి ॥వీరు॥
అ॥ప॥ లేరునీకన్నముల్లోకమ్ములు-పోర నన్నోర్చుశూరమ్మన్యులు॥వీరు॥

చరణము

బాగుబాగు, గర్వింపవలదునీ-పదుచుదనపుబింకమ్ములు మానుము
సాగవింక నీయాటలునాకడ- సరి నేటితోడనే నీయాయువు॥వీరు॥

తే. గీ. అనుచు మరుదస్త్రమేయ గు ♦ హ్యాకశరమున
దానివారించె శంతనా ♦ త్మజుడు మఱియు
పావకాస్త్ర ప్రయోగంబు ♦ వారుణాస్త్ర
నిహతిభంగించె దానమా ♦ నియును గినిసి.

తే. గీ. సాయకంబొండు భీష్మువ ♦ క్షస్థలమున
నాటనేయగ నొచ్చిశం ♦ తనుసుతుండు
నరదమున సోలిపడియెనం ♦ తంతనున్న
తపసు లంబయు నార్వ చై ♦ తన్యముడిగి.

తే. గీ. కురుకులుడు మూర్ఛదేఱిభృ ♦ గుప్రవరుని
మగిడి సాయకధారాని ♦ మగ్నుజేసి
కదిసిపోరాడ నిట్టు లి ♦ ర్వదయురెండు
దివసములు సెల్లె మఱునాటి ♦ బవరమందు.

సం ౦ జ హ ఱ

గంగకొడుకు మూర్ఛిల్లజేయ భార్గవుం దెలిసి ధృతిమించి
గాంగేయున్ మూర్ఛిల్లజేసె భార్గవుడుసూతున్ వధించి
తెలిసియొక్కింత పోరిభాగీరథీసుతుడు నాటిరేయి
కలలో వసువులు మోహనాస్త్రమిడ గన్ను దెఱచి దళవాయి
మరునాటి కయ్యమున దదస్త్రమున్ గురునిపై నేయగడగ
దరికేగుదెంచి నారదుండు త్తరమునం బల్కెవడిగ.

భైరవి - రూపకము

ప॥ ఏయకుమేయకుమో గాం - గేయమోహనాస్త్రంబిటు ॥లేయ॥

అ॥ప॥ ఓయన్నా గురుడుదీని - కుపసంహారమ్ము దెలియ ॥డేయ॥

1. గురునవమానించు టెపుడు - కూడనిపనినీబోంట్లకు
కురుకుల వర్ధనుడ వస్త్ర - కోవిదుడవు నీతివిదుడ ।వే॥

2. పరశురాముకడ నేర్చిన - శరవిద్యయె చూపుదునని
స్మరియించితివన్యదత్త - శరమీవిధి సత్యరతుడ ॥వే॥

ఉ. మీరిన కౌతుకంబునను ♦ మీగురుశిష్యుల సంగరంబు గ
న్నారగన న్విమానచరు ♦ లై సురలోకసమందు నిల్వగా
వీరుడవై, ధనుర్నిగమ ♦ వేత్తలకెల్లను మిన్నవై వసు
స్మారితమోహనాస్త్రమున ♦ సత్యముదప్పిగురున్ జయించెదే.

వ. అనవిని కురుప్రవరుండును.

తే. గీ. "గురునితో నాపగేయుండు ♦ గ్రుద్ధులాడె"
నన్నమాట రానేవచ్చె ♦ ననఘ ! మోహ
నాస్త్రమేయక మాన నే ♦ మైన గాని,
శంతనుసుతుండు రాముచే ♦ జావవలయు
గాని చో లొంగవలయు భా ♦ ర్గవుడు నాకు.

కం. అనిన విని నారదుడు గ్ర
న్నన వసువులచేత భీష్ము ♦ నకు జెప్పింపన్
వినెనాతడు ; జమదగ్నియు
బనివడి సందనున కిట్లు ♦ వాకొనె నంతన్.

కాంభోజి - ఖండగతి

ప॥ చాలింపుమా పోరు - శాంతనవుతో నేడు
సామాన్యు డితడు గాడు - భువనత్రయవీరుడు ॥చా॥

అ॥ ప॥ పోలదీ దీర్ఘవైరము విప్రజాతికొగి
యాలింప లేదెనీవు బ్రా - హ్మణస్యక్షణం కోపమన ॥చా॥

చరణము

విసివి వేసారితివి - వసుమతీనాయకుల
గసిమసంగిరణంబుల - నిరువదియొక్క-మారు ॥విసి॥
వసుమూర్తి నితని నీ - వశముగాదు వధింప
స్వచ్ఛందజీవి యతడు నా - తండ్రీ నామాటలు విని ॥చాలిం॥

తే. గీ. శాపమును చాపమును ముఖ్య ♦ సాధనములు
శత్రువధకునై బ్రాహ్మణ ♦ క్షత్రియులకు ;
బాపలము తాపసులమందు ; ♦ పాపకృత్య
మేటి కీయని సేత శాం ♦ తింపుమయ్య !

క. జమదగ్ని పరశురాముని
సమరము మానుమని చెప్ప ♦ సమయంబున న

య్యమరనదీసుతుడుం జని
నమస్కృతి యొనర్ప గురుడు ♦ నలరి యనెనిటుల్.

ఉ. అంచితబాహువిక్రమస ♦ హాయుడవై నవమోహనాస్త్ర మా
ర్జించి ననున్ జయించితి "వా ♦ కించుక బంటుతనమ్మునన్ గురు
న్మించెను శిష్యుడంచు" నిను ♦ మింటను మేదిని సన్నుతింప నా
లించుచు గర్వపేయముగ, ♦ నే మనుదుం జిరకాలజీవినై.

వ. అని పల్కి యంబం గని.

ఉ. వాడిమగండు పేనిగెలు ♦ వందరమేరికి నైనగాదు, పో
రాడితి శక్తికిన్మిగిలి, ♦ యంతయు నిష్ఫలమయ్యె, పొమ్ము నీ
వేడకుబోయెదో యచటి, ♦ కెంతయు బ్రజ్ఞకు బెన్గులాడితిం
బోడిమితప్పె గార్య మిక ♦ బోదుపరాభవ మెన్ని భంగులన్.

వ. అని పల్కినంబయు దపంబు పెంపున జన్మాంతరంబున నైనను భీష్ముని వధింతుననుచు యత్నేచ్ఛంజనియె నంత బరశురాముండును గాంగేయుని వీడ్కొలిపి మహేంద్రశైలంబునకుం జన భీష్ముండు నిల్లుసేరి తద్వృత్తాంతంబెల్ల సత్యవతికి నివేదించి సంతసంబుననుండె.



శ్రీ

# మ హా భా ర త ము



## పాండవ జననము



యమునా కళ్యాణి__ఆది

ప॥ పాండవ జననకథవినుడు శ్రుతి-పర్వముగా వినిపింతు నేడు-కురు॥పా॥

అ॥ప॥ పుండరీకాక్షు బావమరందులు-భండనపండితు లగ్ని తేజులా॥పాం॥

చ ర ణ ము.

కామినీ భోగరసలాలసుడై - కాశీరాజ తనూజలం దగిలి
కాముకేళి మితిమీరి దేలుచుం - గలసె పెద్దల విచిత్రవీర్యుడున్॥

సీ. అంత సత్యవతి శో ♦ కార్ణవ మగ్నయై
యనె నొక్కనాడు శాం ♦ తనవుతోడ
నాయనా ! గాంగేయ ♦ నీయెఱుంగనిదెద్ది .
నీ సోదరుల్ మర ♦ ణించిరట్లు;
కురువంశమునకు నొ ♦ క్కరుడవే మిగిలి యు
న్నాడవ్వు, ముగియు నీ ♦ తోడనదియు
కువల యాప్తుడు మొద ♦ లొక్కని నేటివఱకు వ
చ్చిన వంశ మింక వి ♦ చ్ఛిన్నమగును

తే. గీ. తల్లిదండ్రులనుడి జవ ♦ దాటవెపుడు
మత్ప్రియంబుగ ధారుణీ ♦ మండలంబు
నీవ చేకొని యేలుమో ♦ యీ కుమార!
తగ వివాహమ్ముగమ్ము సం ♦ తతిని గనుమ

వ. అన విని భీష్ముండును.

తోడి - త్రిపుట

ప॥ ఆడితప్పుట దోసముగుగద - అమ్మరో! నీవే యెఱుంగుదు ॥వాడి॥
అ॥ ప॥ నాకు రాజ్య పరిత్యాగమున్ - బ్రహ్మచర్య వ్రత దీక్షయున్
జరుప బ్రతినయొనర్చి నేడీ - జాడ నడచిన బరిహాసింపరె ॥అ॥

చ ర ణ ము

హిమకరుడు శైత్యమరుగు తే - జము హుతాశను డుష్ణత్వమును
క్రమత విడిచిన విడుతునే నా - గైకొనిన వ్రతమెన్న డేనియు ॥వాడి॥

క. నాదగు శపథంబూరక
   పోదు, పృథివ్యాది పంచ ♦ భూతమ్ములు గం
   ధాదిగుణమ్ముల విడువని
   మాదిరి మత్కృత ప్రతిజ్ఞ ♦ మానను తల్లీ!

ఉ. హైహయు కారణంబున ధ ♦ రాధిపులన్ వధియింప నెల్లరన్
బాహుపరాక్రమాంచితుడు ♦ భార్గవరాముడు లోకమంతయున్
బాహుజశూన్యమై వెలయు ♦ పట్టున సంతతినిల్పి రంచితో
త్సాహ మెలర్ప బ్రాహ్మణులు ♦ తన్మృతరాజకులాంగనాళికిన్.

సీ. కావునను త్తమ ♦ క్షత్రియక్షేత్రము
      లందుజనించి బ్రా ♦ హ్మణులవలన
   గలరనేకులు వంశ ♦ కరులగు క్షత్రియుల్;
      మహితాత్ము ననఘు ధ ♦ ర్మస్వరూపు
   విప్రోత్తము 'విచిత్ర ♦ వీర్యక క్షేత్రము
      లందు సంతతి నిల్పు' ♦ మని నిలుపుద
   మనిన నాలించి స ♦ త్యవతి పారాశర్యు
      జననంబుదెల్పి భీ ♦ ష్మునకు నమ్మ

తే. గీ. నింద్రుడీవంశముం బ్రతి ♦ ష్ఠించునంచు
   వ్యాసభట్టారకుం దలం ♦ పగ నతండు
   పింగళజటాభరంబు వె ♦ లుంగ, నీల
   విగ్రహారాళరుచులు దీ ♦ పింపవచ్చె.

వ. వచ్చిన మానింగని

ధన్యాసి . రూపకము.

ప॥ అక్క—అగల్గి తలంచితి-నన్నానిన్దపసిమిన్న ॥అ॥

అ॥ ప॥ నిక్క—పుమానిసివి గాన - నీవరుదెంచితివి మంచి ॥అ॥

1. ఆవిధి గంధర్వనిహతు - డై చనె చిత్రాంగదుండు
జీవమ్ముల్దొరగెనావి - చిత్రవీర్యుడున్ క్షయచే ॥న॥

2. వినుమీవంశము నేటికి - విచ్ఛిన్నము కానయ్యెను
నినుదలంచితింగావున - నీవీకుల ముద్ధరింపు ॥మ॥

ఉ. ఆయతకీర్తి దండ్రికి బ్రి ♦ యంబొనరింప బ్రతిజ్ఞజేసి గాం
గేయుడుపెండ్లి మానుకొనె, ♦ కేవల మీకురువంశ మాగి పో
నాయెను, శాస్త్రసమ్మతమె ♦ యాగద! యంబికయందు దేవర
న్యాయముమై నపత్యజన ♦ నం బెలయించి కులంబు నిల్పుమా.

వ. అనవిని వేదవ్యాసుండును.

ఉ. ఆకలముల్గ్రసించుచు వ ♦ నాంతర భూముల దుర్మదేంద్రియో
ద్రేకము రూపుమాపి నియ ♦ తిన్ విషయమ్ములపొంతబోక దూ
రీకృత పాపులౌ మునివ ♦ రేణ్యుల కీతగులమ్ము లేల? కాం
తాకనకాభిలాష జడ ♦ దారులకుం గడుదూర మమ్మరో!

ఉ. తాలిమి తన్ను గన్న తలి ♦ దండ్రులుజెప్పినయ ట్లొనర్చుచో
నాలుగువేదము ల్చదివి ♦ నంత ఫల మ్ముచితజ్ఞురాల వా
వేలుపుటవ్వ బోలుదువు ♦ వెన్నెలరేని కులంబునిల్పుదు
న్నీలలితోక్తులం బరిగ ♦ ణించి మనీషులు మెచ్చునట్లుగన్.

తే. గీ. అనినవిని నాటిరేయి స ♦ త్యవతి యంపె
ఋతుమతియు శుచిస్నాతయు ♦ మతిమతి యగు
నంబికన్ వ్యాసుకడకు గు ♦ లంబునిల్ప
నగు తనూభవు గనుమంచు ♦ నవ్వనితయు.

మంజరులు.

మునినాథుని కపిలగడ్డమ్ము జడ - లును గన్నులుబరికించి
కనుంగవ మొగిచి తెలివకయుండెన్ - మనమ్మున సేవగించి

దానికిం బుత్రదానంబుసేసి - తపసియనె సత్యవతికి
దీనికంధుఁడగు కొడుకుబుట్టు మా - తృదోషముననని యులికి
మఱునాఁడంబాలికనంప నాపె - వెఱచి వెల్లనై యున్న
బరికించి పాండురోగి పుట్టునని ♦ పలికె నత్తపసిమిన్న
అంబికకున్ ధృతరాష్ట్రుఁడుదయించె - నంధుఁడై మహాబలుఁడై
యంబాలికకుం బాండురా జుదయ - మయ్యె బాండుదేహుండై.

క. సత్యవతీ మనమ్మున
వసరి పరాశరతనూజు ♦ బ్రార్థించి సుల
క్షణ యుక్తుఁడైన పుత్రుని
గనుమని నియమించె నంబి ♦ కను తా మరలన్.

ఉ. రోసిమునీంద్రు నవ్వికృత ♦ రూపమునారసి నెమ్మనమ్మునన్
దాసినలంకరించి జడ ♦ దారికడన్ శయనింప బంచినన్
వ్యాసున కిష్టభోగము ల ♦ వారిగ గూర్చి దాసి తృప్తునిన్
జేసి తనూజు నొక్కని గ ♦ నెన్ విదురున్ సమవర్తి సన్నిభున్.

వ. అంత ధృతరాష్ట్ర పాండుకుమారులు భీష్మాభిరక్షితులై పెరుగుచు నుపనయనానంతరంబున నధ్యయనం బొనరించి సర్వ విద్యా పరిపూర్ణులై యున్నంత గాంగేయుం డాంబికేయుని రాజ్యాభిషిక్తుం గావించి, విల్లును విదురుబుద్ధియును సహాయంబులుగా రాజ్యంబు రక్షించుచున్నంత హస్తిపురంబు రాజధానిగా ధృతరాష్ట్రుండు రాజ్యంబుసేయుచు నారూఢయౌవనుండగు నంత శాంతనవుం డతనికి గాంధారపతియగు సుబలుకూతు గాంధారియను సుందరీమణిం బరిణయంబు గావింప నా గాంధారియుం బరపురుష సందర్శనంబు పరిహరించి నేత్రపట్టంబు గట్టుకొనియుండె నంత నాంబికేయుండు శ్యాలకుండగు శకునిసహితంబుగ గరినగరంబున కరుదెంచి యేకలగ్నంబున నధికసంతానంబును గన సత్యవ్రతమున్నగు మరదండ్రం బదుండ్రను మఱియు నూర్గురుకన్నియలను వివాహంబయ్యె నింతలో యాదవ విభుండగు శూరుండనువాడు తన పెద్ద కూతురగు వసుదేవు చెలియలిం బృథయనుదాని నపుత్రకుండగు

కుంతిభోజునకు గూతుగా నొసంగ నాపెయు దండ్రియింటికి రుదెంచు నతిథిజనులకు మృష్టాన్నంబు బెట్టుచు నొకనా డతిథియైవచ్చిన దుర్వాసునకు గోరిన యాహారంబుపెట్టిన నమ్మునియుం దృప్తుండై యొక్కమంత్రం బుపదేశించి "యీ మంత్రంబున నే వేల్పు నారాధింతు వా వేల్పు నీకోరినపుత్రకుల నిచ్చు" నని యొసంగించి యథేచ్ఛం జనియె నంత నాకన్నియ తన్మంత్రశక్తి యెఱుంగదలచి యొకనా డేకాంతంబున గంగకడకుజని మంత్రపఠనం బొనర్చుచు నాదిత్యుంబోలు కుమారుంగన దలంచుచు భాస్కరునకర్ఘ్య మొసంగి యిట్లు వినుతింపదొడగె.

జంఝూటి - చతురశ్రగతి

ప॥ దేవదేవ శరణాగతరక్షణ - దీనపోషణ పూషా నమోనమో ॥దే॥

అ॥ప॥ సేవితాశేషదేవనికర రా-జీవబాంధవ ప్రభో నమోనమో ॥దే॥

1. ఆదిదేవ సకలాగమసన్నుత - వేదవేద్య పరమాత్మా నమోనమో
మోదితాఖిలచరాచర భూతస-ముదాయ దినేశా నమోనమో ॥దే

2. సూరచండకర ఛాయామనోహర-సుప్రసన్న పరంజ్యోతిన మోనమో
ఘోరపాతకవిదూరభక్తజన- పారిజాతభవదూర నమోనమో ॥దే॥

క. అని ప్రార్థించిన కుంతీ
వనజాయత నేత్రకడకు ♦ వచ్చె నినుండున్
గని ఘనలజ్జాభయములు
బెనగొనగెల్చొచ్చిపలికె ♦ పృథ భానునితోన్.

చ. నిలువు మొకింతదూరముగ ♦ నీకిది ధర్మముగాదు, బాల్య చా
పలమున ముందురానగు న ♦ పాయమెఱుంగక మంత్రపున్ బిగిం
దెలియనినున్ స్మరించితిని ♦ తేకువమాలి, దయామయుండ వీ
యలజడిమాన్పు మెంతపని♦యయ్యె!మహాత్మ!క్షమింపుమానమున్.

ఉ. మాటికి "కుంతిభోజుని కొ ♦ మారిత పెండిలిగాకమున్నె తా
జేటును బాటెఱుంగక యి ♦ సీ! చెడుదారి జరించెనంచు గ
న్పాటుగ నమ్మలక్కలు బ ♦ జారున జెప్పుకొనంగ జూతు రీ
లాటివి" నూరునోములొక ♦ ఱంకున బోవుగదా దివాకరా!

ఉ. చాలి నిజానిజమ్ములవి ♦ చారణసేయగలారులేరు, క
ల్లోలము బెంచి తప్పనుచు ♦ లోకులనైజము; గడ్డిపోచకుం
బోలనివారునైతమును ♦ నుందురకీర్తురు కాలుద్రువ్వి క
య్యాలకు, నాడువాండ్ర తగ ♦ వందరు దిద్దగ పెద్దలేజుమీ.

గీ. ఇంతయేటికి లోకులే ♦ మేమొయాడి
పోసుకొందురటంచు వా ♦ పోవనేల?
గంగలో దానమాడగా ♦ గదలివచ్చి
యింటికిం జంక బిడ్డతో ♦ నెట్లుపోదు?

భూపాల - రూపకము

ప॥ ఏమానవజాతి దాన - నీవోబ్బెందారకుండ ॥వే॥
అ॥ ప॥ యీామాదికి తగులంబెం - దేనిగలదె సర్వజ్ఞుడ ॥వే॥
1. సకలజగంబులకు నీవ - సాక్షీభూతుడవుగావ
ప్రకటకన్యకావ్రతమ్ము - భంగింతువె యీావిధమ్ము ॥యే॥
2. నాయపరాధము సైపుము - నాకీయలజడి బాపుము
నీయంతటివానికెట్టు - నేరుతు నీతి విధింపగ ॥నే॥

తే. గీ. తానయైె తలనిడుకొని ♦ కానిమాట
కన్నవారికి దలవంపు ♦ గా జిరమ్ము
బ్రతుకుకన్నను నభిమాన ♦ వతియటన్న
పేరువడి యొక్కపూట జీ ♦ వింప మేలు.

వ. అనవిని భానుండును

సీ. పాలతిరమ్మనవచ్చి ♦ పొమ్మనబోవ నీ
యింటిబంటని యను ♦ కొంటివేమొ?
యూరకేబోవు న ♦ న్నారసిదేవతల్
పరిహాసింపరో? మంత్ర ♦ పటిమచెడదొ?
దేవమానవులకెం ♦ దేనిట్టి సంబంధ
మున్నట్టు దృష్టాంత ♦ ములును గలవు
కను మహాల్యాశచీ ♦ కాంతులకూటము
కన్యకాత్వమ్మభం ♦ గమ్ముగాదు

తే. గీ. దాశకన్యకతోడ బ ♦ రాశరుండు
తగులొనర్పడె ? తెలియ కుం ♦ డంగనొరుల
కీరహస్యమ్ము గాపాడు ♦ భారమెల్ల
నాయదియె, సంశయింపకు ♦ తోయజాక్షి !

కం. అనిపల్కి కన్యకాత్వం
బనపాయస్థితి వహించు ♦ నట్లు వరంబి
చ్చి నవాంభోజహితుండు
న్వనజాయతచారులోచ ♦ నం గరుణించెన్.

కళ్యాణి - ఆది

ప॥ సద్యోగర్భంబున బుత్రుడొకడు - జననమయ్యెగుంతీవనితామణికి ॥స॥
అ॥ప॥ ఖద్యోతసమాన తేజముసహజ - కవచకుండలయుగమ్ముదీపింప॥స॥

చరణము

చెన్నుమీరు నెమ్మోముసొంపైన - కన్నుదోయిబంగరుమై చాయయు
పున్నమవెన్నెలనేలు నునుపాల - బుగ్గలున్ సన్న నొకానుగల్గి ॥స॥

కం. అంతనొకంతకు గుంతియు
సంతోసమ్మును విచార ♦ సంభ్రమ భయముల్
వింతగ దన్నలముకొనం
గొంతవడికి బాలునెత్తు ♦ కొని తలపోయున్.

సీ. శిశువు నెత్తుకయిల్లు ♦ జేరుదునా ? తల్లి
దండ్రులు నన్నన్య ♦ ధాతలంతు
రీతనూజాతునిం ♦ దే డించి పోదునా ?
కర మట్లు సేయగా ♦ గాళ్ళురావు
మంత్రప్రభావసం ♦ భవుడీతడందునా ?
నామాట లెవ్వరు ♦ న్నమ్మబోరు
మఱియీ రహస్యమె ♦ ల్లరెఱింగిరా ? యవి
వాహితనై యుండ ♦ వలసివచ్చు

తే. గీ. మౌనినాకేటి కీపాడు ♦ మంత్రమిచ్చె
నిచ్చెబో దీని నేబరీ ♦ క్షింపనేల ?

కనులు దెఱవని చిఱుతపా ♦ పని ద్యజించి
యకట! నేగుండెరాయిజే ♦ సుకొనవలసె.

ఉ. కాంతలకేటికీ తగవు ♦ గాని యనర్థముల్ రజస్వలా
నంతరపున్ వివాహములు ♦ యావనదుర్మద మీరహాస్యపున్
సంతతిగూర్చ నద్ది కలు ♦ షప్రదమై మరణప్రదమ్మునై
యంతముసేయు వంగడము ♦ లంగజుధాటి వశంబె సైపగన్?

వ. ఇట్లు విచారించుచు గాపుకావని యేడ్చుకొమరుంగని,

ఉ. ఏడువబోకు మూరడిలు ♦ మేడువకేడ్వకుమోయి తండ్రి! నే
చూడగలేను, కోపమున ♦ జుట్టములు న్నను కొట్టి తిట్టి రా
పాడగనిమ్ము, పట్టి సరి ♦ వారలు నన్వెలిబెట్టనిమ్ము ని
న్నీడ త్యజించిపోవనుజుమీ! నినువంటి కుమారుడబ్బునే.

వ. ఇట్లూరడించుచు నెద్దియుం బాలుపోక వగచుచుండ నంతలో నాదిత్యప్రేరితంబయు యొక్క పేటిక నదీప్రవాహ వేగమ్మున దనయొద్దకు వచ్చిననందు తనపట్టిం బెట్టి యిట్లు సంతాపింపదొడంగె.

నాదనామక్రియ - త్రిపుట

ప॥ కఱకురక్కసికన్న కుంతియె - కఠినరాలుగదా తలంపగ ॥కఱ॥

అ॥ప॥ చిఱుతపాపని గంగకర్పిం- చితిని నిను నా చేతులారగ ॥కఱ॥

1. మరలనిను బరికించు పున్నెము - దొరకునో దొరకదో గావున
కొఱతదీఱగ బాలు ద్రాపుము-కొడుక నాయుదుకెట్లుదీఱునో ॥కఱ॥

తే. గీ. కమలహిత సుధాకరులు గం ♦ గాభవాని
భూమిదేవియు మఱిపంచ ♦ భూతములును
నాగమమ్ములు దిక్పాలు ♦ రాదరించి
కరుణజూతురు నిన్నసి ♦ గందనీక.

తే. గీ. అనుచు దీవించి పేటిక ♦ నంబుమధ్య
మున విడన్ సూతుడొక్కండు ♦ గని, గొనిచని
పత్నియగు రాధకిచ్చె నీ ♦ పసిబి గర్ణు
డలరు చుండెను సూత గ్రు ♦ హంబునందు.

శా. అంతంగొన్ని దినంబులేగునెడ న ♦ య్యాంబాలికేయుండునుం
గుంతీమాద్రులఁ బెండ్లియాడి నిఖిల ♦ క్షోణీశులం గెల్చి ని
శ్చింతం జేసె శతాశ్వమేధిగ సము ♦ త్సేకంబుతో నగ్రజున్
అంతర్వాణులు సన్నుతింప నఖిలా ♦ శాధీశ సన్మాన్యుఁడై.

మంజరులు

పాండురాజొక్క-నాఁడు వేటకై - వనికేగి సతీయుతుఁడై
చండాంబకహతి మృగమిథునంబుం - జంపె దైవోపహతుఁడై
మృగరూపధరుండగు కిందముఁడను - ఋషివరేణ్యుఁడు శపించె
జగతీశ! ప్రియాసంగమమున బం - చత్వముం బొందుమంచు
మనుజాధిపుఁడయ్యది కర్మఫలం - బని తలఁచి బిట్టువగచి
కొనకు విరాగంబంది శతశృంగ - మున దపము సేయఁదలఁచి
చని సర్వసంగపరిత్యాగియై - సర్వభూత సముఁడగుచు
ఘనతపోనియతినుండి యొక్క-నా - డనె సతులతో వగచుచు.

శుభపంతువరాళి - త్రిపుట

ప॥ అనుభవింపక తీరదేరికి ! వనితలార ! చేసినకర్మ ॥అను॥

అ॥ప॥ కనుగొనన్ సుఖదుఃఖములకున్ - గర్తలెవ్వరు? కర్మవశమగు॥న॥

1. శూలపాణి కపాలియగుటయు - సోముఁడటు క్షయరోగియగుటయు
కాలకర్మవశములుగావే - చాలు నీర్ణ్మైహికసుఖంబులు ॥అను॥

వ. రమణులపొందు పెద్దపులి ♦ లాగున భీతికి హేతువయ్యె, కా
మము నడివేసవిన్ జలము ♦ మాదిరి తగ్గె, విరాగమే శర
ణ్యము మరణించు రోగికక ♦ టా! హరి సంస్మరణంబువోలె, బం
ధమువడి కాలకర్మవశ ♦ తన్ బ్రతుకిట్టుల మారె నేటికిన్.

ఉ. ఇంతకు దైవసూత్రమున ♦ కెవ్వరుగర్తలుగారు, పాండుభూ
కాంతుని యరావనం బడవి ♦ గాచినవెన్నెల చందమాయె, నీ
వంతువ దప్పరానిబల ♦ వంతపు సవ్యసనంబువచ్చె, నిం
కెంతని సంతపింతు తుద ♦ కెందులకుం గొఱగానివాఁడనై.

వ. ఇట్లు విచారించుచు గులసతు లూరడింప నూరడిల్లి కొనకు శత శృంగంబున కుత్తర భాగంబున దపంబు సేయుచు నొక్కనాడు బ్రహ్మలోకంబున కేగు మహర్షులంగని తానసపత్యుం డగుటచే వారలతో బోనేరమికిఁ గడుంగడు జింతించి, దుర్వాస ప్రసాదిత మంత్ర ప్రభావంబున సంతానంబు వడయనగునని కుంతివలన నెరింగి ధర్మదేవత నారాధించి క్షేత్రజుం బడయుమని కుంతికి నియోగింప నాపెయు మంత్రంబు విధిమంతంబు జేసి ధర్ముని నారాధించి గర్భంబుదాల్చి సంవత్సరంబు పరిపూర్ణంబైన.

తే. గీ. సకల శాత్రవ విజయ తే ♦ జమున నిఖిల
దిశలు వెలుఁగంగ, భాస్కరా ♦ దిగ్రహమ్ము
లొప్పమేలుగ నాభిజి ♦ తోదయమున
గురుకుల విభూషణున్ యుధి ♦ ష్ఠిరుని గనియె.

సీ. ఆవార్త దెలిసి తా ♦ నసహనమ్మునను గాం
ధారియు నుదరసం ♦ తాడనమున
గర్భ పాతంబును ♦ గావించుకొన వ్యాసు
డెఱిగి చయ్యన నట ♦ కరుగుదెంచి
యొగి మాంసపేశి నే ♦ కోత్తర శతఖండ
ములుగా విభాగించి ♦ పోయె నంత
పాండుభూపతి గంధ ♦ వహునంశమున నొక్క
తనయుని గలిగింపు ♦ మనిన గుంతి

తే. గీ. యనిల దేవు నారాధించి ♦ యతుల వీర్య
విక్రమూనూను గనియె నా ♦ భీమసేను
నా దినమ్మున గాంధారి ♦ కగ్రనంద
నుండు కరిపురి దుర్యోధ ♦ నుండు పుట్టె.

బాగు — చతురశ్రగతి

ప॥ కలియంశంబునదుర్యోధనుడా–గాంధారికి సుతుడై జన్మించెను ॥కలి॥
అ॥ప॥ జలదమ్ములుపిడుగులజడిగుఱియగ–జలజహితుడు తేజోహీనతగన॥

చరణము

కాక ఘూక జంబుకరాసభగణ - క్రవ్యాద రావములు పిక్కటిల్ల
భూకంపముగా నాదిశేషుండు - చీకాకున భీతిలి సొమ్మసిల్ల ॥గలి॥

తే. గీ. అటజనించె వైశ్యాపుత్రు ♦ డగు యుయుత్సు
డొక్కొక్క దినమ్ము వారగా ♦ నుద్భవించి
రంధనృపతికి దుశ్శాస ♦ నాది సుతుల్
శతము, నొక్క పుత్రికయు ♦ దుస్సల యనంగ.

వ. అంత నొక్కనా డాంబికేయుకడకు భీష్మ విదురాది బంధుజనంబు లరుదెంచి.

కాఫీ - చతురశ్ర

ప॥దుర్యోధనుజన్మంబున బెక్కులు-దుర్నిమిత్తములుతో చెంగావున ॥దు॥
అ॥ప॥ ఆర్యసమ్మతంబతనిదూషించి-యనపాయస్థితినుండు జెల్లరకు॥దు॥

చరణము

కులమునకు జగమ్మున కపాయమ్ము-సలుపు పూరుషాధముని దూషించి
కులము జగము నెటు లేని గాపాడు-కొంటయే ధర్మమగుకురునాథా॥దు॥

చ. అనవిని పుత్రమోహమున ♦ నాధృతరాష్ట్రుడు మిన్నకుండె; కా
ననమున బాండురా జొక డి ♦ నమ్మున వాసవుబోలు పుత్రకున్
గనుమన గుంతియున్ దివిజ ♦ నాథుదలంచి మునీంద్రదత్తమం
త్రనియతి దత్ప్రసాదమున ♦ దాగనె నర్జును బాపవర్జునున్.

తే. గీ. ఇంద్రునోడించి ఖాండవ ♦ ముందహించు,
రాజసూయిగాజేయు న ♦ గ్రజుని, రిపుల
గెలుచు సురలచే దివ్యాస్త్ర ♦ ములగ్రహించి
వాసవియటంచు నాకాశ ♦ వాణి పలికె.

వ. ఇట్లు పాండునరపతి పుత్రత్రితయంబువడసి త్రిభువనరాజ్యమ్ము వడసి నంతగ సంతసిల్లి కుమారులతోడి వినోదంబుల దగిలియున్నంత నొక్కనాడు మాద్రి యేకాంతముగ నిట్లనియె.

సావేరి - త్రిపుట.

ప॥ బ్రతికిసార్థకమేమి యీగతి - ప్రాణనాథ యపుత్రవతినై ॥బ్ర॥
అ॥ ప॥ క్షితికిబరువుగ నిహపరములకు-జెడి సతంబు నిరర్థకంబుగ ॥బ్ర॥

చరణము.

కనియె ముగ్గుర గుంతి, నాల్గుర - గనియె నా గాంధారి పుత్రుల
కనుగొనన్ గొడ్రాలిపుట్టుక - కన్న దురితము లేదు సతులకు ॥బ్రతి॥

చ. కొడుకుల ముగ్గురంగనియె ♦ కుంతి మహత్తర మంత్రశక్తి పెం
పడర యమానిలేంద్రుల కృ ♦ పావరిలభ్యత ధర్మపద్ధతిన్
గడగి తదీయ మంత్ర మను ♦ కంప వహించి యనుగ్రహించు చో
గొడుకుల గాంచగల్గుగు న ♦ కుంతిత ధర్మపథ ప్రవిష్టనై।

ద్విపద.

అనవిని పాండురా - జట్లు సేయింప
వనిత వేవేగ మా - శ్వినులదలంప
జననమొందె నకులు - సహదేవులనగ
తనయులు కవలవా - రిన తేజులనగ
విని వసుదేవు డ - వ్విధమెల్ల కడకు
తన పురోహితు గర్గ - పుని బంపె నటకు
చౌలోపనయనముల్ - సలిపి యధ్యయన
లోలురంజేసె బా - లుర గర్గుడుండు.



శ్రీ

# మహాభారతము

## కురుపాండవాభ్యుదయము

ఆనందభైరవి - ఖండగతి.

ప॥ కురుపాండవాభ్యుదయ - చరిత మాకర్ణించి
నిరుపమానందవిమలవా - ర్ధిఁ దేలుడు తరింపుడు ॥కురు॥

అ॥ ప॥ పరమాస్త్రశస్త్ర, సం - పన్నులౌ ధృతరాష్ట్ర
పాండురాజకుమారులు - వీరులునగధీరులు ॥కురు॥

చరణము

కాంతారమున పాండు - డొకనాడు మాద్రితో
గలసి పంచత్వమందె - మునిశాపము దలపక ॥కురు॥
కాంతుతో మాద్రి సహ - గమనముం జేసె తన
సంతానమా కుంతికి - నప్పగించి ధృతిమీరి

సీ. అచటిమౌనులు కుంతి ♦ నాపె పుత్రకుల నా
రార్చి గొంపోయి రా ♦ హాస్తిపురికి
దివిజసన్నిభుల బాం ♦ డవుల నా ధార్త రా
ష్ట్రశతంబు విదుర భీ ♦ ష్మ ప్రభృతులు
గాంచి యెంతయుఁ బ్రమో ♦ దించిరొక్క తపస్వి
జరిగినవృత్తాంత ♦ మెఱుకపఱచి
మునులనెల్లరను దో ♦ డ్కొనిచనె, నంత సా
త్యవతేయముఖ్యుల ♦ యనుమతమున

తే. గీ. నెలమి బరలోకవిధుల జే ♦ యించె బాండు
విభున కాధర్మవిదుడగు ♦ విదురుడప్పు
డన్నియుందీఱునంత నే ♦ కాంతముగను
వ్యాసభగవానుడనియె స ♦ త్యవతితోడ.

చ. తనువులు బుద్బుదంబుల వి ♦ ధాన సదాక్షణభంగురంబు లెం
దును సిరులెండమావులటు - దుర్భ్రమగొల్పు దురంత దుఃఖ భా
జనమగు ఘోరసంసరణ ♦ సాగర నిస్తరణంబు, మేరమీ
రినయది పాపమెల్లెడల, ♦ రేపటికన్నను నేడె మేలగున్.

మ. దురితారంభు లధర్మమార్గచరు లీ ♦ దుర్యోధనాదుల్ ప్రియం
బఱి గాఱింతురు పాండవేయుల నసూ ♦ యాగ్రస్తులై, యంధ రా
జు రయం బింకిట తత్ఫలంబనుభవిం ♦ చున్ మీరలీదారుణం
బరయం బోక తపోవనంబు సనుడ ♦ మ్మా ! నేడె మున్ముందుగన్.

వ. అనిన విని సత్యవతి యంబికాంబాలికలం దోడ్కొని వనంబునకుం జని ఘోరతపం బొనర్చి కొండొక కాలంబునకు శరీరమ్ము విడిచి పుణ్యగతికిం బోయె నిట పాండవులు ధృతరాష్ట్రు నెయ్యంబునం గురుకుమారులతో పాటు పెరుగుచు నొక్కనాడు క్రీడారతులై యున్నెడ నాగాయుతబలుండగు భీముండు కురుకుమారులందఱికొని.

సీ. ఆటలో నరటిపం ♦ డని మీదబడి పిండి
పిండిగా నెముకలు ♦ విఱుగగొట్టు
నదయుడై పెక్కండ్ర ♦ నవనిపై బడద్రోసి
యొక్కపెట్టుగ వీపు ♦ లొలియ నీడ్చు
భుజముపై నిడుకొని ♦ పోయి కను ద్దేల
వైవ నీట న్ముంచి ♦ లేవ నెత్తు
తరువులం బట్టి మొ ♦ దల్ల గదల్చి పై
నున్న బాలకులు పం ♦ డ్లూడి పడగ

తే. గీ. డాసి కఱువలిపట్టి దు ♦ శ్శాసనాది
కురుకుమారుల కిట్టు లె ♦ గ్గులు సలుపగ
గని సహింపక కౌరవా ♦ గ్రజుడు దుస్స
సేన సౌబలముఖ్యుల ♦ తో ననె నిటు.

పూర్వకళ్యాణి - మిశ్రగతి

ప॥ నేల నాల్గుచెఱంగు లిమ్ముగ - నేలువాడ నపాండవమ్ముగ ॥నేల॥
అ॥ప॥ కూళ నా కౌంతేయమధ్యము - గూలనేసి బిరానతథ్యము ॥నేల॥

చ ర ణ ము

రిపులవలె ధర్మజార్జున మా - ద్రేయులం జెఱసాలలో నిడి
యెపుడు దేవేంద్ర వైభవముగ - నిభపురం బిది రాజధానిగ ॥నేల॥

తే. గీ. అని వితర్కించి యొక్కనా ♦ డనిలజాతు
నిద్రితుం డ్రాట బంధించి ♦ నీట ద్రోయ
నతడు మేల్కని నీల్గు డ ♦ య్యవియు ద్రెస్సె
మత్తకరిభంగి నతడేగె ♦ మడుపు వెడలి.

తే. గీ. పన్నగంబుల గఱపించె, ♦ నన్నమందు
విషము బెట్టించె; కోఱలు ♦ విఱిగె ఫణుల,
కమృతమై జీర్ణమయ్యె న ♦ య్యన్న మిట్లు
నిష్ఫలములయ్యె జేతల ♦ న్నియు జివరకు.

వ. మఱియు నా దుర్యోధనుండు వెండియు బాండవుల కపాయంబు సేయ నుపాయంబు జింతించుచుండె నంత భీష్మ నియోగంబున గురుపాండవులు కృపద్రోణులకడ విలువిద్య గఱచుచుండిరి. మఱియుసూతపుత్రుండగు రాధేయుండును ధనుర్విద్యాకౌశలంబున నర్జునునితోడ మచ్చరించుచు దుర్యోధనాభిమానియై యుండె. శిష్యులం దెల్లర నర్జునుం డస్త్రశస్త్రవిద్యాధికుండై భారద్వాజున కనుగ్రహపాత్రుండయ్యె నయ్యర్జునుతోడి విద్యామత్సరంబున జీకటి నాతం డేయనేరకుండునట్లు సేయ ద్రోణపుత్రుం డగు నశ్వత్థామ రహస్యంబుగ నన్నసాధకుం బిలిచి నరున కెన్నండు నంధకారంబున గుడువబెట్టకు మని సెప్ప నతండు నట్లు సేయుచుండ నొక్కనాటి రాత్రియం దింద్రనందనుం డన్నంబు దిను నెడ గాలి తాకున దీపంబు వోవ నభ్యాసవశంబునం గుడిచి యిట్టులే విద్యలన్నియు సాధింప నగునని నిశ్చయించి నాటిరేయి జీకటియం దమ్ములేయ నభ్యసించు చున్నంత వింటినారిసడి విని ద్రోణుం డయ్యెడ కరుదెంచి యర్జునుం గౌగిలించుకొని.

కేదారగౌళ - ఖండగతి

ప॥ నీకన్న విల్కాండ్రు - లేకుండ జేతు నా
కై కొన్న శపథ మిదె - నాకు దగు శిష్యుడవు ॥నీ॥

అ॥ ప॥ నాకమునగాని భూ - లోకమునగాని లో
కైక వీరాగ్రణీ - దేవమానవులలో ॥నీకన్న॥

చ ర ణ ము

అరయ నీవిలువిద్య-నభ్యసించితిని నే-నగ్ని వేశుని జామదగ్ని నారాధించి
చరితార్థమయ్యెనా - శరవిద్యనీకిడుట-సరివత్తువా రామచంద్రునకు వేయే

ఉ. కన్నకుమారు నందయిన ♦ గల్గదు నీపయిగల్గు కూర్మి, నా
కన్న ధనుర్ధరుండవను ♦ ఖ్యాతివహింతువు, చల్లనయ్యె నా
కన్నులు, దానపాత్రుడవు ♦ గావున నిన్న ఖిలాస్త్రశస్త్ర సం
పన్నునిజేసి నాపడిన ♦ బన్నము వాయుదు నింద్రనందనా!

క. అనిపల్కి కుంభసంభవు
డనిమిష రాట్తనయునకు బ్రి ♦ యమ్మున నెఱిగిం
చెను సంగ్రామమ్ముల తె
న్నును వివిధవ్యూహభేద ♦ నోపాయములున్.

ము ం జ రు లు

కురుపాండవు లొకనాడు వేటకై - యరిగి మహారణ్యమున
దిరుగుచో దారిదప్పి వారికు - రుక్కురం బానమీపమున
శరము వేయు నేకలవ్యుడను నొక - యెఱుకుంగనుగొని మెఱుగ
బరికించి దానిముఖమునం దేడు - బాణమ్ములక్కజముగ
నేయ నాసార మేయమునం బాఱ - నీక్షించి రాకొమరులు
రోయుచున్ వచ్చి బోయనిగని రా - ద్రోణశిష్యులెల్లరును
గురుడెవ్వం డెవ్వనివాడవనగ - గురుడు నాకు ద్రోణుండు
హిరణ్యధన్వుండనువాడు తండ్రి - కిరాతాధినాధుండు.

క. అనినవిని కురుకుమారులు
వనమునువిడి మగిడివచ్చి ♦ భారద్వాజున్

గని యయ్యది తెల్పిరి, య
ర్జును డేకాంతముగనిట్లు ♦ ద్రోణున కనియెన్.

శ్రీరంజని - ఖండగతి.

ప॥ నేటితో దీఱె కుం - తీపుత్రు డర్జునుడు
మేటి విలుకాడన్న - మాట ముమ్మాటికిని ॥నే॥
అ॥ ప॥ బూటకముగా దోకవ - నాటు గనుగొంటి ఘో
రాటవిం ద్రిజగదే - కధనుష్మదగ్రణిని ॥నే॥

చరణము.

నాకన్న మీకన్న - నధికుండు చేత విలు
గైకొన్న వారిలో - గణనీయుడాతడే
నా కబ్బురముగొల్పె - నతని శరలాఘవం
బేకలవ్యుండంట - మీకు శిష్యుండంట ॥నే॥

తే. గీ. ధనువుచేకొన్న వారిలో ♦ న నను మేటి
జేతునంచు బ్రతిజ్ఞజే ♦ సితివి, వితథ
మయ్యె సత్యప్రతిజ్ఞుండ ♦ వలఘుచరిత !
ధరణిదేవాగ్రగణ్య ! స ♦ ద్గురువరేణ్య !

చ. అనవిని కుంభసంభవుడు ♦ నాతని జూతమటంచు నర్జునుం
గొని చని యేకలవ్యుకడ ♦ కున్ దనకుం బ్రణమిల్లి శిష్యుడం
బనివడనభ్యసించితి భ ♦ వత్కృప నీయిషువిద్యనన్న యా
తనిగని యట్టులేని గురు ♦ దక్షిణయిమ్మన బోయడిట్లనెన్.

మధ్యమావతి - ఆది

ప॥ భళిభళీ! సుదినమయ్యె నేడునా-భాగ్యమేమందు మిముజూడగంటి॥
అ॥ప॥ తలపమూర్తిత్రయస్వరూపులెం-తయుమీరుగురువర్యులుగావున॥

చరణము

ఇదెనాదేహం బిదెనాయర్థం - బిదియే నా పరిజన సమూహంబు
సదయా మీకిందేదికావలయు-సమ్మోదమునగైకొనుడోసంగెదన్॥భళి॥

తే. గీ. గురుడు కుడిచేతి పెనువ్రేలు ♦ గోసియిమ్మ
టన్న నయ్యేకలవ్యుండు ♦ నట్లొసంగె
వాని కద్దాన బాణసం ♦ ధానలాఘ
వమ్ముచెడె, పార్థునకు మనో ♦ వ్యాధియడగె.

వ. ఇట్లు కుంభసంభవుండు జంభారినందను డద్వితీయధనుర్ధరుం డను యశంబు సార్థకపరచి మఱియు మహాస్త్రంబు లెన్నియేని యుపదేశించియొక్కనాడు కృతాస్త్రశస్త్రులయిన కురుకుమారుల విద్యాకౌశలంబు వ్యాసగాంగేయవిదురశల్యశకునిసోమదత్త ధృతరాష్ట్రాదుల సమక్షంబునం జూప సమకట్టి ప్రేక్షాగారంబున సుందరీ బృందం బధివసించియుండ, గాంధారి ప్రక్కన కుంతీదేవి కూరుచుండి యుండ, బ్రాహ్మణ బృందం బొక్కెడ, భీష్మాది కురువృద్ధు లొకవంక, మంత్రిసామంతాదు లొకచక్కి, కవి గాయక వైతాళిక ప్రకరం బొక్కయెడం బరివేష్టించియుండ నాచార్యుండు ధర్మజ ప్రముఖశిష్యులు ధనుర్ధరులై వెన్నంటిరా శుక్లాంబర ధరుండై రంగమధ్యంబునం బ్రవేశించి విద్యాప్రదర్శనంబుం బొనర్ప శిష్యుల కాజ్ఞాపించి యొక్కెడ నాసీనుండై యుండ గౌరవపాండవులు వివిధాయుధ విద్యాపరిశ్రమలం జూపుచు, గజాశ్వరథారూఢ దక్షతంజూప కొంతవడికి భీమదుర్యోధనులు గదాధరులై రంగ మధ్యంబుం బ్రవేశించి.

శా. ఉత్తుంగాచలయుగ్మముంబలె మహా ♦ హుంకారశబ్దమ్ములా
యత్తంబౌ పదఘట్టనధ్వనులు భూ ♦ మ్యాకాశముల్ నిండ, రే
కెత్తన్ స్వీయజయాభిలాష పటుశ ♦ క్తింబోరుచో, సభ్యులున్
చిత్తస్థైర్యము దక్కిమ్రాన్పడిరి న ♦ ష్టీభూతచైతన్యులై.

తే. గీ. ద్రోణతనయుండు భీమదు ♦ ర్యోధనుల న్నా
కంత కిర్వుర వారించె ♦ నస్త్రగురుడు
కనుడు న్నాప్రియశిష్యుడ ♦ ర్జును డితండు
ఘనధనుఃకౌశలంబు జూ ♦ పుననునంత.

ఉ. పోడిమి నస్త్రవిద్య కడ ♦ ముట్టగ నేర్చిన దిట్ట, కుంతికిన్
మూడవకాన్పు, ధర్మజుని ♦ ముద్దులతమ్ముడు, శిష్యులందరన్
వాడిమగండు, నొజ్జకెన ♦ వచ్చుధనుర్ధరు, డందగాడు, నా
క్రీడిదిదృక్షులెల్లరు భ ♦ లీ! యని మెచ్చగనిల్చి యయ్యెడన్.

సీ. అగ్నిగల్పించెతా ♦ నాగ్నేయ శరమున
నమరించె వారుణా ♦ స్త్రమున జలము
ననిలబాణమ్మున ♦ నలరించె ననిలంబు
మేఘాస్త్రమున నిల్పె ♦ మేఘచయము
శైలరూపము దాల్చె ♦ శైలబాణమున, న
దృశ్యాస్త్ర మేసి య ♦ దృశ్యుడయ్యె
నాశ్చర్యమొదవింప ♦ హ్రస్వుడౌ నంతలో
నతిదీర్ఘుడగు సూక్ష్మ ♦ డగురయమున

తే. గీ. నర్జునుండిట్టు లస్త్రవి ♦ ద్యావిశేష
మెల్లరకు జూప జూచి స ♦ హింపజాల
కనియె కర్ణుడు రంగమ ♦ ధ్యమున నిలిచి
డంబుమీర భుజాస్ఫాల ♦ నంబొనర్చి.

తోడి - చతురశ్రగతి

ప॥ ఇంతమాత్రమునకె యింతయు నేర్పరి-వీ వేయనిపొంగి మినుముట్టకు॥మి॥
అ॥కుంతికొడుకనే నేయుపనులేను-గూడ నేయువాడ నల్వురు సెబాసనగ

చరణము

ఉర్విలో నాకరిమించు వారలొక - రుందురు నీకేలా దురభిమానం ॥బు॥
గర్వమేరికిం గారాదర్జున - ఘనుడ వనుకొంటివా కర్ణునెఱుంగవ ॥ఇ॥

క. అనిపల్కి యర్జునుడు చూ
పిన విద్దియలెల్ల జూపి ♦ పిలిచెం గయ్యా
మ్మున కింద్రతనయు గురుబ్రా
హ్మణి యోగమ్మనను పార్థు ♦ డెదురై నిలిచెన్.

మ. రవిపుత్రుం డమ్మహేంద్రపుత్రునిపయి బ ♦ ర్జన్యాస్త్రమేయన్ దదా
స్త్ర విశేషమ్మున బాండవేయు జలద ♦ వ్రాతంబు గప్పెన్నడిన్

బవనాస్త్రంబున తత్ప్రయోధరములన్ ♦ వారించె విభ్వచ్చుం డా
హావరంగంబున నిల్చి యంతట గృపుం ♦ డాకర్ణుతో నిట్లనెన్.

క. వియ్యంబును నెయ్యంబును
కయ్యంబు సమానులకు జ ♦ గంబునదగు నీ
యయ్యం బేర్కొని వంశం
బెయ్యది వివరించి పోరు ♦ మీతనితోడన్.

వ. అనవిని రాధేయుండు సిగ్గుపడి తలవాంచి యూరకున్నం జూచి దుర్యోధనుండు కృపున కిట్లనియె.

చ. కులముగలాడు శౌర్యము న ♦ కుంఠితసేనగలారు ముప్ప్వ రీ
యిలపయి రాజనామము వ ♦ హింపగ నర్హులు; కౌరయేని మీ
రలు గన నంగరాజ్యమిడి ♦ రాజుగజేసెద వేడ్క చూడు డీ
య్యలఘుపరాక్రమక్రము న ♦ టంచు సుయోధనుడట్లొనర్చినన్.

తే. గీ. భూరిమణిమయమకుట కే ♦ యూరముఖ్య
భూషణాలంకృతానంద ♦ మూర్తియగుచు
దీని కేమి ప్రత్యుపకార ♦ మేనొనర్తు
ననిన కర్ణుడు, కోరె స ♦ ఖ్యము కురుపతి.

వ. అంతకొమరుని రాజ్యాభిషేకోత్సవము సూచి యానందపరవశుండై సూతుండు రథంబు డిగ్గి కర్ణునొద్దకుం జని కౌగిలించుకొని తదీయ మూర్ధాఘ్రాణంబొనర్చినం గని భీముండు కర్ణుని సూతకుల సంభవుంగా నెఱింగి యెకసక్కెముగ నిట్లనియె.

సారంగ - మిశ్రజతి -

ప॥ చాలుజాలింక నీబోటికి - సమర మేటికి పామిన్మపాటికి ॥చా॥

అ॥ప॥ మేలైనగుఱ్ఱాలతో కశ - కోలగొని యరదమ్ము దోలుము ॥చా॥

1. జాతికొలది దలంపకీగతి - క్షత్రియులతోడనా జగడము
పాతకి ! తగుదునని సభకిటు - వచ్చితివి సిగ్గుపడి పోవక ॥చా॥

2. అర్హమగునెటు నీకరగరా - జ్యముత్తమరాజోపభోగ్యము
అర్హమగునెటు మంత్రపూతం బగు పురోడాశమది కుక్కకు ॥చా॥

తే. గీ. అనిన గర్ణుండు వెలవెల ♦ నై వివర్ణ
వదనుడై యుండ గురుపతి ♦ వడముడి కనె
పుట్టునే లేడికడుపున ♦ పులి? పాడము నె
యధమకులమున నిట్టి తే ♦ జోధికుండు ?

సీ. అమరేంద్రుచేతి నూ ♦ ఱంచులబాకు ని
కృ-ముగ దధీచి వె ♦ న్నెముకగాదె ?
తారకాంతకు డాకు ♦ మారుండు జేజేల
దళవాయి శరవణో ♦ ద్భవుడుగాడె ?
సర్వజ్ఞు డీ కృపా ♦ చార్యుంపు లోకమా
న్యుడు శరస్తంభ జ ♦ న్ముండుగాడె ?
యరయ భారద్వాజు ♦ డఖిలాస్త్రశస్త్ర మ
ర్మవిదుండు కుంభ సం ♦ భవుడుగాడె ?

తే. గీ. మఱియు మీ జన్మములతీరు ♦ మరచినావె ?
లలిత సర్వాంగలక్షణ ♦ లక్షితుండు
పుట్టు కవచంబు గుండల ♦ మ్ములు గలాడు
సూతజుడుగాడు కర్ణుడో ♦ వాతజాత !

తే. గీ. అని సుయోధను డాదిత్యు ♦ డ స్తమింప
గర్ణు దోడ్కొ-నిచనియె; నా ♦ ఘుటభవుండు
తెల్లవారిన శిష్యుల ♦ నెల్ల బిలిచి
సంభృతోత్సాహుడగుచు నీ ♦ సరణి బలికె.

కమాచి _ ఆది

ప॥ గురుదక్షిణగా ద్రుపదు బంధించి
కొనిరం డియ్యెడకు - ప్రాణమ్ములతో ॥గు॥

అ॥ ప॥ కరము రాజ్యగర్వాంధకారమున
కన్నుగాన కతడు నసుపరాభవించెను ॥గు॥

చరణము

అతడు నేను బాల్యమున విలువిద్య
నభ్యసించినాము - ఒకగురువునొద్ద ॥గు॥

కతిపయదినముల కా ద్రుపదుడు పాం
చాలపతియయ్యెను - జనకుని పరోక్షమున ॥గు॥

సీ. నేనంత విద్యమా ♦ ని, వివాహమ్మై, తనూ
భవుగాంచి ధేనువుం ♦ బాలకొఱకు
ద్రుపదుని బాల్య మి ♦ త్రునిగోర నాతండు
ప్రబల రాజ్యాంధకా ♦ రమున కన్ను
గానక చాలుపొ ♦ మ్మేను మూర్ధాభిషి
క్తుడ నీవు పేదవా ♦ ఁడవు మనకు
మైత్రియేరీతి సం ♦ భవమా నటంచు న
న్నవమానపరచెన్నో ♦ యన్నలార !

తే. గీ. తత్పరాభవ మూడ్చుకో ♦ దలచి మిమ్ము
వివిధశస్త్రాస్త్ర మర్మకో ♦ విదులజేసి
నాడ గావున గురుదక్షి ♦ ణగ రయంబ
గదలి ద్రుపదక్షితీంద్రుని ♦ గట్టితెండు.

చ. అనవిని ధార్తరాష్ట్ర శత ♦ మా ద్రుపదక్షితినాథు గెల్వగా
జని పెనుబీరముల్బలికి ♦ సంగర రంగమునందు నిల్చి త
జ్జనపతి నోంపలేక రిపు ♦ సంతతి పైబడ గాందిశీకులై
వనరుచునెల్లరు న్మగిడి ♦ వచ్చిరి, వచ్చినజూచి పార్థుడున్.

సీ. సత్యసంకల్పుడౌ ♦ సమవర్తి తనయు[illegible]నా
నతియె రక్షాబంధ ♦ నమ్ముగాగ
గురు కటాక్షమున గై ♦ కొన్నదివ్యాస్త్రసం
తానమే విజయ సా ♦ ధనముగాగ
నుత్సాహజనక వా ♦ యుకుమార గంధసిం
ధుర విహారంబె చే ♦ దోడుగాగ
మహితపరాక్రముల్ ♦ మాద్రీకుమారులే
సవ్యాపసవ్య భు ♦ జములుగాగ

తే. గీ. గదలిపాంచాల విభుని సం ♦ గ్రామసీమ
నెదిరి సింగమ్ము పోలె లం ♦ ఘించి యొడిసి
పట్టి తనరథమున కంట ♦ గట్టి తెచ్చి
ద్రోణు పదంగట బెట్టె నా ♦ ద్రుపదు గ్రీడి.

వ. అంత ద్రోణుం డర్జునపరాక్రమంబునకు వెఱగంది ద్రుపదుం జూచి నగుచు నిట్లనియె.

కేదా: గౌళ - ఖండగతి.

ప॥ పేదపాఱుం డెవఁడో - పెద్దరాజెవ్వఁడో
యేదీవచింపుమిపు - డు, సరిగా కన్నుదెఱచి ॥పే॥

అ॥ప॥ నీమురాజ్య మదాంధ - కారమ్ము వారింప
నేఁడు నాశిష్యుచేత - నీకంజనమేయించితి ॥పే॥

చరణము

ఊరకేపోదు మానము బ్రాణమూడ్చకే
దారుణానలతుల్యమై, బ్రాహ్మణావమానం ॥బ్రా॥
కోరినీవే తెచ్చుకొన్నాడ వీ ముప్పు
కొనకు నీవింకనైన - బుద్ధిగలిగి వర్తింపుము ॥పే

ఉ. సింగపుగద్దెపై నిలిచి ♦ చెల్లనికూతలుగూసినట్టి నీ
పొంగడగెన్ పృథాతనయు ♦ పోటరిచేతులతీట వోయె, నా
భంగపుబాటుదీఱె, గరు ♦ వం బిక సెల్లదు చిన్ననాటి నా
సంగడికాడవౌట నిను ♦ జాలిదలంచితి పొమ్ము వీటికిన్.

వ. అనిపల్కి యర్జునుం గని

తే. గీ. మానవంతున కిల నొక్క ♦ మాట చాలు
దీర్ఘవైరంబు తగదు ధా ♦ త్రీసురునకు
మిగుల జచ్చినపాము నే ♦ మిటికి గొట్ట?
విడువు మీతనిబంధము ♦ లిప్పి పార్థ!

సీ. నరుడంత ద్రుపదు బం ♦ ధవిముక్తుజేయ నే
గతి బ్రతీకారంబు ♦ గడగి సేతు
నని తలంచుచునేగె ♦ నతడు, ద్రోణాచార్యు
డింద్రనందనుమెచ్చి ♦ యిచ్చె బ్రహ్మ
శిరమను నొక దివ్య ♦ శరమును సప్రయో
గ నివర్తనంబు గా ♦ గ, ధృతరాష్ట్రు
డా ధర్మనందను ♦ యౌవరాజ్యాభిషి
క్తునిజేసె గాంగేయు ♦ నను మతమున

తే. గీ. నలుగడలగెల్చి బలిమి ద ♦ మ్ములు నలువురు
బరనృపాలతనూజద ♦ ర్పం బడంచి
సకల సద్వస్తువాహన ♦ ప్రకరమొసగ
వరలెను యుధిష్ఠిరుడు సార్వ ♦ భౌముడనగ.



# మ హా భా ర త ము

## పాం డ వ ప ర్య ట న ము

బిలహరి - రూపకము

ప॥ ఆలింపుడు పాండవ ప - ర్యటన కథావిశేషమ్ము ॥నా॥
అ॥ ప॥ తూలింపుడు నిఖిలపాప - జాలమ్ముల మోక్షప్రద ॥మా॥

1. కౌంతేయుల వైభవబల - కార్ముకవిద్యాదక్షత
లెంతయుజూచి సహింపక - చింతిలు దుర్యోధను డెప్డు ॥డా॥

2. కణికుండనువా డొక నా - డినసుత సౌబల దుశ్శా
సన దుర్యోధన ముఖ్యుల - కొనరదెల్పె నృపనీతి ॥నా॥

సీ. అపకారియని తోచె ♦ నా గురుండగుగాక
తిన్నగా శాసించి ♦ తీరవలయు
వేరి నే నమ్మక ♦ యేప్రొద్దు నాత్మ ర
క్షాపరుండై పొడ ♦ సూపవలయు
బలహీనులైయున్న ♦ పట్టున రిపుల నే
రూపుననో రూపు ♦ మాపవలయు
దగు సామదాన భే ♦ దముల నమ్మించి వం
చించి శాత్రవులసా ♦ ధించవలయు
తే. గీ. సమయమగునంతదనుక నే ♦ స్తము నటించి
పగర దక్కియైన జెఱుపగా ♦ వలె నృపుండు
శత్రుమారణ కార్యమ్ము ♦ క్షత్రియులకు
నాచరణయోగ్యమగుచేత ♦ యండ్రు బుధులు.

వ. అనవిని దుర్యోధనుండు పాండుకుమారుల దూరస్థులం జేసి సాధింప
నుద్యోగించి యొక్కనాఁ డంధరాజున కిట్లనియె.

ముఖారి - ఆది

ప॥ ఊరుపేరు లేకుండ జీవించి-యుంటివలసె నీకొమరుల్గనె మే॥మూరు॥
అ॥ప॥ వీరులై పాండవేయులు సకలో-ర్వీవలయంబేలగా వీక్షించు॥మూరు॥
1. యౌవరాజ్య మిడినాఁడ వాపాండ-వాగ్రజునకు ముందువెన్కలరయక
కావునంబౌరులింక మమ్మురాజు-లనగ నోర్జాతురు వారిఁ గొండాడి॥యౌ॥

ఉ. పాయక నీసమక్షమున ♦ బాంధవుఁ డున్నృపాలుఁడు రాజ్యమేలె, నా
పై యమునందనుండె పరి ♦ పాలన సేయ విధించితీవు, ని
ట్లే యవనీపతిత్వమున ♦ కింతట వారును వారివంశజుల్
దాయలుగాఁగ; తప్పుగల ♦ మము పాండవ దాసులంతకునో?

తే. గీ. కుంతికొడుకులు మా కింత ♦ కూడు వోసంగ
బ్రతుక నేమంతమవ్వ? మా ♦ బాగుగోరు
వాఁడవగుదేని పాండు భూ ♦ పాలతనయు
లందు నీకున్న దయ ఇడ ♦ నాడుమయ్య

చ. పనుపుము వారణావతము ♦ పాండుకుమారుల కుంతితోడ వా
కనువుగ గొన్ని యేండ్లవర ♦ కచ్చటనుందురు, దానఁ జేసి భూ
జనులకు ధర్మజాదుల దె ♦ సం గల ప్రేమ్ముడి వోవు, నాకు ధా
రుణి సకల మ్మధీనమగు ♦ బొమ్మన జేయుడి నిద్రవోవుదున్.

క. అనవిని యంధమహీపతి
వనరి తనూజాతు నెట్లు ♦ వారించిన దా
వినకున్న గొనకు తమ్ముని
తనయుల రావించి యనియె ♦ దారుణభంగిన్.

తోడి - త్రిపుట

ప॥ కన్న కొమరులకన్న మీ మొడ-గలదు ప్రేమ్ముడి నాకు మిన్నగ ॥కన్న॥
అ॥ప॥ అన్నలార! నా యాజ్ఞ మీరరలు-నెన్నడును జవదాటి మెలఁగరు॥క॥
1. వారణావత నగరమందున - పరమపుణ్యస్థానమందున
మీరు కుంతియుఁ గొంతకాలము-మెలగి రండు సుఖమ్ము వాల్లను ॥కన్న॥

చ. తలపగ విశ్వనాథునకు ♦ తన్నగరమ్ము నివాసభూమి, ని
ర్మల దివిషన్నదీతట ♦ విరాజిత మయ్యదిగాన మీర లా
వలనికి బోయిసల్పు డొగి ♦ పాండు హితమ్ముగ సత్క్రమమ్ముగా
విలసితదానధర్మములు ♦ విశ్రుతభూసుర తర్పణమ్ములున్.

వ. అనిపంచిన వల్లెయని పాండవులు భీష్మద్రోణ విదురకృపాదులకు మ్రొక్కి దీవనలంది జననీసహితమ్ముగ వారణావతమ్మునకు గమనోన్ముఖులయిన, పాపనిశ్చయుండగు దుర్యోధనుండు పురోచనుం డనువానిం బిలిపించి రహస్యమ్ముగ వానికిట్లనియె.

సీ. నాతండ్రి నేడు పాం ♦ డవుల నేవురఁ బార
ణావతమంపు చు ♦ న్నాడు నాకు
నీవాంతరంగిక ♦ హితుడవు గావున
నాయమొందీయెడ ♦ సలుపవలసె
మనుముందనీ వందు ♦ చని వారు నివసింప
నిలయముల్ రచియింపు ♦ నేర్పుమీఱ
సరగ లాక్షా సర్జ ♦ కరసమిశ్రిత ఘృత
తైలార్ద్ర మృత్తి కాం ♦ తరవిశాల

తే. గీ. తరచతుశ్శాల బొందునం ♦ దనుల నునిచి
యొరులెరుగకుండ వారలే ♦ మఱచినతఱిని
తద్గృహద్వారమందున ♦ దహనముంచి
వైరి పంచత్వమొందగ రా ♦ వలయు నీవు.

క. అనిపరచిన జనిత్రయొ బురో
చనుడున్ బాండవులు విడిచి ♦ సాహజపురమున్
జననీ సహితమ్ముగ బో
వునెడన్ విదురుండు ధర్మ ♦ పుత్రునకనియెన్.

శ్రీరంజని – రూపకము

ప॥ మాయమ్మ మర్మమెఱుంగరు – నాయనా ఏమారవద్దయ్యనుడులు ॥మా॥
అ॥ ఖా॥ కోయుత్తవంబున నెప్పుడో – కురుపతి మీకెగ్గొనేయు ॥ మా॥

1. శకుని కర్ణదుశ్శాసన - సారథ్యమ్మున బాపపు - శకటము దోలగ
నున్నా - డిక నీకౌరవాగ్రజుడు॥ మా॥

2 కార్యా కార్యము లెఱుగ ర - నార్యులు గాంధారేయులు
దుర్యోధను డేగుచుండు - ద్రోవంజను నంధరాజు॥ మా॥

తే. గీ. ఉరువిషాగ్నుల వలన నే ♦ మఱిక మెలగు.
డప్రమాదులరై; వార ♦ లాచరించు
దారుణమ్ములు తత్ప్రీతి ♦ కారములును
జెప్పిపంపుదు నెప్పటి ♦ కప్పు డేను.

చ. అనవిని సంతసించి సెల ♦ వందియు నాతనియొద్ద ధర్మజుం
డనుజసమేతుడై పయన ♦ మైచని ఫాల్గున శుక్లమందు రో
హిణి దగు నష్టమీతిథి న ♦ హీనముదమ్మున వారణావత
మ్మున కరుదెంచి వైభవ స ♦ మున్నతి జేసె గృహప్రవేశమున్.

క. ఆయింటి వైఖరింగని
మాయోపాయ ప్రయోగ ♦ మర్మవిదుడు కొం
తేయప్రథముం డిట్లనె
వాయుతనూజాతునకు న ♦ భంగురలీలన్.

మ. ఇదిలాక్షాగృహ మిందపాండవముసే ♦ యుంపందలంపున్ నిధు
ర్మదులై కాపురముంచిరిట్లు దురిత ♦ ప్రారంభు లాకౌరవుల్
విదురుండాడినమాట నిక్కమగు, నే. ♦ వేళం బ్రమాదంబుగా
ర్చెదరో, కావునజాగరూకత బ్ర ♦ వర్తింపందగుం దమ్ముడా!

వ. అనిపల్కి ధర్మజుం డనుజజననీ సహితమ్ముగ నాయింట వారు నెల
లప్రమాదస్థితి నుండునంత నిట కరిపురంబున విదురుండు దుర్యోధను
దుర్మంత్రం బెఱింగి యొక్క ఖనకు నతికుశలుం బాండవులం పాలికిం
బుత్తెంచిన వాడును రహస్యంబున బాండవులంగని తానున్న కృష్ణ
చతుర్దశి నాటిరాత్రి పురోచనుండు లక్కయిల్లు గాల్చుననియెఱిం
గించి యొరులెఱుంగకుండ నొక్క బిలమ్ముగావించె. కృష్ణచతుర్దశి
నాడు కుంతియు దేవపూజ గావించి పుణ్యాంగనలకెల్ల నిష్టాన్నం
బులదృప్తిజేయ బురోచనుం డంపిన యొక్క నిషాదాంగన యేవురు

కొడుకులుం దానును నాటి రేయి లక్కయింట నిదురించుచుండ భీముండు మేల్కని తల్లిని నన్నదమ్ములను బిలంబులోని కనిచి.

బాగు - త్రిశగతి.

ప॥ అగ్గి పెట్టె లక్కయింటి - కయ్యెడ వాయుతనూజుం ॥డ॥
అ॥ ప॥ భగ్గునమండి నిలువెల్ల - భస్మరాశియై కూలగ ॥న॥
1. కొడుకులేవురుం దానును - మడియ నా నిషాదాంగన
సడిగ్గాకుండ పురోచన - శయనగృహద్వారమ్మున ॥న॥

వ. భీముండు బిలమువెలువడి యేవ్వరవెలువరించి.

సీ. నిదురపాటున కాలు ♦ గదుపలేకున్న కుం
తిని బలితంపుమూ ♦ పుననిడుకొని
తఱచుమైకమునమై ♦ మఱచినిద్రించు ధ
ర్మతనూజు బాహుమూ ♦ లమునునుంచి
యెప్పాట గందోయి ♦ విప్పిచూడగలేని
శక్రనందను నొక్క ♦ చంకబెట్టి
మెత్తియుత్సంగమ్ము ♦ లెక్కించిమాద్రీకు
మారుల భుజములం ♦ జేరవైచి

తే. గీ. నడకవడి దరులెల్ల జా ♦ ల్పడుచు మ్రొగ్గ
చరణసంఘట్టనమున త్రా ♦ ల్నుఖమ్ముగాగ
బవలు సనినట్లు రేయెల్ల ♦ బరవడోడగె
ననిలసూనుడు ముండ్లుగం ♦ డ్లనక తెరలి.

తే. గీ. ఇట్లు చని చని, గంగ దా ♦ టించి మివుల
నాకటదపించువారి సా ♦ యాహ్నమునకు
నొక్కవటభూరుహచ్ఛాయ ♦ నుంచి నిదుర
బోవు తల్లిని నన్నద ♦ మ్ములనుజూచి.

ఉ. చింతిలుచో హిడింబుడన ♦ జెంగటనున్న నిశాటవీరు డ
ల్లంతనజూచి చెల్లెలి ర ♦ యమ్మున వారి వధించి తెమ్మనన్
గాంత హిడింబ రూపజిత ♦ కాముని భీమునిగాంచి మెచ్చుచుం
జెంతకుజేరి వాకొనియె ♦ చేకొని మానవరూప మంతలోన్.

కాఫీ - ఆది

ప॥ వలచివచ్చితి నేలకోరా - వన్నెకాడ నన్నేయేకిమీడా ॥వలచి॥
అ॥ ప॥ చులకనగా నను - జూడకు మొకపరి
పలుకవేమిసుధ - లొలుక నాసామి ॥వలచి॥

చ ర ణ ము

మూడుజగముల నీ సరి సొగసరి లేడుమామ్రాటికోమగవాడా
నేడు నీతోడగూడకున్న నాయీడుపుట్టువునిరర్థకోమే॥ నినువలచి॥

ఉ. దానవి నే హిడింబయను ♦ దాన. హిడింబున కేను సోదరిన్
వానిజయింపలే రమర ♦ వర్యులు సైతము; నాకు భీర్త్వవై
ప్రాణముగాచుకో మ్మతడు ♦ బావయగు న్నినుముట్టబోల దె
వ్వానికి, ము జ్జగమ్ములకు ♦ బట్టముగట్టునినున్ మనోహరా!

ఉ. మానవమాంసమే ప్రియత ♦ మంబసు రాళికి నాలసించినన్
దానయివచ్చుమీాకడకు ♦ దప్పదతం డిట్టురాకము న్నె నీ
యాన నిమేషమాత్రమున ♦ నందఱనెత్తుకపోయి ద్రాతు నెం
దైనను నిద్రమేల్కొలుపు ♦ మా, తడవైనను కార్యభంగమా.

వ. అనవిని భీమసేనుండు.

శా. క్షుద్రామర్త్యవిరోధినొక్కని మహో♦గ్రుండంచు గొండాడ కా
రుద్రుండేయగుగాక భీకర సమరు ♦ ద్రుండేయగుంగాక; ని
ర్నిద్రోత్సాహుడ నే భయంపడను, రా ♦ నిమ్మా హిడింబాసురున్
నిద్రాభంగము సేయ పీరల కిడే ♦ నిక్కంబు దైత్యాంగనా!

వ. అని పల్కునంతలో రక్కసుండయ్యెడ కరుదెంచి భీమునిగని

ఆఠాణా - ఖండగతి

ప॥ ఎందుబోయెదవు నీ - వింక మానిసిపోత
అ॥ ప॥ యిందేలవచ్చితివి - ప్రమందగానాచేత॥ యెందు॥
1. బంధులగు రక్కసుల - బారుపవిహీను లను
కొంటివా, వంటింటి కుందేటివైతివి॥ వెందు॥

2. నన్నెఱుగవా, నరాం - తకుడను హిడింబుడను
తిన్నగావానోరు - దెఱువనొక ముద్దగా॥ వెం॥

సీ. అనిపలుక మానుషా ♦ శను డాకి వారికూ
ర్కునకు భంగమ్ము సే ♦ యూరకుండ
బాహుమూలంబునం ♦ బట్టి నక్తంచర
వీరు భీముడు కొంత ♦ దూర మీడ్చి
మల్లయుద్ధమ్మున ♦ మార్కొని పోరుచో
నలిగి తద్దానవుం ♦ డొడఁగఱచి
కుంతియున్ సుతులు మే ♦ ల్కాన నొక్కపెను బొబ్బ
వెట్టగా నర్జున ♦ ప్రేరణమున
ఆ. వె. గాలికొడుకు వాని ♦ కడగాలు చేనంది
విడక నూఱు మార్లు ♦ వీచివీచి
కొనకు నేలబెట్టి ♦ కోలెమ్ము విఱిచి రా
కాసి విగత జీవు ♦ జేసి వచ్చె.

తే. గీ. అంతలో గుంతియును ధర్మ ♦ జాదులా ని
శాచరసతీవిధానమ్ము ♦ సకలమెఱిగి
దానిఁగైకొనుమని భీమ ♦ సేనున కన
సమ్మతింపమి రక్కసి ♦ చాన యనియె.

మంజఘులు

కామశరవిద్ధనైతి జుట్ట ప - క్కముల విడనాడుకొంటి
కామరూపిణిన్ గాలజ్ఞురాల - గాన నన్నేలు మంటి
అనవిని సుతజన్మమగునంత కి - య్యకొనె నతడు సత్వరము
జననీసహితమ్ముగ బాండవులున్ - శాలిహోత్రునాశ్రమము
చని యొక్క సరోవరమునన్ గృత - స్నానులై విశ్రమించి
వనస్పతిక్ సుఖమున్న వ్యాసు డ - వ్వారికడ కేగుదెంచి
యేకచక్రపురి విప్రభావమున - నుండుడని తెల్పిచనియె
రాకాసిహిడింబ పవనతనయు వ - లనన్ ఘటోత్కచుగనియె

వ. అంత నాఘటోత్కచుండు రాక్షస పిశాచ బలపరివృతుండై "పని గల్గిన నన్నుదలంపు డప్పుడవత్తు" నని పల్కి యంతర్ధానంబునొందె. పాండు కుమారు లయ్యాశ్రమంబువదలి కతిపయ ప్రయాణంబుల నేకచక్ర పురమ్ముంజేరి బ్రాహ్మణవేష ధారులై యొక్క విప్ర గృహమ్మునందుండి మధుకర వృత్తిన్ జీవించుచు నొక్కనాడు తామున్న విప్రగృహంబున నొక్కపెట్ట యార్తధ్వని వినవచ్చిన విని దుఃఖకారణ మెఱింగి రమ్మని కుంతినంప నామెయు లోనికింజని బ్రాహ్మణింగని.

ఫ్రక్రివాకీటు - త్రిపుట

ప॥ ఇంతయాకస్మిక విచారం - బేమివచ్చె నెఱింగింపుమిపు ॥ఇంత॥
అ॥ ప॥ చింతిలకు మూరడిలు మమ్మా - చేతనగు సాయముం జేసెద॥ఇంత॥

చరణము

భూతలమున బరోపకార - మ్మునకు మించినపున్నె మున్నె
పూతచారిత్రు లసమానులు - పుణ్యదంపతులయ్యయోమిమా ॥ఇంత॥

సీ. అనిన నాలించి బ్రా ♦ హ్మణి కుంతికిట్లనె
మానుషంబున దీర ♦ రానికష్ట
మియ్యది, యైన మీ ♦ కెఱిగింతు నిచటి కా
మడమేర బకుడను ♦ మానుషాదు
డొక్కండుకాపుర ♦ మున్నవా డతనికి
నిత్యంబు నొక్క మా ♦ నిసిని మఱియు
రెండెనుబోతుల ♦ బండిద్యమున్న మొసంగ
పురవాసులెల్ల రే ♦ ర్పఱచుకొనిరి

తే. గీ. యిల్వరున మాకువచ్చె నే ♦ డేకపుత్రు
నీతనూజాతు రక్కసు ♦ వాతబెట్ట
నేరకుంటి మిదె విచార ♦ కారణంబ
టన్న నామెకు కుంతి యి ♦ ట్లనియె బ్రీతి.

ఉ. గారము మీర బెంచి సరి ♦ గా మ కుపచ్చలు నారనట్టి చి
న్నారి యనుంగుపట్టి జను ♦ నా ? పెనురక్కసి పొట్టజెట్టెటిల్

దారుణ మింతకన్నగల ♦ దా ? మఱి. నాకుకుమారులేవు రు
న్నారుగదమ్మ ! యందొకని ♦ నంపుదుగావున నూరడిల్లుమా.

వ. అనవిని గృహమేధిని యిట్లనియె.

చ. కొమరులు నీవు బేదవడి ♦ కూటికి గుడ్డకు మోములువాచి జో
లెముగొని బిచ్చమెత్తుకొని ♦ లేమిడి గుందుచునుండ బుత్రశో
కము పయిపెచ్చుమీకొకటి ♦ కల్పన సేతునె? యింతకన్న బా
పముగలదే? తనూభవుల ♦ పైదయ యేరికినే సమానమే.

వ. అనిన గుంతియు.

తే. గీ. నాకు బుత్రులపై బ్రేమ ♦ లేకగాదు
యసురనోర్వంగజాలిన ♦ యట్టికొడుకు
లేవున్నారు; బకుని జం ♦ పించి నేడు
నగరి కుపకృతిసేయుటే ♦ నాతలంపు.

క. అనినవిని విప్రదంపతు
లనుపమమోదాబ్ధి దేలి ♦ రా వృత్తాంతం
బును సర్వ మనిలసుతునకు
వినిపించిన కుంతి, యతడు ♦ బ్రియమున బలికెన్.

సారంగ - ఖండగతి

ప॥ మంచిపనిజేసితివి - మాయమ్మ, బకునిపరి
మార్తు నే బోయినే - డే, పీరమాతవుగాన ॥మంచి॥

అ॥ప॥ మించిసాధువుల గా - చెంచు క్రూరుల విదా
రించుటే ధర్మమగునీ యుత్తమ క్షత్రియుల కెందును ॥మంచి॥

చరణము

పిండివంటలతోడ - బండెడన్నము నాకు
బెట్టింపు మాదైత్యునీ - బిండిపిండిగా గొట్టెద ॥పిండి॥
నిండునాకడుపాకలి - నిమిసమున బాపలకు
నీచదానవబాధ - నిర్మూలంబై పోవును ॥మంచి॥

క. అనిపలుకనంతలో యమ
తనయుడటకేటి కరుగుదెంచి ♦ తద్వృత్తాంతం

బును సకలమెఱిగి భయమున
జననికి వాకొనియెనిట్లు ♦ ప్రాంజలియగుచున్.

సీ. పాండవాన్వయము ని ♦ ల్పగ భద్రగతి వజ్ర
పంజరంబెవ్వాని ♦ బాహు యుగము
లాక్షాగృహమ్ము వె ♦ ల్వడజేసి ప్రాణ దా
నమొనర్చె నెవని వి ♦ క్రమ విహార
మడవి హిడింబు డా ♦ హరింపకుండ ర
క్షించె నా ♦ డెవ్వాని చేతిలావు
తలపువచ్చిన మాత్ర ♦ ధార్తరాష్ట్రులకు సిం
హస్వప్నమెవని రూ ♦ పాతిశయము

తే. గీ. సామజారాతిబలు నట్టి ♦ భీమసేను
బ్రాహ్మణార్థమ్ముగా నిట్లు ♦ బంపదగునె ?
ధరణిసురునకు సాయమ్ము ♦ తప్పదేని
బకునకాహారముగ నన్ను ♦ బనుపరాదె !

వ. అనిన విని కుంతియు.

ఉ. ఇంచుకపీనిశక్తి బరి ♦ కించక మించుగ సాహసించి నే
పంచినదానగా నితడు ♦ బాల్యమునం దొకనాడు నాడు చే
యంచునజారి క్రిందవడు ♦ నంత దనుక్షతిపెంపునన్ శిలా
సంచయమెల్ల జూర్ణమయె ♦ జంపగలా డితడా నిశాచరున్.

తే. అని సమాధానముం జెప్ప ♦ నంతలోన
నా వృకోదరుడిష్టాన్న ♦ మారగించి
చని బకస్థానమున కొక్క ♦ శకటమెక్కి
కూడుదినుచుండ రక్కసుం ♦ డౌడుగఱచి.

కన్నడ - రూపకము

ప॥ ఎవ్వడవోరోరిబడుగ - యింతసాహసించితివి ॥వె॥

అ॥ప॥ క్రొవ్వున నాకై తెచ్చిన - కూడుదిందువా ఛీఛీ ॥క్రొ॥

చరణము

ఉండుము నీమేనికండ - లొలిచెద రక్తముద్రావెద
బండబెట్టి నీయెముకలు - పిండిపిండిగా గొట్టెద ॥నెవ్వ॥

క. అని చేసత్తువకొండిగ
వెనుజఱచిన సుంతయేని ♦ బెదరక భీముం
డును తనుగానటు లన్నము
దినుచుండ నిశాచరుం డ ♦ తి క్రుద్ధుండై.

క. తరువొండు బెఱికి చేగొని
బిరబిర జనుదెంచుచుండి ♦ భీముడు వడి నో
గిర మెల్ల గుడిచి కోప
స్ఫురితారుణనేత్రుడై క ♦ పోలము లదరన్.

ఉ. సాలమహీజమొండుగొని ♦ చయ్యనదుష్టనిశాటుసేయ, దా
నేలగలట్టి వృక్షమున ♦ గెవ్వుననార్చుచు దైత్యుడేసె, నీ
లీల నొకింతపోరి బలు ♦ లిర్వురు జేసిరిహుంకృతుల్ భుజా
స్ఫాలననిస్వనంబులు ది ♦ వంబునుముట్టగ మల్లయుద్ధమున్.

ఆ. వె. గాలికొడుకు దనుజు ♦ కటికంఠదేశముల్
బట్టి జానుదండ ♦ ఘట్టనమున
వెన్నువిఱుగబొడిచె ♦ బిశితంబుతో నవ
ద్వారములను రుధిర ♦ ధార లొలుక.

వ. ఇట్లు భీమసేనుండు బకాసురుం గెడపి తత్కళేబరం బీడ్చుకొనివచ్చి నగరద్వారసమీపంబునవైచి తద్వృత్తాంతమ్ము జననీ సోదరులకెఱింగించి యేకచక్రపురవాసులకు నాటినుండి రాక్షసోపద్రవం బుడిపె.

శ్రీ

# మహాభారతము

## ద్రౌపదీస్వయంవరము

కాంభోజి - రూపకము

ప॥ ద్రౌపదీస్వయంవర క - థాసుధారసము గ్రోలుడు॥ ద్రౌ॥

అ॥ ప॥ ప్రాపిత భవరోగముల బ - టాపంచలు గావింపుడు॥ ద్రౌ॥

చరణము

కలకాలము గష్టంబులు - కాపుర మొకచోనుండవు
వెలయగ జీకటిపోయిన - వెన్నెలవచ్చుట సహజము॥ ద్రౌ॥

సీ. ద్రుపద మహీనేత ♦ ద్రోణుచేత బరాభ
వంబంది కుంభ సం ♦ భవు వధింప
జాలు తనూజాతు ♦ శక్రనందనునకు
దేవి కాదగిన పు ♦ త్రికను వడయ
యాజమునీంద్రుని ♦ యాజకత్వమ్మున
వరకోకిలాదేవి ♦ పత్నిగాగ
బుత్రకామేష్టి స ♦ ల్పుడు కరవాల కో
దండ వర్మ కిరీట ♦ ధారుడగుచు

తే. గీ. నగ్నినుండి ధృష్టద్యుమ్ను ♦ డను సుతుండు
గృష్ణయను నొక్క సుతయు జ ♦ న్మించిరంత
బరిణయ వయస్కయైయున్న ♦ బాలనుగని
సచివముఖ్యులకనియె నా ♦ చాల విభుడు.

ఉ. వీరలు పాండవేయులు త్రి ♦ విష్టపమాన్యులు నాడు దగ్ధులై
పారని లక్క యింటను వి ♦ నంబడు లోకవదంతి; యందు దు
ర్వార పరాక్రమక్రముడు ♦ పార్థుడు వానికొసంగ గంటి నీ
వారిజనేత్ర నెట్లు పెర ♦ వానికొసంగుదు బుత్రి నక్కటా!

చ. అనిన బురోహితుండనె ♦ ధరాధిప చూచితినే నుపశ్రుతిన్
జననుత పాండవుల్ సుఖులు ♦ చాటగబంపు స్వయంవరంబనన్
విని నరపాలు డట్లుసలి ♦ పెన్ వడి, బాండవు లందు సేరగా
జననిని వెంటబెట్టుకొని ♦ సాగిరి కాల్నడకం బ్రయాణమై.

వ. ఇట్లు బయలువెడలి రేబవళ్ళనక పోవుచు నొకనా డర్ధరాత్రం
బున సోమశ్రవంబను తీర్థంబున గంగాస్నానార్థులై యర్జునుం
డొక కొఱవింజేకొని దారిసూప నడచునెడ యువతీసహితంబుగ
నందు జలక్రీడలాడుచున్న యంగారపర్ణుండను గంధర్వుండు పాండ
వుల యలికిడి విని ధనుర్ధరుండై వారికిట్లనియె

హిం॥ తోడి - చతురశ్రగతి

ప॥ ఎవరావచ్చునది మా - నవులిట గ్రుమ్మరరాదు మనడు రేయి॥ నె॥
అ॥ ప॥ దివిజయక్షగంధర్వరాక్షసులు-తిరుగు వేళలందిటునిర్భయులై॥ఎ॥

చరణము

ధూర్తముండు డీ వనమును గంగా - తీరంబును నాయువియేగాపున
వీరభోజ్య మీపుణ్యభూమి, కు-బేరుసఖుడనంగారపర్ణుడను ॥ఎవ॥

తే. గీ. అర్ధరాత్రమ్మునన్నడ ♦ యాడువారి
నెంతవారలనేని గ ♦ హింతు మేము
ప్రాణములనాసయున్న బాం ♦ డవుల కనిన
ననియె నిటు భయవర్జనుం ♦ డర్జునుండు.

చ. కడిమిగలట్టివీరులము ♦ గావున నేయిటువచ్చినార మీ
యడవులు బుణ్యతీర్థములు ♦ నద్రులు సార్వజనీనముల్గదా!
నడుగులు గట్టిపెట్టుమిక ♦ జాలును నోటికి బుద్ధిచెప్పు కొ
మ్మడుగక యస్త్రశస్త్రవిదు ♦ లున్నెడ జూపకు నీప్రతాపముల్.

మ. అనుచున్ నంత నిశాతసాయకము లే ♦ యన్ మీరి గంధర్వు డో
య్యన ద్రోణప్రియ శిష్యుఁ డుస్వడిచె దా ♦ నాగ్నేయబాణమ్ము దో
డ నె నేలంబడె బమ్మరిల్లి ఖచరుం ♦ డవ్వాని గాంగేయుఁడుం
గొనివచ్చెన్ సమవర్తి సూనుకడకున్ ♦ గొప్పందిపెల్లీడ్చుచున్.

వ. అంతలో నంగారపర్ణు మనోవల్లభ యగు కుంభీనసి పాండవు
లను డాసి.

సాకేరి - ఆది

ప॥ శరణు శరణు పతిదానమొసంగుడు-నిరుపమానకరుణానిధులార॥ శ॥
అ॥ప॥ శరణాగతరక్షణముకన్నను-పరమధర్మమొందున్నదె ధరలో॥ శ॥

చ ర ణ ము

పిన్న పెద్దతారతమ్యమెఱుఁగక - తెన్నుదప్పి మిమ్మేమోయనె
నన్నలార, నానాథుమన్నింపు-డాలుమగలనెడబాపుటధర్మమె॥ శ॥

కం. అని మొఱలిడ విని ధర్మజు
డనఘుడు విడిపించె వాని ♦ ననుకంప మెయిన్
వినతుండై గంధర్వుం
డనియె త్రిలోకైకవీరు ♦ డగు క్రీడి కిటుల్.

మ. నను మన్నింపుము, దుర్మదాంధుడగు న ♦ న్నా! కామినీగోష్ఠిను
న్ననరుం డెంత వివేకియైన, త్రిజగ ♦ న్మాన్యున్నినుం గోరు ద
య్యనలాస్త్రంబిడి నాకు నావలన గా ♦ మాశ్వంబుల న్నీవు గై
కొని మిత్రుంబలె జూచుకొ మ్మనవు డా ♦ కుంతీసుతుం డిట్లనెన్.

తే. గీ. చెలిమి బాటింతు హయములన్ ♦ వలసినపుడు
గొందు నీకడనుంచుమా ♦ గొనుము పావ
కాస్త్రమిచ్చెదనని యిచ్చి ♦ యచటువాసి
చిత్తమలర భాగీరథి ♦ నుత్తరించి,

చ. చనిచని యుత్కచంబను ప్ర ♦ శస్త మహాత్తర పుణ్యతీర్థమం
దున. దప మాచరించు విబు ♦ ధోత్తముధౌమ్యుపురోహితత్వమున్
గొని యటుపై బరాశరత ♦ నూజహితమ్ముగ జేరరంత గొ
బ్బున ద్రుపదక్షితీంద్రు పుర ♦ ముం బరిశోభితరాజవారమున్.

వ. ఇట్లు కాంపిల్యనగరంబు సొచ్చి యందొక్క కుంభకార గృహంబున
విడిసి తమ్మెవ్వరు నెఱుంగకుండ బ్రాహ్మణవృత్తి నుండునంత
ద్రుపదుండును పాండవమధ్యముం డగు క్రీడికి దన కూతునీయ
సమకట్టి పాండుకుమారుల జాడ గానంబడకుంటచే నొక్క మత్స్య
యంత్రంబు నిర్మించి విల్లు మోపెట్టి యద్దాని నెవ్వం డేసు బాణ
ములగొట్టు నాతనికి తనయనిచ్చి వివాహం బొనర్తునని దేశ
దేశమ్ముల జాటింపజేసిన నానాదేశ మహీనాథులు తమతమ
బిరుదు లేర్పడ వేర్వేర పడగలంబన్ని భూమి గ్రక్కదల ద్రుపద
పురంబు జేరి రాజ పురస్కృతులై స్కంధావారమ్ముల విడిసిరి.
పాండు కుమారులు లక్కయింట హుతాశనున కశనంబై
రని సంతసించు ధార్తరాష్ట్రు లగు దుర్యోధ నాదులు
కర్ణాశ్వత్థామ భూరిశ్రవ సోమదత్తాదులం గలసివచ్చిరి. అంత
పాంచాలపతి మహీపతుల నెల్లర స్వయంవరరంగంబున నాసీనుల
గావించి పూజించుచుండ దేశాధిపు లెల్ల సభాభవన మలంకరించు
చుండ, శల్య విరాట జరాసంధాదు లొక ప్రక్క, కృష్ణబలరామకృత
వర్మాది యదువీరు లొకవంక, మఱియు శిశుపాల సైంధవ భగ
దత్త పౌండ్రక వాసుదేవాది వివిధ దేశాధీశు లొక చక్కి నాసీ
నులై యుండునంతలో పుష్పమాలం గేలం గైకొని, పుష్పసాయక
కుసుమేతరంబగు నాఱవసాయకం బన సర్వాభరణ విభూషితయై
తటిల్లత వోలె జూపఱకు మిఱుమిట్లు గొల్పుచు మందగమనంబున
పాంచాలి రంగమధ్యంబునం బ్రవేశింప వివాహోపకరణ సంభా
రమ్ములు సంసిద్ధముగా బురోహితుండు గాచియుండ ద్రుపదుండు
రాజలోకము నెల్లం గనుంగొని లక్ష్యంబును జూపి యిట్లనియె.

మంజరులు

ఈ యంత్రము దెగనేయు విల్కాని - కిల్లాలగు నాపట్టి
తోయజాక్షిం గొనుడు మీమీశ - క్తులి త్తఱిం జూపెట్టి
అనిన న్విని నానారాజపుత్రు - లాయంత్ర మేయఁగడగి
ధనువు నేని మోపెట్ట నేరకే - దలకిరి బీరములుడిగి

డాయరైరి కొందఱు మఱికొందఱు - డాసిపరికించి చనిరి
తోయజభవాదులకునే నియ్యది - దుస్తరమని వాకొనిరి
కడకు భస్మమధ్యమ్మున నుండగ్ని - కణము వోలెగనుపట్టి -
పుడమిసురుల నడుమనుండి వెల్వడ - గడగు క్రీడి పొడకట్టి.

వ. కృష్ణదేవుండు రహస్యంబుగ బలరామున కిట్లనియె.

చక్రవాకము - ఆది.

ప॥ అతడెవడో తెలిసితివా నీ వన్నా! మన మేనత్తకొడుకు నిజ ॥మత॥

అ॥ప॥ మతిమంతుడు వీరాగ్రణి పాండవ
మధ్యముండు మనముద్దుల బావమరది ॥య॥

చ ర ణ ము

ఫుల్లాంబుజముల నేలు కన్నుగవ - మోకాల్మీదికి జాఱు కేలుగవ
పల్లవారుణాధర మతివిశాల - వక్షస్థలమల్లదే పోల్చిచూడుమ ॥యత॥

తే. గీ. పాండుపుత్రులు వారణా ♦ వతమునందు
లక్క యింటను బడి దగ్ధు ♦ లైరటంచు
కౌరవులు సంతసించుచు ♦ న్నారు గాని
వార లేవురు బ్రతికి యు ♦ న్నారు నిజము.

వ. ఇట్లు పలుకుచున్నంత.

క. నెడదయురమ్మున, పిడికిట ని
ముడు కొను, విశాలనేత్ర ♦ ములు దీపింపన్
బుడమిసురుల నడుమను వె
ల్వడ నొక్కడు వానిగని స ♦ భాసదులెల్లన్.

సీ. అవనీసురుడు మీన ♦ యంత్రమేయగ సాహ
సించినందుల కేవ ♦ గించినారు
రంగమధ్యమున ని ♦ ల్వంబడి ధనువుగ
న్నార వీక్షింపగా ♦ నవ్వినారు
తగ బూర్వపరిచితం ♦ బగు చాపముంబోలె
మోపెట్ట నిర్ఘాంతి ♦ పోయినారు

తెప్పపాటున వ్రేటు ♦ దప్ప కౌలక్ష్యంబు
గొట్ట ముకుళనవ్రేలు ♦ బెట్టినారు
తే. గీ. పొలతి పార్థునిగళమున ♦ బూలదండ
నెలమి వేయంగ గాంచి ల ♦ జ్జించినారు;
శల్యరాధేయులంతి బాం ♦ చాల విభున
కలిగి తులువతనంబున ♦ బలికినారు.

ఆఠాణా - ఆది.

ప॥ పేరందిన రాజు లిందరుండగ
పిల్లనొసంగుదువా - పేదపాఱునకు ॥పిల్ల॥
అ॥ కోరినీయంత క్రొవ్వనం దెచ్చు
కొన్నాడవు ముప్పు - చేసితివి తప్పు ॥పే॥

చరణము

సకల ధారుణీవరుల రావించి-సభలో నీవిటులపరాభవింతువ ॥సభ॥
బికిర మెత్తిజీవించు బాపన-య్యకుగన్నియనిడగానీమన సెటులొప్పెను॥
ఉ. ప్రీతిగ పప్పుభోజనము ♦ బెట్టుటకో? సేల్వ లొసంగుటకో? ధన
వ్రాతము లగ్రహారముల ♦ పారముగానిడు టొప్పు గాకిటుల్
కూతు నొసంగబోలునొకొ ♦ కూళతనంబున బాఱువానికిన్
ఛీ! తులువా వినింద్యమగు ♦ సేతలు ప్రాజ్ఞులు సమ్మతింతురే?
వ. అనవిని ధృష్టద్యుమ్నుండు కర్ణుంగని.
ఉ. బాలను యంత్రమేయగల ♦ వాని కొసంగుదుమంటి మందు భూ
పాలుర కన్న యర్థ మెటు ♦ వచ్చును? కొట్టక పోయినాడవే
మీరా? లలితాంగి నీకిడుదు ♦ మేగద, యూరక కారులాడగా
నేల? యదట్టులుంచి వచి ♦ యింపును ముందుగ నీవు రాజవో?
వ. అని పలుకనంతలో గర్ణుని మఱియు నవమానింప దలంచి కృష్ణుం
డిట్లనియె.
ఉ. అమ్మనన మీనయంత్రము ర ♦ యమ్మన గొట్టగ జాలువాడె పో
కొమ్మను బెండ్లియాడు, కుల ♦ గోత్ర విమర్శన మున్నదన్న యం
శమ్మట లేదు గావునను ♦ సర్వమెఱింగియు నేటికీ వివా

దమ్ము? లతాంగి పాఱునకు ♦ దక్కెఁగదా యిక సూతనందనా!
కం. తలపోయ జతుర్వర్ణ
ములవారి వివాహమాడ ♦ బోలును ద్విజుడున్
తొలిబాముసన నేపున్నము
సలిపెనొకో ద్రుపదు డిట్టి ♦ జామాతనునై.

వ. అనిన రాధేయుండును.

ఉ. పాఱుడు నాల్గు వర్ణముల ♦ వారి క్రమమ్ముగ బెండ్లియాడు టా
చారముగాని; ముందుగనె ♦ క్షత్రియకన్యను బెండ్లియాడు టా
చారముగాదు, ధర్మమెడ ♦ సల్పి కొమారిత బావనయ్యకుం
గూరుచు భూవరున్ గెడప ♦ కున్న నధర్మము మేరమీరదే.

వ. అనిపల్కుచు ద్రుపదునిపై కుఱుకబోవునంత ద్రుపదుండును బ్రాహ్మణుల మఱువుసొచ్చిన నచ్ఛాందసులు దిగ్గునలేచి చెలరేగి కర్ణుంగని కోపించుచు.

బాణు - చతురశ్రగతి

ప॥ చూతువేమి లెమ్ములెమ్ము సుబ్బావధానీ
చేతగాని వారమా సోమావధానీ॥ చూ

అ॥ప॥ మూతిమీదగొట్టి వీని ముట్టుకున్న దోసమునకు
మునిగిగంగలో సహస్రగాయత్రి సేయంగవచ్చు॥ చూ॥

2. ఆరింట తా బెట్టి పద్దెమల్లు - రామశాస్త్రి
మారిపంపకంబు సేయు - మల్లుభట్లరాత్రి
పోరాదీక్షితులు మన - వారి పరశురామముఖ్య
వీరులబిల్చుకరమ్ము - వీని గూబలెక్కదీయ॥ చూ॥

సీ. జారిలకంగ వ ♦ స్త్రమ్ములు ముడివైచి
ముందుగన్పడు వారి ♦ మోదువారు
దర్భాసనములు జి ♦ క్రాసనమ్ములు బట్టి
కసిమీర జనముపై ♦ విసరువారు
మొలనున్న పొడుముకా ♦ యలదీసి యెదిరిపై
రివ్వురివ్వన చేత ♦ రివ్వువారు

ప్రతిబింబముల్ సూచి ♦ పగతురంచని నిల్వ
టద్దముల్ పగులంగ ♦ గ్రుద్దువారు
తే. గీ. నుదకముం బుక్కిటంబట్టి ♦ యుమియువారు
గట్టిగా దొడపాశముల్ ♦ బెట్టువారు
నై విజృంభించు పాఱుల ♦ నర్జునుండు
గని నివారించి సూతనం ♦ దనున కనియె.

కళ్యాణి - ఆది

ప॥ ననుజయించి పాంచాలుని గవయుము
నాముంగడ జూపుము నీ బీరము॥ నను

అ॥ప॥ తనతనయను నాకిడు టపరాధమ
తగవుమాలి ప్రేలెదు సూతాధమ॥ నను॥

1. మదముబట్టి కన్నుమిన్నుగానవు - మది నోకింత మంచిచెడ్డలరయవు
రథముదోలి బ్రతుకందగువానికి-రాచపాడినీకేమి తెలియురా॥ నను॥

సీ. రోమపాదమహీధవ ♦ రుండు శాంతాసతీ
మణి ఋష్యశృంగ స ♦ న్మౌనికిడడె ?
శర్యాతిధారుణీ ♦ శ్వరుడు సుకన్యాల
తాంగి నాచ్యవన మ ♦ హర్షికిడడె ?
నళమేదినీజాని ♦ నళినీ కుమారి నా
మౌద్గల్యుడను మహా ♦ మహున కిడడె ?
మఱి విదర్భావనీ ♦ వరుడు లోపాముద్ర
ననఘున కాయగ ♦ స్త్యునకునిడడె ?

తే. గీ. పూర్వరాజేంద్రు లిట్లు ము ♦ న్మోందుగానె
తమ తనూజల బ్రాహ్మణో ♦ త్తముల కొసగు
చుండు టాచారమై వచ్చు ♦ చున్నదనగ
నిందు ద్రుపదక్షితీంద్రు త ♦ ప్పేమి గలదు ?

తే. గీ. ధనువు మోపెట్టి యంత్రముం ♦ దునుమ లేక
యువిద నాకబ్బుటం గని ♦ యోర్వలేక

సమరమున నన్నెదుర్కొన ♦ శక్తిలేక
ద్రుపదుపైబడ జూతువా ♦ తులువ! నీవు.

వ. అన విని రాధేయుం డబ్బురపడుచు,

ఉ. ఎట్టును మేదినీసురుల ♦ కిట్టి పరాక్రమ మెన్న డేని గ
న్పట్టదు, నన్నెదుర్కొనగ ♦ వాసవశంకరభార్గవార్జునుల్
దొట్టి మహాధనుర్ధరు ల ♦ లో నెవడేని యొకండుగావలెన్
జెట్టివి గావునన్ దొలుత ♦ జెప్పుము వారల నీ వెవండవో.

వ. అందుల కర్జునుం డిట్లనియె.

తే గీ. ఏ నెవండనో తెలియ నీ ♦ కేల? కలన
నాయెదురనిల్చి చేవ గ ♦ న్పఱపరాదె!
వాసవాదులవోలె దే ♦ వ తలలో నె
వండగా నెందునను విజ ♦ యుండ నరుడ.

మంజరులు

అనిపలుకుచు గర్ణునిపై దలపడు - నంత భీమ సేనుండు
తనపై గవిసిన శల్యు ద్రెళ్ళ నే - సె నంతక సన్నిభుండు
యింద్రసుతుం డవలీల గర్ణు నో - డించి హర్షమున జెలగి
చంద్రాననగొనిచనె గుంభకార - సదనమున గుంతి కలగి.

మ. తడవయ్యెన్ సుతులేగి యుత్సవము సం ♦ దర్శింప, రారింతకున్
గడుదుర్మార్గులు కౌరవుల్ తనయులన్ ♦ శంకించి గుర్తించి యే
చెడుగుంగూర్చిరొ? బిడ్డలెట్టుమఱలన్ ♦ సేమంబుగా గన్నులం
బడువారోగద! నీవదిక్కు కరుణా ♦ పారీణ! సర్వేశ్వరా!

క. అని కుంతి జాలివడునెడ
ననిలజ కష్ణాసమేతు ♦ డై మోదమునన్
జనుదెంచి శక్రతేనయుడు
జననికి గేలోడ్డిచ్చి యనియె ♦ చతురత మెరయన్.

భైరవి _ ఆది.

ప॥ భిక్షదెచ్చితిమమ్మా - ప్రియము మీర నేడు ॥భి॥

అ॥ ప॥ అక్షీణకటాక్షు డాశ్రితావను-డంభోజదళాక్షు సత్కరుణ ॥భి॥

చరణము.

ధరణీబృందారకచూడామణి - నిరుపమాన కోదండవిదగ్రణి
పరమపూజ్యు డాచార్యుడునగు కుం - భసంభవాశీర్వాదంబున ॥భి॥

2\. అనవరతలోచనాభిరామమై - అఖిలలోకసన్నుతి భాజనమై
అనుపమానంద సంధాయకమై - యనితరజనదుర్లభమై తగు ॥భిక్ష॥

తే. గీ. అనినవిని కుంతి ముదమున ♦ నన్నలార
యనుభవింపుడు మీ రేవు ♦ రనుచు గ్రీడి
వెనుక లజ్జావనతముఖ ♦ వనజయగు వి
భీతహారిణేక్షణం గని ♦ విస్మయపడి.

వ. ధర్మతనూజుంగని

చ. అనుజుడు భిక్షదెచ్చితి న ♦ టంచన నెప్పటిమట్లు లేవురున్
గొనుడనియంటి నా నుడుల ♦ కుం బ్రతికూలముగల్గదెన్నడున్,
దనయులు మామకాజ్ఞ జవ ♦ దాటరు మీరలు, పెండ్లియాడ జె
ల్లునె యొకకన్య నేవురు వి ♦ రుద్ధముగా, తెరువేది? నాయనా!

చ. అనవిని ధర్మనందనుడు ♦ నర్జున! యంత్రము నేసితీవె గా
వున సతి నీవగైకొనగ ♦ బోలు వివాహముగమ్మన న్నరుం
డనె యవివాహితుండవగు ♦ నగ్రభవు నిన్నువీడి మున్నుగా
ననుజుడ బెండ్లియాడ జన ♦ దట్లగుటం గొనుమీవె రాణిగన్.

వ. అనిపల్కు నవసరంబున బలరామకృష్ణులు సోదర చతుష్క మధ్యం
గతుండగు ధర్మజాతుంగన నేతెంచి, యుధిష్ఠిరునకుం గుంతీదేవికిని
మ్రొక్కి భీమార్జున నకుల సహదేవులంగని కౌగిలించుకొని.

ఆభోగి _ రూపకము

ప॥ ఎన్నాళ్ళకు కనుగొంటిమి - కన్నులపండువుగా మి॥ మ్మె॥
ఉన్నారాసుఖులై మీ - రుర్వి బావమరదులార॥ మె॥

1. దుర్వినీతకౌరవ్యులు - ద్రోయు విషజ్జలధి గడచి
సర్వేశ్వరుకరుణ పున - ర్జన్మమెత్తి వచ్చినమి॥ మ్మె॥

2. కర్మవశమున నేదేని - కష్టము ప్రాప్తించుగాని
ధర్మాత్ములయెడ సూర్యో - దయమున తమమువలె దొలగు॥ నె॥

తే. గీ. భూసురులయందె మిముగొంత ♦ పోల్చివాడ
నవల మనయర్జునుడు మీన ♦ యంత్రమేసి
కర్ణు దరుముట, వడముడి ♦ గడగి శల్యు
దాకుటయు మీవిధమ్ము స్ప ♦ ష్టీకరించె.

వ. అని యిట్లు సంభాషించుకొను కృష్ణ కుంతీకుమారుల సంభాషణమ్ము
జాటుననుండి విని ధృష్టద్యుమ్నుం డతిత్వరితముగ నేగి వారివిధం
బెల్ల ద్రుపదున కెఱింగింప నతండును సంతసించి సగౌరవంబుగ
బాండవుల రావించి యేవురకుం బాంచాలి నిడి వివాహంబొనర్ప
సంశయించుచున్నంతలో నయ్యెడకుం గృష్ణద్వైపాయనుం డరు
దెంచి పూజితుండై యిట్లనియె.

కమాచి _ ఆది

ప॥ పిల్లనొసంగుమువీరి లేవురకు-విధివిధానమిదియద్రుపదక్షితీంద్ర॥ పి॥

అ॥ ప॥ తొల్లియీామె మౌద్గల్య మహాముని
కిల్లాలై బరగె - నింద్రసేనయనుపేరను॥ పి॥

చ ర ణ ము

పరమపతివ్రతగావున నిరతము
పరిచర్యలుసేయు కుష్ఠురోగియగుమగనికి॥ ప॥
వరునివలన సౌఖ్యము లవమేనియు
వడయనేర కకటా దేహముచాలించెను॥ పి॥

సీ. తనువుపాలించి యం ♦ తట గాశిరాజను
రాజర్షికొకట ద ♦ నూజయగుచు

జనియించి కన్యాత్వ ♦ మున బెద్దకాలమ్ము
గడపి నిర్వేదించి ♦ కడకు శంభు
గుఱిచి ఘోరతపమ్ము ♦ నెఱప, యమానిలేం
ద్రాశ్వినుల్ దాని దే ♦ హాంతరమున
బత్నిగాఁ గోరి, రీ ♦ శ్వరుడు ప్రసన్నుడై
వరము వేడుమటన్న ♦ వారిజాక్షి

తే. గీ. యేనుమాఱులు పతిదాన ♦ మిమ్మటన్న
రమణులేవురు దేహాంత ♦ రమున నగుదు
రనిచనెన్ శూలి; యాపె యీ ♦ యాజ్ఞసేని,
పాండుసుతులు యమాద్యంశ ♦ భవులు నిజము.

క. అనవిని వేదవ్యాసుని
యనుమతమున యాజ్ఞసేని ♦ నయ్యేవ్వుర క్గాఁ
య్యన నొసఁగి మహావైభవ
మున బెండిలిజేసె ద్రుపద ♦ భూవరుఁ డంతన్

శ్రీ

# మహాభారతము

## సుభద్రాపరిణయము

హిం॥ తోడి - ఆది

ప॥ వినుడు సుభద్రాపరిణయసత్కథ-వినిపించెద నేడు ఓ హితమనోవ్యథ॥
అ॥ తనివిదీరదు భారతవీరులచరి-తంబెంతకు విన్న దివ్యామృతం బెన్న ॥వి॥

చరణము

వీరులౌ పాండవేయులు ద్రుపదుని-వీటనుండునంత చారులవలన దెలిసి
కౌరవాగ్రజుడు కడువిచారించి-కడగి యొక్కనాడు తండ్రికిట్లనియె ॥వి॥

ఉ. ఏవురు లక్కయింట మర ♦ ణించిరి పాండవు, లింక నాకు ధా
త్రీవలయమ్ము సర్వమున ♦ దీనముగా గలదంచు నమ్మితిన్;
దైవవశమ్మునన్ బ్రతికి ♦ ద్రౌపదిగూడుక యున్నవారు మో
దావహులై వసించి ద్రుప ♦ దక్షితినాథుని పట్టణంబునన్.

శా. రానేవచ్చెను లక్కయింటనిడ కా ♦ ల్పంజూచినా మన్నవా
డీనాడయ్యదిపోదు పొమ్మనిన, సా ♦ ధింతున్ విరోధమ్ము, మా
మానేత్రమ్ములు ద్వేషగర్భితములే ♦ మాడ్కిం బ్రశాంతింప వా
పైనింజూతముగాక, పాండవుల బి ♦ ల్వంబంపుమీ వీటికిన్.

సీ. కల్పింతు సన్యోన్య ♦ కలహముల్ పాండుభూ
పాలతనూజ పాం ♦ చాలురకును
సేయింతు నెడబాటు ♦ చెలువకారణముగా
దివిరి కౌంతేయ మా ♦ ద్రేయులకును
పుట్టింతు విముఖత్వ ♦ ముం గృష్ణుపై బాండ
వులకు వేర్వేఱ భా ♦ ర్యలనుగూర్చి

తొడరింతువు విరక్తి ♦ ద్రోవదీ నా ప్రాణ
పుత్రులపై గల ♦ మోహముడిపి
తే. గీ. తొలుత భీముని వధియించి ♦ బలవిహీను
లగు యుధిష్ఠిరపార్థుల ♦ యముల గెడపి
తమ్మవలయు మేలుకొందుని ♦ ష్కంటకముగ
వారలంబిల్వబంపు స ♦ త్వరము, తండ్రీ!

వ. అన విని ధృతరాష్ట్రుండు మతిమంతులతో విచారించి చేయుదమని భీష్మ ద్రోణ విదుర కృపాశ్వత్థామ సోమదత్తాదులం బిలువం బంచి దుర్యోధను విధానం బెఱింగింప భీష్ముండు సుయోధనున కిట్లనియె.

శంకరాభరణము - ఆది

ప॥ తెలిసి మాలి దాయాదుల వైరము
దెచ్చుకొనకు విను నాయుపదేశము ॥తె॥
అ॥ ప॥ బలవంతులు గుణవంతులు కౌంతే
యులు నలువురకుం దలలో నాల్కలు ॥తె॥

చరణము

కౌరవులని పాండవులని భేదము గన్పట్టదు నాకు సముభయులును
మీఱువారుపంచికొనుడువమేలగు "పోరునష్టమునుబొందులాభమగు" ॥తె॥

చ. భరతకులాగ్రగణ్యుల, స ♦ భాజనయోగ్యుల, పాండుపుత్రుల
న్నిరుపమధర్మతత్పరుల ♦ నీ పినతండ్రికుమారులన్ మనం
బెఱియ వధింపజూడకు మి ♦ దే కులనాశకారణం బగుం
దెలుపకురా చెడేవని వ ♦ చింతురుగాదె బుధుల్ సుయోధనా!

సీ. అనిననాలించి యం ♦ ధనృపాలు డప్పాండ
వేయిటి రావించి ♦ విదురు నంపి,
కరిపురి నేనువ ♦ త్సరములు దుర్యోధ
నాదులతో నుండు ♦ నంత ధర్మ
సంభవు పార్థరా ♦ జ్యమ్మున కభిషిక్తు
సలిపి వారికి నిహా ♦ సమ్మగాగ

ఖాండవప్రస్థమ్ము ♦ గావించి యెలమి నం
పగ ధర్మజాదు లా ♦ వలనికి జని

తే. గీ. యమరనాథు డింద్రప్రస్థ ♦ మనజెలంగు
పురవరంబొండు విశ్వక ‐ర్మరచితమ్ము
వాసుదేవ ప్రియమ్ముగా ♦ వారి కొసగ
ధర్మజుండందు శుభముహూ ♦ ర్తమున విడిసె.

ఖ. యమునాకల్యాణి - రూపకము

ప॥ భళిరా తత్పురవరంబౌ - వసుధకలంకారంబు ॥భ॥
అ॥ ప॥ తలపగ సిరికాటపట్టు - ద్వారకకదితోడబుట్టు ॥భ॥

చ ర ణ ము

వేదవిదులు భూదేవులు - వీరవరులు ధరణీధవు
లాదెస బేరులు కుబేరులు-ప్రభుభక్తిపరులు పాదజులెల్లరుహాళికులు॥మి॥
సోదరులంబలె పరపురు - షులగనుగొని నిజకులమ
ర్యాదనిలుపు బరమపతి - వ్రత లావీటివెలందులు ॥భ॥

ఉ. లేరు దయావివర్జితులు, ♦ లే రవివేకులు, లేరు దుండగుల్
లేరు దురన్నభక్షకులు, ♦ లేరు ని రక్షరకుక్షులున్, దురా
చారులు లేరు, లేరువ్యభి ♦ చారులు, చోరులు తే, రసత్యవా
చాలతు లప్రయోజకు ల ♦ శాంతు లభాగ్యులు లేరు తత్పురిన్.

వ. ఇట్టి యింద్రప్రస్థపురంబున ధర్మజుండు నల్వురు తమ్ములుం దనకు విధేయులై యుండ సర్వజనానురంజకమ్ముగా ప్రజా పరిపాలనం బొనర్చు నెడ నొక్కనాడు నారదమహర్షి యతని పాలికరుదెంచి సత్కృతుండై తిలోత్తమాకారణంబున సుందోపసుందులు మరణించిన వృత్తాంతం బెఱుకపరచి ద్రౌపది యొక్కొక్క-నియింట నొక్కొక్క-యేడుండునట్లును, ద్రౌపదియున్న యింటికి బెఱవారు సనకుండునట్లును,చని రేని పండ్రెండునెలలు తీర్థసేవ సేయునట్లును సమయంబు సేయించి యథేచ్ఛం జనియె. కొండొకకాలంబున కొక్క-నాడొక విప్రుండు ముచ్చులచే దనహోమధేనువుం గోల్పడి యాక్రోశించుచుండ విజయుం డడవిని పాంచాలీసహితుం డై యున్న ధర్మనందను

నాయుధాగారంబుసొచ్చి ధనువుంగొని చోరులంబరిమార్చి బ్రాహ్మణునకు గోధనంబొసంగి క్రమ్మఱవచ్చి యుధిష్ఠిరునకు మ్రొక్కి యిట్లనియె.

చక్రవాకము _ ఆది

ప॥ సమయభంగముగ నరుదెంచితి నీ సదనంబున కేను -
అన్నా సుగుణ సంపన్న ॥స॥

ప॥ అమరమునీంద్రునికడ నుడివినయటు - లాచరించువాడ
ద్వాదశమాసిక వ్రతము ॥సమ॥

చ ర ణ ము

చోరులంగెడపి గోధనమును భూ ♦ సురునకిడు తలపునన్
ధనువునకై నీయిలు జొచ్చితి
పేరందినరాజులమై ధర్మము - మేరమీరు నెడలన్
నలువ్వురు మనల బరిహాసింతురు ॥సమ॥

తే. గీ. పలికిబొంకు లెన్నడు మన ♦ భరతవంశ
మందు మందునకైన లే ♦ దఖిలధర్మ
విడుడవీ వటుగాన వే ♦ వేగ నాకు
సెలవొసంగుము భూ ప్రద ♦ క్షిణ మొనర్తు.

వ. అనవిని ధర్మజుండును.

చ. కుముదహితాన్వయుల్ చకిత ♦ గోకుల విప్రవధూజనావన
క్రమము, లటుగాన భూమిసుర ♦ కార్యముదీర్చితి వట్టి నీకు పా
పము ఘటియించునే? సమయ ♦ భంగముగాదిది రాజధర్మము
త్తమగతి నిర్వహించితివి ♦ తమ్ముడ! పోబనిలేదు యాత్రకున్.

వ. అనవిని యర్జునుండును.

ఉ. గోవనితాద్విజావన మ ♦ కుంతిత పుణ్యమె మొ లేక పాపమైనా
దేవుడెఱుంగు, నేపురము ♦ దేవమునీంద్రుని సన్నిధానమం
దావిధి బాసజేసి యిపు ♦ డందులకున్ వెలిగా జరించుచో
కోవిదలోక మీపథమిది ♦ కుంతికుమారుల గేలిసేయదే?

ద్వి ప ద

అనవినిధర్మజుం - డంగీకరించి
యనుజాతునంప, బ్రా - హ్మణులు దీవించి
వెనువెంటరా గ్రీడి - చని తీర్థసేవ
యొనరించు నెడల యో - గ్యుల మహీదేవ
గణము బూజించుచును - గనె ముదంబూని
ఘనలోక పావనిన్ - గంగాభవాని;
స్నాతుడైయున్న వా - సవసూనుజూచి
కౌతుకమ్మున నాగ - కన్య యులూచి

మోహన - రూపకము

ప॥ అందమైనవాడు వీ - డౌరా నాకీడుజోడు॥ డం॥
అ॥ ప॥ ఇందిరాసతీ నందను - డెనగా డీ యందగాని॥ కం॥
1. మోవి జాతికెంపు నగు - మోము కళల నింపు
దేవమానవుల నితనికి - దీటువచ్చు సొగసరి లే - డం॥

ఉ. ఈ సుకుమారగాత్రు, జగ ♦ దేక ధనుర్ధరు గ్రీడిగూడి సం
భాసిత భర్మ హర్మ్యమున ♦ వారిజసాయకదివ్యసంగరో
ల్లాసము గాంతునంచు, జప ♦ లాలసు నిందుకులప్రదీపు న
వ్వాసవి కన్నుబ్రామిగొని ♦ వచ్చియునిల్పె నిజాంగణంబునన్.

తే. గీ. పిలువగా జపమొప్పటి ♦ వలె సలుపుచు
గొంతవడికి గన్దెఱచి వా ♦ కొనియె దరుణి !
యెవ్వ తెవునీవు ? నన్నిట ♦ కేలదెచ్చి
తీవు ? చెప్పుమన బల్కె నా ♦ తీవబోడి.

శహాన - ఆది

ప॥ ఇదె పాతాళ మలూచి యంద్రు భుజ
గేంద్రుడైన కౌరవ్యుని కూతుర॥ నిది॥
అ॥ ప॥ మదవతీ మదన - నిను మోహించితి
మాయగావించి - నిన్నిట దెచ్చితి॥ నిది॥

చరణము

తావకీన సత్కీర్తి మాజగతి - దవిలి వేనోళ్ళ గీర్తింపగవిని
నీ వయోరూపములకబ్బురవడి - నేమెచ్చితిదెచ్చితిమనసిచ్చితి॥ ని॥

ఉ. కాను వికారమెల్లరకు ♦ గల్గుట నైజము, గాని ముందు నా
రీమణి మోహమున్ వెలువ ♦ రింపదు పూరుషువోలె, బేలనై
ప్రేమమిడి వెల్లడించి విప ♦ రీతగతిం బ్రతిమాలుచుంటి, నీ
లేమ తనంతగోరెనని ♦ లేనివిరాగము జూపబోకుమా.

వ. అన విని యర్జునుండును,

చ. సరి సరి, దానికేమి యొక ♦ సంగతి విన్మిటు బ్రహ్మచర్యమున్
నెఱపుచు భూప్రదక్షిణము ♦ సేనొనరింపగ బుణ్యతీర్థముల్
దిరుగుచునుంటి, నల్పుని గ ♦ తింగయికొన్న వ్రతమ్ము వీడి సుం
దరి! నినుగూడు టొప్పునొకో?♦నా పయి నిందను వైచుటొప్పునో?

వ. అనిన సులోచియు:

క. ఎఱుగుదు మీరా పలికినవుడి
సుర ముని కన్య నప్ప్రశాల ♦ జొచ్చుటయు, యుధి
ష్ఠిరు నాదేశమ్మున నీ
వరుదెంచుట తీర్థసేవ ♦ కై, మహనీయా!

చ. వ్రతములు, తీర్థయాత్రలు, జ ♦ పమ్ములు, మానితదాన ధర్మముల్
సతతము ప్రాణదాన సదృ ♦ శమ్ములుగావు, మదీప్సితం బసం
గతమగునేని పో విడుతు ♦ గాయము నేడు మనోజవేదనన్
బతితము గట్టుకోకు, వ్రత ♦ భంగము జేకుర దో మనోహరా!

తే. గీ. పొలతివలచిన బురుషుండు, పూరుషుండు
వలచిన బొలంతి లోలోన ♦ వలపు గలిగి
పైకి బింకపు సేత లే ♦ ర్పడ నటింతు
రిదియ కాముక లక్షణం ♦ బెనెఱుగుదు.

వ. అని పల్కినంత నర్జునుండు దాని మనోరథంబు దీర్ప దలంచి.

కాఫీ—ఆది

ప॥ వ్రతభంగంబగు గాక సుందరీ-వశమైతిని నీకు విరహాగ్నిబడకు॥వశ॥

ఉ॥ ప॥ పతితమో పుణ్యమో విచారింప - వలనుగాదు మనకు
సమయోచితమే కర్తవ్యము ॥వ॥

చ ర ణ ము

సూనశరుని క్రొవ్వాడి కోలలకు - సుక్కుకుండ దరమా
పరమ మహర్షుల కైనను।
మీనవయన వాడివయసువారము - గాన తలప మనమెంత
వీడు మిక వలవంత ॥వ॥

చ. రతనపుటందియల్ నడక ♦ లన్ ఘలు ఘల్లుమనన్, పయోధర
ద్వితయభరమ్ము సైపసిగ ♦ తిన్ వడి గౌనసియాడగా, దర
స్మిత వదనారవిందయయి ♦ చేడియ చెంతకు జేరి నిల్చినన్
వ్రతములు సాగునే? జప త ♦ పమ్ములు సెల్లునె? వేయునేటికిన్.

మ ం జ రు లు

నాగసతి గనెనిరావంతుడను త - నయు సద్యోగర్భమున
వేగుజామునకు నిద్రసూను ని - ల్పెను గంగాతీరమున
జగతీసురులకు భుజగలోకమున - జరిగిన వృత్తాంతంబు
నగవైరిసుతుం డెటిగించి ప్రయా - ణంబయ్యె తత్క్షణంబు.

సీ. హిమవన్నగేంద్ర మీ ♦ క్షించి యాపై నగ
స్త్యవటమ్ము గనుగొని ♦ యచటినుండి
వెడలి పూత హిరణ్య ♦ బిందుతీర్థంబాడి
నైమిశారణ్యమ్ము ♦ నను నడుగిడి
తరలి ప్రయాగ కం ♦ తట మణికర్ణిక
న్గాంచి కాశీపట్ట ♦ ణంబు జేరి
సనుదెంచెను మహేంద్ర ♦ శైలమ్మునకును ద్రా
క్షారామమునకు శ్రీ ♦ శైలమునకు
తే. గీ. నవనిసురుల కయ్యెడల దా ♦ నాదికము లొ
సంగి తృప్తుల గావించి ♦ శక్రసుతుడు
వాసిమై పదమూడవ ♦ మాసమునను
తగ బ్రవేశించి మణిపూర ♦ నగర మందు.

తే. గీ. ఆపురంబేలు చిత్రవా ♦ హను, డతండు
తనతనూజాత చిత్రాంగ ♦ దయను దాని
పాండుతనయునకిడి మహా ♦ వైభవంబు
దగ వివాహమ్ము గావించి ♦ ధన్యుఁడయ్యె.

వ. ఇట్లర్జునుండు చిత్రాంగదను వివాహంబై యంగజక్రీడలనోలలాడుచు నొక్కనాడు తత్సమీపంబుననున్న సౌభద్ర పౌలోమ కారంధమ ప్రసన్న భారద్వాజంబులను పంచతీర్థంబులంగని యందు స్నానం బొనర్చి తపస్సంపన్నుండగు నొక్క బ్రాహ్మణుని శాపమ్మున మహాగ్రాహమ్ములై నీటబడియున్న వంచ, సౌరభేయి, సమీచి, బుద్బుద, లత యనువారల శాపవిముక్తులంజేసి మగిడి మణిపూరు పురమ్ముజేరి చిత్రాంగదయందు బభ్రువాహనుండను పుత్రుంబడసి యటనుండి పయనమై సమస్తతీర్థముల సేవించుచు, గడకు ద్వారవతీపుర సామీప్యమ్మున కరుదెంచి, సుభద్రంజూచుతలంపున నప్పురంబున నొరులు తన్నెఱుంగకుండ యాదవులు యతుల కతి భక్తులగుటంజేసి కృతకయతివేషధరుండై చరించు పాండవమధ్యముని ప్రభాసతీర్థమ్మున పుండరీకాక్షుండు గుర్తించి యతిస్నేహమ్మునం గౌగిలించుకొని యెల్లవారి కుశలమ్ము లడిగి సుభద్రయం దాతడు బద్ధానురాగుండగుట నుపలక్షించి యతనిందోడ్కొని ద్వారకాపురంబునకు సనుదెంచి రైవతకాద్రిపైనుంచి యామరునాడు రైవతకమహోత్సవమ్ము సాటించి యాదవులెల్లర నయ్యెడకు రావించి యాతనికి నమస్కరింపజేసి చాతుర్మాస్యమయ్యెడనొనర్ప బలరామాది యాదవులచే బ్రార్థింపజేసి పరిచర్యార్థంబు సుభద్రను నియోగింప.

సీ. ముఖసరోజమ్ముపై ♦ ముసరు బంబరములం
గని దోలుకొనలేక ♦ విసుపుకొనుచు
నధరబింబమ్మున ♦ కాశించి పై వచ్చు
శుకపాళి విడ దిక ♦ మకలువడుచు
జనుగట్ల విహరింప ♦ మునుకొని వెన్నంటు
శారికావితతి మ ♦ త్సరముబరపి

కరపల్లవమ్ముల ♦ దరిజేరు పెనుగండు
కోయిలపిండును ♦ గూకలిడుచు
తే. గీ. పదునిడిన పుష్పసాయకు ♦ ప్రదరమనగ
నన్నయానతి రైవత ♦ కాద్రి కరిగి
యతివరేణ్యునకు న్నమ ♦ స్కృతులొనర్చి
భయము భక్తియు వినయము ♦ ప్రతిల బలికె.

జంఝూటి _ ఆది

ప॥ సామి నీకు పరిచర్యగావింప-జనుదెంచితి నాపెద్దలయానతి॥ సామి॥
అ॥ ప॥ నీమనోరథము దీర్చివేయేల-నేధన్యురాలనగుదు నీలీల॥ సామి॥

చ ర ణ ము

కామాదులగెలిచినమిము గనగా-కన్నుదోయి మున్నేమినోచెనో
కామితార్థ సంధాయకం బమల-కళ్యాణాత్మకమౌను మీరాక॥సా॥
క. ముదమొదవగ గనుసన్నల
సదమలమతి బరిచరింప ♦ జనుదెంచితి నీ
వెదనింత సంశయింపక
యదియిదనక వలయుసేవ ♦ లందుము సామీ!

వ. ఇట్లుపలికి యతివరేణ్యునకు సేవలొనర్చుచుండ నతండును,
సీ. ననబోడి చెలువమ్ము ♦ గనువిచ్చి చూడంగ
వలనుగాకుంట గ ♦ న్ను లఱమోడ్చు
కోమలికై దండ ♦ గొన నాసవడి వేగి
రము గూడదంచు దం ♦ డముధరించు
నెలతకెమ్మోవి తే ♦ నియలాన పిల్గాక
యల కమండలుజలం ♦ బాచమించు
వగలాడిబల్కరిం ♦ ప గడంగి తగవు గా
దని పల్కి 'నారాయ ♦ ణా' యటంచు
తే. గీ. మనసుముందునకున్ సిగ్గు ♦ వెనుకకు దిగ
లాగ నెటు సాహసింపనే ♦ రక, పలుమరు

నుస్సురంచును వేడి ని ♦ ట్టూర్పుబుచ్చు
సకట! కుహనాయతీంద్రుఁ డ ♦ య్యర్జునుండు.

సీ. కనుసన్న జేసి ర ♦ మ్మనవ సామి సెలవేమి
యన బూలుతెచ్చితి ♦ వా యటంచు
చేపీవగ మహాను ♦ భావ! మీయాజ్ఞ యే
మన వేగవడ్డింపు ♦ మా యటంచు
చిఱునవ్వునవ్వ మీ ♦ చిత్త మేమన్న నీ
సేవలకున్ సంత ♦ సిలితినంచు
పెదవులన్ విఱువ త ♦ ప్పిదమేమనక బహూ
కృతిజేతు నీకు నే ♦ గతి నటంచు

తే. గీ. లోఁగలుగు గాఢతరకామ ♦ రాగమెల్ల
బయలుసేయంగ సంకోచ ♦ పడుచు వలయు
నితరవాంఛల వెలిబుచ్చు ♦ నెంతయేని
కష్టసాధ్యము తొలి మాట ♦ గలుపు కొనుట.

చ. అనిమిషరాజనందను స ♦ మంచిత రూపవయోవిలాసముల్
ఘనముగ విన్నదాట సరి ♦ గా యతిశేఖరునందు నట్టి ల
క్షణములఁగాంచి యుబ్బురము ♦ గా ననుమానపడున్ సుభద్ర, కా
దనుకొను నుండ రేయనుచు ♦ నచ్చుగ మానిసి బోలు మానిసుల్.

వ. అని తలంచుచు నొక్కనాఁడు యతివర్యుఁగని.

హిం॥ తోడి - మిశ్రగతి

ప॥ ఓయతీంద్ర దయానిధే మీ - మ్మొకటి యడుగ దలంచి యుంటిని-
నా యెడల గరుణించి తెలిపెదరా సర్వజ్ఞులున్ మహా - నీయ
మూర్తులు కాలవిదులు గదా ॥యో॥

అ॥ ప॥ ఏయేదేశము లేయే తీర్థము - లేయేవనము లేయే నగేంద్రము
లేయేనగరము లీరు జూచితిరి - యందందు గల యేయే విశేషము
లీరు గాంచితిరి ॥ఓ॥

చరణము

మీర లమరావతికి బ్రతిమై - మీరు నింద్రప్రస్థమును గను-లార నెందెం
దైన జూచితిరా - తన్నగరమున ధీయుతుల గుంతీసుతుల గనుగొనిరా-
వారలెల్లరు సుఖముగా ను - న్నార గురుధర్మాభిరతులై - వారిలో
వీరాగ్రగణ్యు బురం - దరసూను నర్జును - పాపవర్జను మీరలెఱు
గుదురా ॥ఓయతీంద్ర॥

తే. గీ. అన్నయానతి దీర్ఘయా ♦ త్రాభిగమను
డయ్యె నర్జునుడనివింటి ♦ నమ్మహాత్ము
మీర లెచ్చోటనైన గ ♦ న్నారలో కొ-?
క్రమ్మఱి పురంబుజేరు వా ♦ ర్తలు దెలిసెనె?

వ. అన విని కృతక యతిగ్రామణియు.

క. కనుగొంటిని తన్నగరము
గనుగొంటిని పాండవుల, సు ♦ ఖమ్మున నున్నా
రనిమిషరాజతనూభవు
గనుగొన్నాడ నతడేమి ♦ గావలె నీకున్ ?

వ. అనిన నాకృష్ణసోదరియు.

మోహన - చతురశ్రగతి

ప॥ దైవఘములు మీపట్లు నాకింక - దాపరికంబేటికి మున్మాటికి॥ దై॥
అ॥ప॥ వావికతడు మేనత్తకొడుకుగా-వలయునాకునిజముమహానుభావ॥

చరణము

కుంతినాకు మేనత్త తనకునే - కోడలినగుదునటంచు జెప్పికొను
చ్యెంతయు నాతలిదండ్రు లనుకొందు - రింద్రసుతుడు తమకల్లుడౌ
నంచు॥ దై॥

క. నరు నెందు గాంచి రిచ్చటి
కరుదెంచునె ? పెద్దవార ♦ లనుకొనుమాటల్
జరుగునొకో ? కరుణన్నా
కెఱిగింపుడు కాలవేత్త ♦ లీరు మహాత్మా !

వ. అనవిని,

సీ. ఏమందు నాయన ♦ యే మేముగా నుంటి
మెమ్మోయి సుంతభే ♦ దమ్ములేక
కలసియున్నాము గో ♦ కర్ణమం దిరువుర
మెన్ని యేనిదినమ్ము ♦ లింతయేల ?
తెలిసి మాచేయని ♦ తీర్థయాత్రలు లేవు
క్రీడి నేడిచట ను ♦ న్నాడనంగ
లజ్జించిపోమెదో? ♦ రమణి నీవెఱుగవు
యతివేషధారియై ♦ యలరు నిచట
తే. గీ. చెంతనేయున్న మగని ఛో ♦ ల్చికొనలేవు
దాచనేటి కర్జునుడ నే ♦ తరుణి! పురుషు
లంగనల పొందురోసి స ♦ న్యాసులగుదు
రంగనను గోరినేను స ♦ న్యాసినైతి.

క. అని జేజే రాకొమరుడు
వనజేక్షణ పాణి పల్ల ♦ వము బట్టుకొనన్
నునుసిగ్గు దొంతరల నై
మ్మనమున నారాటమొదవ ♦ మానిని పలికెన్.

ఆ. వె. పెద్దలెఱిగి మనకు ♦ బెండ్లిగావింతురు
వేగిరమ్ము తగదు ♦ విడువుమంచు
జనె సుభద్ర పురికి ♦ జలజనాభుం డది
యెఱిగి సతులకెల్ల ♦ నెఱుగజేసె.

సీ. తోబుట్టువునొసంగి ♦ దుర్యోధనునకు బెం
డిలిసేయ దనయన్న ♦ తలచుటెఱిగి
నగధరుండంత నం ♦ తర్ద్వీపమం దిందు
ధరునకు శివున కు ♦ త్సవము సేయ
జాటి, యాదవుల న ♦ చ్చటికిగొంపోయి సం
బరము తీఱినవెన్క ♦ మగిడివచ్చి
బలదేవముఖ్యుల ♦ నిలిపి తద్ద్వీపమం
దంగనాజనము వె ♦ న్నంటిరాగ

తే. గీ. పాండునందను రావించి ♦ ద్వారవతికి
తోడరి వాచస్పతి పురోహి ♦ తుండుగాగ
సమరపతి సంతసిల వైభ ♦ వమున బరిణ
యమ్మొనరించె నాసుభ ♦ ద్రార్జునులకు.

వ. ఇట్లు సంకల్పసిద్ధుండగు నగధరుండు సంప్రాప్తమనోరథుండయిన పార్థున కక్షీణబాణ తూణీర బాణాసన సనాథంబగు నొక్క-రథం బిచ్చి సుభద్రందోడ్కొ-ని యింద్రప్రస్థపురమ్మున కరుగుమని పంచి యంతర్ద్వీపమ్మున కరుగ విజయుండు సుభద్రందోడ్కొ-ని చనుచున్నంత పృథుశ్రవసుడాదిగాగల మహావీరులగు పురరక్షకు లెల్లరు బురందరసూనున కడ్డమై తాకిన నప్పాండవేయుం డలిగి వారలపై శరపరంపరలం గురియించుచుండ.

కళ్యాణి - చతురశ్రగతి.

ప॥ రథమునడపె పెండ్లిబావ కయ్యెడ-రణరంగసహాయముగా సుభద్ర॥
అ॥ప॥కుదురుగా ఘల్లుమని కరకంకణ మృదుమధురారావముల్లుప్పతిల్ల॥

చ ర ణ ము

జిలుగుబంగారుచీర ముంగొంగు-లలవరించి వింతగ గోచివెట్టి
కలువ తేనె దులకించుమోమునన్-లలిత వీరరసము తాండవింపగ॥ర॥

తే. గీ. సమరమున బాసవాద్భుర ♦ కొమరుడు జయ
మంది తోడ్కొ-ని చనియె బ ♦ ర్వేందువదన
నయ్యెడియెఱింగి బలదేవు ♦ డాగ్రహించి
సేయునదిలేక మందలిం ♦ చెను హరి నిటు.

సరస్వతి - ఆది.

ప॥ మాయలమారివి తమ్ముడా నీదు -
మాట నమ్మరాదు - నీనైజమ్ముపోదు ॥మా॥
అ॥ ప॥ తోయజాక్షి నాక్రీడి కిడి పెండ్లి - సేయదలచిగాదే
నన్నంతర్ద్వీపమం దుంచితివి ॥మా॥

చరణము

ఎటుజేసిన నటు సాగుగదా నీ - కీద్వారకలోన
విన్నన్న జెప్పినదె వేదం ॥ఎటు॥
కటకటా! తెలియనైతి నీతలపు - కపటివిరా నీ
నోరుమాటాడ - నొసలువెక్కిరించును ॥మా॥

చ. ఘనులు జితేంద్రియుల్ విగత ♦ కల్మషులంచు వచించి, శక్రనం
దనునకు నెయ్యపుంబను లొ ♦ నర్ప సహోదరి నొప్పగించి, నే
ర్పున నిటుపెండ్లిజేసితి వె ♦ ఱుంగమి కార్యము తప్పివచ్చె నే
మనుకొని యేమి లాభమిపు ♦ డన్నియు దీటిన వెన్క- తమ్ముడా!

వ. అన విని జగన్నాటకసూత్రధారుండగు కృష్ణుం డిట్లనియె.

క. నీకింత తెలియకున్నె ? త్రి
లోకైక మహాధనుర్ధ ♦ రుడు విజయుం డా
పాకారితనూభవునకు
గాక మఱొక్కనికి దగునె ♦ కన్నియ విడగన్?

వ. అని సమాధానపరచె నట నర్జునుండు సుభద్రాసహితుండై యింద్ర ప్రస్థపురమ్మ్నుజేరి యెల్లవారి మన్ననలం బడసె నంత వాసుదేవుం డును వసుదేవ బలదేవ సాత్యకి ప్రద్యుమ్నాది యాదవులం గలిసి యింద్రప్రస్థపురమ్ము సొచ్చి పాండవ సత్కృతుండై యమూల్య దివ్యాభరణమ్ము లెన్నియేని సుభద్రకిడియె. బలదేవాది యాద వులు సుభద్రార్జునులం గని సంతసించి ద్వారవతికిం జనిరి. కృష్ణుం డింద్రనందనుతోడి యిష్టవినోదంబుల నింద్రప్రస్థమ్ముననుండె నంత సుభద్రార్జునులకు గులదీపకుండై యభిమన్యుం డుదయించి ధౌమ్య కృత జాతకర్మచౌలోపనయనుండై పెరుగుచు దండ్రికడ ధనుర్వేద మభ్యసించుచుండె. ద్రుపదనందనయు బాండుకుమారుల వలన ప్రతివింధ్య శ్రుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతసేనులను వారి బంచోపపాండవులను బడసె నిట్లు పాండునందనులు పుత్రవంతులై సుఖముగ రాజ్యపాలనం బొనర్చు చుండిరి.

---



# మహాభారతము



## పాండవ రాజసూయము



కళ్యాణి - మిశ్రగతి

ప॥ వినుడు పాండవ రాజసూయము-విబుధగేయముకర్ణపేయము॥విను॥
అ॥ప॥ కనుడు దీనసమస్త శ్రేయము-లనుపమభవతరణోపాయము॥విను॥

చరణము

తన్నునమ్మిన ధర్మపరులకు - దైవ మెల్లప్పుడును దోడ్పడు
తెన్నుదప్పిన మానిసుల కెం - దే నపజయముగల్గు నిక్కము॥విను॥

సీ. దహనుండు మున్ను శ్వే ♦ తకియను రాజర్షి
గావించు సత్రయా ♦ గమున నాజ్య
మెక్కుడుగాఁద్రావె ♦ నక్కతమ్మున నగ్ని
మాంద్యమ్ము వొడమ దా ♦ మరసగర్భు
నాదేశమునను ది ♦ వ్యౌషధీయుక్త ఖాం
డవము దహింప గ ♦ డంగి యింద్రు
వారితుండై కృష్ణ ♦ పార్థుల జేరి గాం
డీవాక్షయశరతూ ♦ ణీరములు బ్ర
తే. గీ. థాత్మజునకు, కౌమోదకి ♦ యనుగదయును
మఱి సుదర్శన చక్రంబు ♦ మాధవునకు
వరుణుచేత నిప్పించి వే ♦ గిరము ఖాండ
వము దహించు కర్జమున కు ♦ పక్రమించె.
కం. తివిరి హుతాశను డా ఖాం
డవము దహించునెడ మయు డ ♦ నందగు నొకదా

నవ విశ్వకర్మ వెలువడి
యువతుండై నందనందనార్జునుల కనెన్.

హి॥ భైర వి - చతురశ్ర॥

ప॥ త్రిజగన్మాన్యులు దీనశరణ్యులు-కృష్ణార్జునులారా రక్షింపుడు ॥కృ॥
అ॥ ప॥ సుజనావనతత్పరులు దయాపరు
లజరామరణాకరుల్ - మహాత్ములు ॥త్రి॥

చరణము.

వినుడీ దానవ విశ్వకర్మ నో - వీరాగ్రణులారా, మయుండను ॥వీ॥
జనకసమానులు సకలాశ్రితజన-సంరక్షణచణులు సత్పుణ్యులు॥త్రి॥

ద్విపద.

అని వేడు మయుని కృ - ష్ణార్జునులెలమి
వనముననుండి కా - పాడిరి చెలిమి
బనితీఱ సెలవంది - చనె బావకుండు
వనజాక్షుననుమతి - మ్మున నా మయుండు.

సీ. పవడంపు గంబాల ♦ పై మేలిసీడల
కలిమీకిమ్మగు పైడి ♦ కప్పు నిలిపి
నెలమానికంపు గో ♦ డలకు నున్నెంపు నీ
లాలచువ్వల కిటి ♦ కీల జొన్పి
క్రొత్తమేల్రతనాల ♦ కత్తళా త్రేవ నం
చెలదరి నీటి తా ♦ వుల నమర్చి
మొగసాలఘటికి ♦ ము త్తిగజాలచే దళ
త్తళలీను నిల్వుటద్దాలదార్చి

తే. గీ. చిఱునగవుపలుకు-లొలికించు ♦ చిత్తరువుల
నందచందమ్ములమర నం ♦ దంద ప్రవాసి
సేత నేరుపు వెల్లడి ♦ సేయ మయుడు
కుంతికాన్పునకిడె గొల్వు ♦ కూటమొండు.

తే. గీ. గాలికొమరున కొక శత్రు ♦ ఘాతిని యను
గదయు, జేవదత్తమను శం ♦ ఖము సురేంద్ర

తనయున కొసంగిచనె; నంత ♦ ద్వారవతికి
బోయె బనితీఱుకతన నా ♦ రాయణుండు.

మంజరులు.

నారదముని యొకనాడు ధర్మ నం - దనుపాలి కరుగుదెంచి
చారుతరవిశ్వకర్మదత్త స - త్సభావిశేషము గాంచి
యెనగావు దీని కా దిగీశసభ - లేని యున ధర్మజుండు
వినిపింపు తత్సభావిశేషమ్ము - లన్న వినిచె నారదుండు.

కపరోజు - ఆది.

ప॥ వినుము సురేంద్ర సభావిశేషముల - వినిపించెద
రాజా రవితేజ - శ్రితకల్పభూజ ॥విను॥

అ॥ ప॥ అనవరత కుసుమఫలభరిత - భూరు
హానీకంబై - కామగమనమై ॥విను॥

మి॥ అనుపమాన విభవాభిరామమై - ఘనతరానంద సంధాయకమై
కనుపండువుగావించు నచ్చోట - గనరావట శీతాతపబాధలు ॥వి॥

చరణము.

ఆకలిగొనివచ్చిన నిరుపేదల - కన్నమిడువారు సూనృతవ్రతులు
ప్రాకటముగ వర్ణాశ్రమాచార-పద్ధతి విడక నడచు గృహమేధులు
మి॥ సాకల్యయజ్ఞకర్తలును ఘోర-సమరాంగణనిహతులు ధీమంతులు
పాకారిం గూడి వినోదింతురు - శోకజరారుఙ్మృత్యువుల్దొలగి ॥వి॥

వ. మఱియు నరకవాసుల తెఱంగెఱింగింతు వినుము.

సీ. నిగమోక్త విధులమా ♦ నినవారు, పరదూష
కులు, దముదా మెన్ను ♦ కొనెడువారు,
పరులయున్నతి కేవ ♦ పడువారు, వర్ణసం
కరులు, చేసినమేలు ♦ మఱచువారు,
గరదులు, సుజనాప ♦ కారులు, మెట్టవే
దాంతులు, కూతుండ్ర ♦ నమ్మువారు,
లంచగొండులు, సువ ♦ ర్ణస్తేయు, లన్యకాం
తారతుల్, సంగ్రామ ♦ భీరువులును

తే. గీ. గలిగి కన్నట్టు నతిభయం ♦ కరముగాఁగ
కాలునిం డోలగం బందు ♦ గలడు నేడు
పాండునరపతి నీతండ్రి ♦ భవ్యమూర్తి
తామరసమిత్రనిభ తేజ ! ♦ ధర్మరాజ !

తే. గీ. రాజసూయమ్ము నొనరింప ♦ నీజనకుడు
త్రిదివమున కేగు; నిను బ్రబో ♦ ధింప బంపె
బాండునరపతి నను; తద ♦ ధ్వర మొనర్చి
కన్నతండ్రికి గూర్పు నా ♦ కమున నునికి.

క. అనిపల్కి దేవమునిచనె
జనపతిరావించి కృష్ణు ♦ సవినయమున మా
వినియోగం బంతయు వా
కొన, దేవకికొడుకు కుంతి ♦ కొడుకున కనియెన్.

భూర్వకల్యాణి - ఆది.

ప॥ సేయుమా రాజసూయము గుణ-గేయ కౌంతేయ కీర్తనీయము॥ సే॥
అ॥ ప॥ నీయనుజులు భువనైకవీరులై-సాయపడగ నీకిదినిరపాయము॥ సే॥

చరణము.

ఈరేడుజగము లెత్తివచ్చిన జ - యింపజాలుమగలు నీ - తమ్ములు
వీరమాత మాయత్త కుంతి కురు- వీరులార దేవసములు మీరలు॥ సే॥

మ॥ సకలోర్వీశుల గెల్చి సేయవలె నీ ♦ జన్నంబు కౌంతేయ ! ద్వా
రకలోనుండు సముద్రమధ్యమున నే ♦ రాజన్యు నోడింపనే
రక యమ్మాగధు నెట్టులే నతని దో ♦ ర్బలం గూలనేర్పుంచి, త
ప్పక సేయింతును రాజసూయమును బావా ! లోకమగ్గింపగన్.

వ. అనిపలుక నందనందనుపలుకులకనుగుణమ్ముగ భీమసేనుండిట్లనియె.

ఉ. శౌరికటాక్షము న్నరుని ♦ సాయము కల్మి బృహద్రథాత్మజున్
భూరిబలాఢ్యు యజ్ఞ పశు ♦ వుంబలె ఈ పొలియింతుగాన న
న్నా ! రచియింపు మాసవన, ♦ మర్వాద వేద్యదవు, కన్నతండ్రికిం
గూరిమిమీరు సద్గతుల ♦ గూర్చు తనూజు డతో తనూజుడౌ.

వ. అనవిని రాజసూయము నిర్వహణంబున కుత్సహించి కార్యసిద్ధి యయ్యెడు నరుగుడని పంచిన పాండవాగ్రజు వీడ్కొని,

సీ. ప్రియమారగా గృష్ణ ♦ భీమార్జునులు కృత
స్నానులై మగధ దే ♦ శంబు సొచ్చి
చైత్యకాచలశృంగ ♦ సామీప్యమున బిట్టు
ధ్వనియించు భేరులం ♦ బగులమోది
యద్వారమున జొచ్చి ♦ యా గిరివ్రజమందు
బలిమిమై గంధపు ♦ ష్పములు దాల్చి
కేసరిత్రయము గో ♦ వాసమ్ము సొచ్చుమా
దిరి జరాసంధు మం ♦ దిరము సొచ్చి

తే. గీ. నిలువ నభ్యాగతుల వోలె ♦ నృపవరేణ్యు
డెదురుసని మధుపర్కము ♦ లీయ గొనక
సాభిలాషేక్షణమ్ముల ♦ నరయు ముగుర
గాంచి యనుమానమంది మా ♦ గధుడు పల్కె.

తోడి - ఆది.

ప॥ ఎవరుమీరు నడురేయి జనుదెంచి-రిటు లభ్యాగత వేషధారులై॥ఎ॥
అ॥వివరింపుడునాయుడుమధుపర్కము - లవమతిగొనక నిరాకరించుకత॥

చరణము.

పూలుచందనము బలిమిమీరగై - కోలుధర్మమగునెస్నాతకులకు
ప్రోలుచొరనగునెయద్వారతున్మనజాలమేల? కలరూపువహించియింపు॥ఎ

మ. అవనీదేవ పదాంబుజాత నిరత ♦ ధ్యానైకచిత్తుండ, బై
రవపూజాపరతంత్రుడన్, నిఖిల ధ ♦ ర్మాధర్మవిజ్ఞాత, నే
నవమానమ్ము ఘటింపనేరికి, ననూ ♦ యాగ్రస్తుడంగాను న
న్నవలోకింపను డన్యథా, తెలుపర ♦ య్యా! మీయుదంతమ్ములన్.

వ. అనవిని కృష్ణుం డిట్లనియె.

దర్బారు - రూపకము

ప॥ తెలియుముక మమ్మాడేగిదమ్మా - తెలిపెదము నాకర్ణింపుము॥తె॥
అ॥ పరిఘలిత క్షీరవ్రతియ ♦ జాతిస్నాతకుల మేము ॥తె॥

1. కుసుమ చందనములందున ♦ వసియించు సతం బిందిర
వసుమతీశ ! యటుగావున - బలిమిమీర గైకొంటిమి ॥తె॥
ద్వారమ్మున మిత్రులు న - ద్వారమ్మున శాత్రవులా
గారముజొచ్చుటధర్మము - గానవలసె నీమర్మము ॥తె॥

ఉ. ఏయపచారమున్ సలుప ♦ నేరికటంచు వచింతువేల, నో
ర్మూయుము నవ్వగాగలరు ♦ లోకులు భైరవపూజయంచు భూ
నాయకులన్ వధించుట ఘ ♦ నంబనుకొంటివా ? కండగించి నీ
సేయని పాపముల్గలవె ♦ ఛీ ! తులువా ! నిను గాచుకొమ్మికన్.

సీ. వరగిరివ్రజ వనాం ♦ తర్గవాసియగు జరా
సంధనామకగంధ ♦ సింధురంబు
కఠిన కారాగార ♦ కాసారగత సమ
స్తావనీనాధ రా ♦ జీవతతిని
కరవాల కరముచే ♦ గావించు ఛేదమ్ము
నాప హుంకార గ ♦ ర్జారవముల
కృష్ణభీమార్జున ♦ కేసరిత్రితయమ్ము
యమ తనూజాతాంత ♦ కాజ్ఞనంది

తే. గీ. రాజతోద్దండ విక్రమ ♦ క్రమ మొలర్ప
నఖిలశస్త్రాస్త్ర శాతన ♦ ఖడ్గవితతి
ప్రథిత మస్తిష్కయుక్త కుం ♦ భస్థలమ్ము
జీల్చి శుభమౌక్తికశ్రేణి ♦ జిమ్మవచ్చు.

ఉ. వాయుసుతుం డితండు నగ ♦ వైరిసుతుండిత డేను కృష్ణుడన్
వేయుని కేల ? భూవిభుల ♦ వేగ విముక్తుల జేయు మిప్డు లే
దా ? యని సేయు మీముగురి యందున నెవ్వరితోడ నేని నీ
యాయువు నేటితో సరిసు ♦ హాయులతో జముదెమ్ము పోరికిన్.

అనినవిని జరాసంధుండు సటాసముత్స్పాటనకుపిత కంఠీరవారియుం
బోలెంగడు నలిగి,

కన్నడ - ఖండగతి

ప॥ పుట్టినది నేరాచ - పుట్టువేగాద ॥పు॥

అ॥ ప॥ పట్టిపల్లార్తు భయ - పడుదునే రణమునకు ॥పు॥

1. నాకుసరిజోడనిల - నందనుండేగాన
 నా కుమతినే బంపు - మాలమునకు బిరాన ॥పు॥

2. వలదు నాకొకనితో -డల నీలకంఠుడే
 కలదు నాకుందోడు - కంసదాసకుమార ॥పు॥

తే. గీ. నాకుమున్నోడి మున్నీట ♦ నగరి గట్టి
 బన్నముండప్పి కాపుర ♦ మున్నయట్టి
 పనికిమాలిన గొల్లబో ♦ యనికి నీకు
 దోడుకలెనే? భీమపార్థుల ♦ తోడు నేడు.

తే. గీ. తలకి యిందులకా? నాడు ♦ త్రాగుబోతు
 నకు దెలియకుండ దొంగ స ♦ న్యాసి కట్లు
 చెలియలినొసంగి పెండ్లిజే ♦ సి ప్రియ మార
 గలుపుకొంటివి చుట్టరి ♦ కమ్ము కృష్ణ!

వ. అని పలుకుచు జరాసంధుండు భీమునితో మల్ల యుద్ధంబుసేయ నిశ్చయించి నిజనందను సహదేవు రాజ్యాభిషిక్తుం గావించి యుద్ధావనిన్ బ్రబలిఘటించి కార్తికశుద్ధ ప్రతిపత్తిథియందు భీమసేను నెదుర్కొనినిలువ నా వృకోదర జరాసంధు లొండొరుల జుల్కనం దాకునంత నన్యోన్యదోర్దండ ప్రహార సంజనిత ధ్వానంబు బ్రహ్మాండ భాండం బెల్ల నిండ, పదపరాగంబు భూమ్యాకాశంబులు గప్పికొన నాహవహర్షంబున బరస్పరాకర్షణ సంకర్షణాపకర్షణముల బెనగి వ్యాయామ కర్కశ దేహులై పరిఘాయిత కఠిన తరభుజాదండ దారుణాఘాతమ్ము లతిభయానకమ్ములైతోప మహాయుద్ధంబు సేయుచో జతుర్దశినాటి రేయి జరాసంధు డతి క్షీణబలుండగుట యుపలక్షించి యధోక్షజప్రేరణంబున నప్పావని మాగధుంబట్టియెత్తి నాసికాకర్ణరంధ్రమ్ముల రక్తధార లొలుక వీచివీచి యెమ్ములన్విఱిచి వధించి తత్కళేబరమును తదీయ

గృహద్వారతోరణ సమీపంబునవైచె నంత వాసుదేవుండును సూర్యోదయంబున మాగధుల కభయంబిచ్చి పృథివీపతుల కారాగారవిముక్తులంజేసి భీమపార్థ సహితంబుగ రథారోహియైవైన తేయసారథ్యమ్మున వాయువేగమ్మున, నింద్రప్రస్థపురమ్ముంజేరె నంత ధర్మజుండును నలుగురుతమ్ముల నాల్గుదిక్కులకుం బంపి యపరిమితరత్నాభరణ ద్రవ్యమ్ములంది భాండాగారమ్ము సమృద్ధమ్ముగా గృష్ణునియోగమ్మున నానాదేశాధిపుల నెల్ల బంధుగుల నాహ్వానించి ధౌమ్యుండుహోతగా, యాజ్ఞవల్క్యుండధ్వర్యుండుగా ద్వైపాయనుండు బ్రహ్మగా, సుసాముం డుద్గాతగా, నారదాది బ్రహ్మర్షులు సదస్యులుగా, భీష్మాదిరాజర్షులు సహాయలుగా జగన్నాధ రక్షితమ్ముగ జన్నంబొనర్చి భీష్మనియోగంబున ప్రథమ తాంబూలమ్ము వాసుదేవున కిడునంత సహింపక శిశుపాలుం డుపాలంభనపరుండయి ధర్మజున కిట్లనియె.

రాగు - ఆది.

ప॥ పాడుగొల్లనికి తాంబూలంబిడి-పాడుజేసుకొన్నాడవు జన్నము॥ పా॥

అ॥ నేడుముదిమిచేమతిమాలిన యీ-నిర్భాగ్యుని చెప్పెడుమాటలువిని॥

1. కులహీనుడు గుణహీనుడు చోరుడు గోహత్యా స్త్రీహత్యాపాతకి
తలయు గడ్డమున్న రసినవృద్ధా? తగ డితండుసభనుండుట కేనియు॥ పా॥

సీ. అరసి వయోధికుం ♦ డని గారవింపసు
హింతువా, వసుదేవు ♦ డిచట లేడె?
ఆచార్యు డంచు స ♦ మర్చింప దలకొంటి
వేని, భారద్వాజు ♦ డిచట లేడె?
చుట్టపు మేరువం ♦ చు దలంచి పూజించు
నెడ, ద్రుపదోర్వీశు ♦ డిచట లేడె?
యఃఖిల లోకైక వీ ♦ రాగ్రణియని సత్క-
రింతువా, రాధేయు ♦ డిచట లేడె?

తే. గీ. మానసీయులలోన నె ♦ వ్వాని బోలు
సీత దనుకొని తాంబూల ♦ మిచ్చినావు ?
కడకు నేడు నశించె నీ ♦ కారణమున
రాజసూయాధ్వరంపు గా ♦ రవముగూడ

చ. పొలతుల చీరలెత్తుకొని ♦ పోయి మహీజములెక్కు- దొంగ సా
ములన దధికుం డటంచు దల ♦ పోసితొ ? వెన్నెలరేల గోపికా
జలరుహనేత్రలం గలసి ♦ సైకతభూముల నాడు జాణ రా
యల గడు మిస్సయంచనియొ ? ♦ యర్ఘ్యమొసంగితివోయిధర్మజా !

ఉ. వాని కతండు బావయగు, ♦ వానికి నేను మఱంది నౌదు, నీ
కైవడి బాంధవమ్ము చెల ♦ గన్, నను బెండిలియాడనున్న రా
జీవదళాక్షి రుక్మిణియు ♦ చెల్లెలగుంగద ! పెండ్లియాడె నీ
కావలు, డిట్టి శిష్టజన ♦ గర్హితు నర్చితుజేయు టొప్పునే ?

వ. అనుచు గృష్ణునధిక్షేపించు శిశుపాలున కలిగి సహదేవుండు

తే. గీ. యజ్ఞపూరుషు నఖిల దే ♦ వాగ్రగణ్యు
నాదినారాయణు ననంతు ♦ నప్రమేయు
బతితపావను నిందించు ♦ వాని శిరము
వామ పాదంబునం దన్ను ♦ వాడ నిపుడె.

వ. అని పలుకుచు గోపావేశంబున జైద్యుపై నుఱుకు సహదేవు ధర్మజుండు వారించు నంతలో శిశుపాలు సేనాపతి సునీధుండను వాడు రాజానుమతమ్మున సైన్య సమేతమ్ముగ యుద్ధసన్నద్ధుడై నిలువంగని భయసంభ్రమాక్రాంత హృదయుండై యమనంద నుండు గంగానందనున కిట్లనియె.

గ న్యాపి – రూపకము.

ప॥ ఊరకుందువేల తాత – వారింపు మీయని సేత ॥ఊ॥
అ॥ ప॥ కూరిమి నీరాజసభ్యుల – కోపాగ్నిం జల్లార్చుము ॥ఊ॥

చరణము

జన్మము సెడకుండ జన - క్షయము సంభవింపకుండ
మన్నీలకు జిత్తశాంతి - మానితగతి గూర్చుమయ్య ॥మురా॥

చ. నగధరు గారవించు కత ♦ నన్ శిశుపాలుడు తెచ్చిపెట్టె నీ
జగడము; కార్యవాదులను ♦ శాంతివహించుట పాడియౌరా, దలం
పగ మన మాతిథేయులను ♦ వారతిథుల్; కలహించు కొన్నచో
నగుదురు లోకు, లెట్లు నవ ♦ నంబు సమాప్తము జెందునో కదా!

వ. అనవిని భీష్ముండు ధర్మరాజుంగని.

ఉ. మాటలచేత జక్కబడు ♦ మానిసిగా డితడిట్లు ప్రేలెడు
న్నోటికి వచ్చినట్టులు; నగ ♦ నుంగొను మొండొక కారణమ్మునన్
జేటు దలంప డీతనికి ♦ శ్రీహరి; కాలము చేరువయ్యె ము
మ్మాటికి నేటితో, మఖస ♦ మాప్తికి భీతిలకోయి ధర్మజా!

వ. అనిన శిశుపాలుడాగ్రహించి యొకసక్కెముగ.

బిలహరి - ఆది

ప॥ తాత చెప్పుటకు మనుమలాలించి - తలలూపగ
సరిపోయె భళాభళి ॥తాత॥

అ॥ పాతవడిన వల్మీకమాత్ర పర్వతమెత్తిన గొల్లనినగధరుడని ॥తాత॥

చరణము

గారవింపుమని నందతనూభవు - గాంగేయుడు సెప్పిన జెప్పగాక
కోరినీవెట్లు విశ్వసించితివి-జారులు చోరులు బ్రహ్మవేత్తలని ॥తా॥

ఉ. తానొక బ్రహ్మచారినని ♦ తజ్జ్ఞులసన్నిధి బైసిమాలి యొం
తేనుతియించుకోదలచు, ♦ నెవ్వరెఱుంగరు షండుడంచు? వి
జ్ఞానివలె న్నటించి రభ ♦ సమ్ముగ వాకొనజూచు నల్వురక్,
కానుకలిత్తురే పసుల ♦ కాపరి కిందఱ బెద్ద జేయుచున్?

క. గాంగేయకృష్ణులన్ బహు
భంగులనిందించు చైద్యు ♦ పైవడి గద కే
లంగొని యుఱుకు సమీర సు
తుంగని భాగీరథీ సు ♦ తుం డిట్లనియెన్.

ఉ. శాంతివహింపు మొక్కనిము ♦ సమ్ము సమీర కుమార శౌరియే
యంతము సన్నిధానమున ♦ కంపగలా డితనిన్, దదన్యుచే
నంతమునంద, డీతులువ ♦ యంతము నందినగాని జన్మ మా
సాంతముగాదు, సర్వము స ♦ మాప్తముకాగల దీక్షణమ్మునన్.

సీ. తొలుత నీ తులువ చ ♦ తుర్భుజుండును త్రిలో
చనుడునై పుట్టి, రా ♦ సభమువోలె
నార్చిన, తలిదండ్రు ♦ లడలుచున్నెడల వీ
డెవ్వనియుత్సంగ ♦ మెక్కనంత
మిక్కిలి చేతులున్ ♦ మిక్కిలి కన్ను వో
వు నతండె యంతకుం ♦ డనియె వీని
కంబరవాణి; నా ♦ రాయణుం డెత్తికొ
నుతు చేతులుం గన్ను ♦ నడగె, నులికి

తే. గీ. సాత్వతియు వీని యపరాధ ♦ శతమునై పు
మనుచు గృష్ణుని వేడ ని ♦ య్యకొనె శౌరి
నిండె నయ్యపరాధముల్ ♦ నేటితోడ
వికలమగు సుదర్శనమున ♦ వీనిశిరము.

వ. అనిపలుకునంత జక్రధరుం డఖిలరాజచక్రంబు విన నిట్లనియె.

శ్రీరాగము - రూపకము

ప॥ అపరాధశతమ్మునైపుమా యని మాయత్తగోరె ॥నప॥
అ ప॥ ఇపుడు నూటికెక్కుడయ్యె - నీమూర్ఖుని దుండగమ్మ ॥లప॥

చరణము

తెన్ను దప్పివసుదేవుని-జన్నపుత్తడి హరించె-జెన్నటియై ద్వారక
గాల్చెనెన్నో యపకృతులొనర్చె ॥నపు॥

చ. ననుగని యోర్వజాలనిత ♦ నమ్మున దిట్టుటకేమిగాని య
త్యనఘుని భీష్మునంతటి మ ♦ హాముహులుసైతము ధిక్క-రించె నీ
చునటి, క్షమింపరా దితని ♦ శీర్షము ద్రుంతు గనుండిదే సుద
ర్శనమున నీక్షణమ్మున ది ♦ రమ్ముగ భూమి భరమ్ము దీరగన్.

వ. అని పల్కుచు దనుజాంతకచక్రంబగు సుదర్శన చక్రమ్మును స్మరించి చేనంది ప్రయోగింప నయ్యది శిశుపాలు శిరంబు నుత్తరించి నిజధామముం జేరె. చైద్యుని దేహమ్మునుండి యొక్క తేజం బంబరంబెల్ల వెలుంగుచు వచ్చి వాసుదేవునందు సొచ్చె నిట్లు రాజసూయంబు జగన్నాథ రక్షితంబై పరిసమాప్తంబగు నంత నానా దేశాగతులయిన రాజన్యులును నెల్ల బంధుగులును ధర్మజుం గొనియాడి వీడ్కొ-నిరంత నారాయణుండును పాండుసుతులు తన్ను పాదచారులై యనుపరథారోహియైచనె. కౌరవాగ్రజుడు శకునియుం దానును మయసభావిభవంబుం జూచువేడ్క గొన్ని దినంబు లందుండెను.





# మహాభారతము



## ద్రౌపదీ మానసంరక్షణము



కాంభోజి - ఆది

ప॥ ఆకర్ణింపుడు పంచమవేదం-బఖిలధర్మయుతము మహాభారత॥మా॥

అ॥ప॥ శ్రీకృష్ణుడు పాంచాలికి సభలో-జీరలొసంగిన కథవిన్పించెద॥నా॥

చరణము

శకునిమేనల్లుడొకడు-నాడు మయ - సభావిశేషము లరయ

ప్రకటమ్ముగ నందుజొచ్చి విస్మయ-పడియె నెమ్మనంబెఱియ ॥నా॥

సీ. బారగాదెఱచిన ♦ ద్వారమ్ము మూసిన

దానిగా దలపోసి ♦ లోనజొరడు

సంవృతద్వారదే ♦ శము వివృతమ్ముగా

దలచిపోబోయి ఘూ ♦ తగను నుదుట

చదునుగల్గిన ప్రదే ♦ శంబున్నతంబని

యెక్కట నూహించి ♦ యెక్కగడగు

నీలాలుతాపిన ♦ నేల జలాశయం

బని పరిధానమె ♦ త్తి నడయాడు

తే. గీ. తగజలాశయమున్ మహీ ♦ తలమటంచు

వడివడింజని పుట్టంబు ♦ దడియజొచ్చు

తారుమారుగదోచె నం ♦ తయునుదాన

లజ్జితుండయ్యె నయ్యంధ ♦ రాజుకొడుకు.

క. అదిగని ద్రోవదినవ్వగ
నది శూలమువోలె నాటి ♦ యనుగతరోషా
భ్యుదయుండై కరిపురి సని
హృదయము రగులంగ గుందు ♦ నీవిధి నంతన్.

కేదారగౌళ - ఖండగతి

ప॥ అభిమానధనుడనై - యవమానపడితి రా ॥య॥
అ॥ ప॥ ఇభపురాధిపుడ తుద - కిటు లాయదానిచే ॥నభి॥

చరణము

చేడెకారణముగా - జెఱతు నా పాండవుల
కూడుగుడ్డకుదూర - గుల జేయకుందునా ॥యభి॥

తే. గీ. త్రొక్కఁబడిన పెంధూళి తో ♦ డ్తోన లేచి
నెత్తిపై నెక్కఁ ద్రొక్కునే? ♦ నృపవరేణ్య
మౌళిమకుట మణీఘృణీ ♦ మహితపద కు
శేశయుండను నేనేమి ♦ సేయరాదు?

సీ. ననుగాంచి పరిహాసిం ♦ చిన బాధకి ప్రచ్ఛ
కీడిపించి పరాభ ♦ వించు దనుక
నూరూరదిరుగాడు ♦ బైరాగులం జేసి
పంచపాండవులగా ♦ ఱెంచుదనుక
పూజనీయచతుస్స ♦ ముద్రవేలావల
యితరాజ్యలక్ష్మి గ్ర ♦ హించుదనుక
భువనవిఖ్యాత పాం ♦ డవ యశోడిండిమం
బింతంతలుగ వ్రక్క ♦ లించుదనుక

తే. గీ. డంబముల దొడ్డకొండ, పాం ♦ డవులయండ
యైన గోపాలు దుర్గర్వ ♦ మణగుదనుక
ప్రాయికముగ జల్లాఱదీ ♦ పరిభవాగ్ని
బ్రతికి గాంధారి కొమ్ము సా ♦ ర్థకము గలదె.

వ. అని రోషించుచు నితికర్తవ్యతాహీనుండై.

చ. అడరుచు వేసవిందఱుగు ♦ నల్పజలాశయముం బలెం గడుం
గడుపరితాపభారమున ♦ గాయముకంది వివర్ణమంది, కీ
డ్వడుచు సుఖోపభోగముల ♦ బాసికృశించున రేంద్రుడాసి సం
గడితనమేర్పడన్ శకుని ♦ క్రన్నన సర్వ మెఱింగి యిట్లనెన్.

నాటకురంజి - ఆది

ప॥ తెలుపవైతి విదియా విచారము - కలత
విడువుమయ్యా భాగినేయ ॥ తెలు॥

అ॥ ప॥ చలముమీఱ పాండవేయులను నీ
చరణా క్రాంతులుగా నొనరించెద ॥ తె॥

చ ర ణ ము

నీవెఱుగువుగదా నాకున్న - నేరుపు మాయాదురోదరమ్మున
భూవలయమ్మఖిలమ్ము నీకిడుదు - మోసగించియమపుత్రునోడించి॥

తే. గీ. తండ్రి నెటులేని యొప్పించి ♦ ధర్మతనయు
నిటకురావించి జూదమా ♦ డింపు మతని
గెలిచి సర్వ సర్వం సహా ♦ వలయమునకు
సార్వభౌమునిగా నిన్ను ♦ సల్పువాడ.

క. అనిపల్క భాగినేయుని
గొని యంధనృపాలుకడకు ♦ గొబ్బున జని తె
ల్పిన ధృతరాష్ట్రుం డయ్యది
వినిపింపగ నీతివిదుడు ♦ విదురుండనియెన్.

చ. సరి! సరి! యన్నదమ్ములకు ♦ నైతము వైరముసంఘటించి కా
పురములు గంగలోగలుపు, ♦ బోలని దుర్వ్యసనమ్ముగాదె! పు
ష్కరుడు నలుండు జూదపునె ♦ పమ్మున నెట్టి విరోధమందిరో
మఱచితె? పెద్దవాడ విది ♦ మాన్పుము పుణ్యమ? పూరుషార్థమా?

తే. గీ. కలిత కురువంశనామక ♦ కల్పకుజము
వెడగు జూదమ్మె వేరింటి ♦ వేరుపురువు

జేరి చివరకు మొదలంట ♦ జెఱచివేయు
నన్న దూరమాలోచింపు ♦ మాంబికేయ!

వ. అనిపలుక నర్థానర్థవిదుండగు విదురుని ధర్మవచనమ్ము లాలించియు బుత్రమోహమ్ము వీడనేరక ధర్మనందనుం దోడ్తెమ్మని విదురునింద్ర ప్రస్థపురమ్మునకుం బనిచిన నతండు నవిలంఘనీయమ్మగు ధృతరాష్ట్ర నియోగమ్మనుసరించి యింద్రప్రస్థమ్ముసొచ్చి యమతనయునిచే నభ్యర్చితుండై సేమ బడిగి నిజాగమన కారణం బెఱింగించిన ధర్మజుండును ద్యూతక్రీడ యనార్యసమ్మతమ్ముగాదని వగచుచు గడకు విధినియుక్తుండై యను జమ్ములును ద్రోవదియు ధౌమ్యుండాదిగాగల విద్వజ్జనులును దోడరా విదురునితో నిభపురమ్మున కరిగి కురుగురు వృద్ధజనుల కతివినయమ్మున మ్రొక్కి యాశీస్సులంది యా దినమ్ము గడపి మరునాటి యుదయమ్మున కనక ఖచిత స్తంభ సహస్రంబుల, విచిత్రద్వారశతంబుల వేవురు శిల్పాచార్యులచే నతిరమ్యంబుగ నిర్మింపజేసి ధృతరాష్ట్రుండు దుర్యోధనున కొసంగిన సభాభవనము జూచుతలంపున నందుసొచ్చి మెచ్చుచు నెల్లరు సుఖాసీనులై యున్నంత నొకంతకు కౌరవాగ్రజుండు పాండవాగ్రజున కిట్లనియె.

శంఖరాభరణము - రూపకము

ప॥ అనఘా నేడిందు జూడ - మాడి వినోదింతము మన ॥మనఘా॥

అ॥ ప॥ జననాయకులకు ద్యూతము - సహజధర్మమ్మగుగావున ॥నన॥

చరణము

నెత్తమాడుటందు నీవు - నేర్పరివని విందు చాల
యిత్తరి నీ చతురత గను - దిదికాలక్షేపముగా ॥ననఘా॥

క. సాటియగు నక్షవిద్యా
పాటవమున నీకు శకుని ♦ ప్రతినిధియై నా
యాట యితడాడు నీ౦ం
డోటువడినదెల్ల నేన ♦ యొసగుదు నీకున్.

వ. అనవిని ధర్మజుం డిట్లనియె.

ఉ. క్షత్రియధర్మమేయగును ♦ గాక, వినోదమెయౌనుగాక, సు
క్షత్రియులీదురోదరము ♦ జూడకుబోవరు, పాపవృత్తిమె
శత్రువులంబొనర్చు నను ♦ జన్మములన్నైతము, దుస్తరంబె? యీ
మాత్రపునింద్యకర్మమును♦మానుటకున్ మనకో సుయోధనా!
క. ఒకనికి బ్రతినిధినై వే
ఱొకడాడుట, యోడినది మ ♦ ఱొకఁడౌనగ జీ
టికిమాటి కొప్పుకొంటయు
బ్రకటసుహృద్ద్యూతధర్మ ♦ పథ దూరమగున్.
వ. అనవిని కర్ణుండు ధర్మతనయుంగని
ఉ. సందియమేల యోడినది ♦ సర్వము సౌబలుడే యొసంగు, నీ
గుందినగార వేంద్రు డౌన ♦ గున్, మఱిచాలనిచో మదీయ రా
జ్యేందిర నీకొసంగుదు మ ♦ హీవలయమ్మఖిలమ్ము గెల్చియీ
యం దలకొంటి నే నితని ♦ కై మఱియున్ ఋణమున్నధర్మజా!
వ. అనవిని విదురుం డెకసక్కెముగ రాధేయున కిట్లనియె.
క. తనకుందీటగు దుర్యో
ధనుకన్నను సుబలరాజ ♦ తనయునికన్నన్
నినుమేటిజేసి ధర్మజు
డనుమానమువీడి జూద ♦ మాడునె? కుమతీ!
చ. అవనిసమస్తమున్ గెలుతు ♦ నంటివి, సిగ్గెటులేదు; ధర్మసం
భవుననుజన్ములున్న సభ ♦ వాయెటువచ్చిన నట్లుప్రేలగా
నవునో? ద్రౌపదీపరిణ ♦ యావసరమ్మునసైన నీ పరా
భవము దలంచుకొమ్మెగరు ♦ వమ్ములు సెల్లవు సూతనందనా!
వ. అనవిని దుర్యోధనుం డంగరాజు నపనయించుచు.
తే. గీ. ఇతనిమాట పాటింపకు ♦ మీావు, తిన్న
యింటివాసాల లెక్కించు ♦ నీతడెపుడు
నీవెఱుంగవె? మొదటి నుం ♦ డియును బాండు
తనయులన బడిచచ్చు నీ ♦ దాసికొడుకు.
వ. అనవిని యభిమానపడుచు ధృతరాష్ట్రుండగ్రనందనునిట్లుమందలించె

బిళహరి - ఆది

ప॥ ఏమంటివి చెడిపోవు నీకతన
మామర్యాదలుగూడ సుయోధన ॥యే॥

అ॥ ప॥ సామాన్యం డనుకొంటివ విదురుని
సదమల ధర్మాధర్మ విజ్ఞాత ॥నేమం॥

చ ర ణ ము

పిన్న పెద్దతారతమ్య మెఱుగవు-పున్నె మేదో పాపమేదో తెలియవు
యెన్నడీ మహాత్ము దూలనాడకు మితడునీకు-నాకన్న బూజ్యుడగు॥

క. అనిన సుయోధనుడు న్వాని
వినని యటు నటించి పాండ ♦ వేయున్ని జూద
మ్మునకుం ద్వరపెట్టగ న
య్యనఘుండును సుబలసుతున ♦ కభిముఖుడయ్యెన్.

వ. ఇట్లభిముఖుండై మణిహారంబులును సువర్ణరత్న భాండాగారమ్ము లును యుసంఖ్యాత హయయూధ గంధసింధుర సందోహమ్ములును శతసహస్ర పరిచారికా పరిచారకులను క్రమముగ నొడ్డి యోడుచు బద్ధమత్సరుండై దేవ బ్రాహ్మణ క్షేత్రమ్ములు దక్క తక్కిన ధరావలయంబంతయు నొడ్డి యోటువడి మఱియు మత్సరుండై సహదేవునొడ్డి యోడి నకులు నొడ్డి యోటువడి యావేశంబున నొబలున కిట్లనియె.

సీ. అలరు పున్నెంపు టిం ♦ తుల మేలుబంతియా
కుంతి కాన్పుల కడ ♦ గొట్టు కొడుకు
కలశసంభవు నొద్ద ♦ గఱకుటమ్ముల విద్దె
గడముట్ట నేర్చిన ♦ కడిమిదిట్ట
యేను బాణమ్ముల ♦ మీనయంత్రము దెగ
నటికి ద్రోవదిని గొ ♦ న్న విలుగాడు
కలన జేజేరేని ♦ గెలిచి ఖాండవ వనం
బగ్నిచే గాల్పించి ♦ నట్టి జోదు

తే. గీ. చెలగి నను రాజసూయిజే ♦ సిన ఘనుండు
బవరమున వెన్నుసూపని ♦ వాడిమగడు
జలజనాభు నెయ్యంపు ము ♦ ద్దుల మఱంది
యర్జునుం డిట బన్నిదం ♦ బగునుగాత!

వ. అట్లర్జును నొడ్డి యోటువడి

చ. కనక నగేంద్రమేని కర ♦ ఘాతమునం బొడిసేయు దోర్బలుం
డనుపమబాహువిక్రమ స ♦ హాయుడు ఘోరహిడింబదైత్యమ
ర్దనుడు బకాంతకుం డును ప ♦ రంతపు డంతకసన్నిభుండు భం
డనముల చండశాసనుడు ♦ నా పెదతమ్ముడు పందెమయ్యెడున్.

వ. భీముంగూడ నోడి వెండియు.

క. తెలిసిన మూర్ఖుండని లో
కులుసవ్వగ రాజ్యమెల్ల ♦ గోల్పడి యనుజ
న్ములసైత మొడ్డిన కా
వలు డీ యమనందనుండు ♦ పన్నిద మగుతన్.

వ. అట్లు తన్ను దాన పందెంబిడుకొని యోటువడి శకుని ప్రేరణంబున
పాంచాలింగూడ బణంబుగ నొడ్డదలంచి.

ఉ. మానవతీ లలామ, గుణ ♦ మాన్య, యయోనిజ, కుంతికిన్ బహిః
ప్రాణము, పాండునందనుల ♦ పట్టపురాణి, ముకుందు చెల్లెలీ
పైనిలుచుం బణమ్ముగ స ♦ భాజనగర్హితు క్రూరకర్ము నీ
మాన విహీను నంతకును ♦ మారు మగండని చెప్పకొంటచేన్.

తే. గీ. ద్రోవదియు నోడబడియె; సం ♦ తోసమంది
తనకు పాంచాలి యింకిట ♦ దాసియయ్యె
ననుచు గౌరవపతి కృష్ణ ♦ నటకుదోడి
తెమ్మనక విదురుండు గో ♦ పమ్ముస ననె.

కళ్యాణి - త్రిపుట

అ॥ ప॥ యీ సమస్తావనీవలయం - బేలు ధర్మజు పట్టంపురాణి ॥దా॥
1. సంతతము గనుసన్నచే పరి - చారి కాగణము సేవింపగ
నంతిపురమున రాజభోగము-లందు నా గోవిందుచెలియలు ॥దాసి॥

2. రవినిభుడు ధర్మజుఁ డొనర్చిన - రాజసూయ మహాధ్వరమ్మున
నవభృథస్నానమున శుచియై - నట్టి లోకైకసాధ్వీమణి ॥దాసి॥

ఉ. సంచిత ధర్మసంచయు న ♦ జాతరిపుం బిలిపించి జూదమా
డించి సమస్తరాజ్యము గ్ర ♦ హించియు సాలక యాజ్ఞసేని రా
వించి సభాస్థలిం బరిభ ♦ వింపదలంచితి వామె కట్లు గ
ల్పించు పరాభవాగ్ని నిలు ♦ వెల్ల దహింపకపోదుమిమ్మొగిన్.

తే. గీ. అల్లదే చూడుమా భీము ♦ ననిలతనయు
నగ్రజాజ్ఞాంకుశమ్మున ♦ నాగెగాని
క్రూరకర్మావలంబిత ♦ కురుకుమార
శతక నాళీకమత్తకుం ♦ జరు డతండు.

వ. అనిపలుక- విదురుని వచనంబులు సెవినిడక సూతసుతుండగు ప్రాతి
గామియనువానింగని "నీవుపోయి ద్రౌపదిం దోడ్కొని ర"మ్మని
పంచిన నతండును సని ధర్మజుండు జూదమ్మున నోడుటయు,
దుర్యోధను నాజ్ఞయును దెలుప బాంచాలి యిట్లనియె.

ముఖారి - ఆది

ప॥ లేరో, జూదరులు-సతినొడ్డినవారు గలరె?-ధరలోనేయుగముల॥ లే॥
అ॥ప॥ మేరమీరి సమవర్తికు-మారుడు వైరులంగలసిజూదమొడ్డా॥ లే

చరణము

గెలుచు గాక తగునే? కొలువున కోక
వెలది నీడ్చి తెమ్మనుట కాతులువ ॥గె॥
వలదుదుగుము పాప కార్యమిదియని
వారించు పెద్ద లీ సభ లేరా ॥లేరో॥

తే. గీ. మున్ను తనొడ్డి యోడెనో ♦ నన్ను లేక
నన్ను మునొడ్డి యోడెనో ♦ తన్ను సభకు
నరిగి యొకపరి జూడఁ ♦ నడిగిరమ్ము
అవసరంబని తోఁచిన ♦ నపుడు వత్తు.

చ. అనవిని ప్రాతిగామి ద్రుప ♦ దాత్మజ పల్కినదెల్ల ధర్మ పు
త్రునకెఱిగించి యయ్యెడ ని ♦ రుత్తరుడై నిలువన్ సుయోధనుం
డనె సభలోన నీవడుగు ♦ మయ్యది సభ్యులు దీర్తురంచు బ్రా
హ్మన నతడట్లు సేయ వెఱ ♦ పావహిలంగ మలాయతాక్షియున్.

సీ. బలితంపు చందోయి ♦ పైబాలుకంటి నీ
రొగి పైటచెఱగున ♦ నొత్తుకొనుచు
నవమాన మేమిరా ♦ నగునోయటంచు ని
ట్టూర్పులు సెలగ లో ♦ నుస్సురంచు
నొంటిపుట్టంబుతో ♦ నుండి కొల్వునకేగ
బదములాడక త్రొట్రు ♦ పాటుగనుచు
నోలగంబున పెద్ద ♦ లున్నారు దైవము
న్నాడని వెఱపు వో ♦ నాడుకొనుచు

తే.గీ. సభకుజన్నుదెంచి తనుజూడ ♦ జాల కొకట
తలలువాంచిన పాండునం ♦ దనుల గొరచి
వనరుచుం గురువృద్ధుల ♦ వెనుక నిలిచె
రమణి దీనైన పాంచాల ♦ రాజతనయ.

క. నిలిచిన పాండవసతి నీ
వలకుం దెమ్మంచు గౌర ♦ వప్రభు డనె, కా
వలుడు పెదతమ్ము డటుజన
లలనామణి "నేరజస్వ - లం దొలగు" మనెన్.

రాగు — తీశ్రగతి

ప॥ తకుకులు చాలింపుమోసి - దాసీ! దుశ్శాసనుకడ ॥త॥
అ॥ ప॥ ఎక్కడికేగెదవు మ్మా యా - ధీవయైతివి నీవిక ॥త॥
1. కులటవుగావునను కట్టు - కొన్నావేవురు మగలను
భళి! భళి! యత్తకుదగుకో - డలివగుదువు రమ్ము రమ్ము ॥త॥

2. ఏకవస్త్రవైన నేమి - నీకీయెడ సిగ్గేమి
వే కదలుము విడువను నిను - విగతవస్త్రవైనగాని ॥తే॥

తే. గీ. అని యదల్చుచు రాజసూ ♦ యావభృథము
నందు శుచియగు శిరోజము ♦ లందిపట్టి
యెట్టకేలకు ద్రోవది ♦ నీడ్చి తెచ్చె
సభకు దుశ్శాసనుండు దు ♦ శ్శాసనుండు.

వ. అట్లు భీష్మద్రోణాది కురుగురువృద్ధులున్న కొలువుకూటమునకుం బాంచాలి నీడ్చుచో భీముండు కోపవిచారమ్ము లోకుక్కమ్మడి ముప్పిరిగొన ధర్మజు నుద్దేశించి.

ఉ. పాడిదొలంగి జూదమున ♦ పమ్ముగ దమ్ముల, రాజ్యమెల్ల దా
నోడిన నోడుగాక; సతి ♦ నొడ్డి పణమ్ముగ జూదమాడుకొ
న్నాడిటు పాండవాన్వయము ♦ నం జెడబుట్టె నితండు; వీనికిన్
వీడక బాహువు ల్దగుల బెట్టిన ♦ దీరదుగాదె కోపమున్?

వ. అనిపలుక భీముని వారించి యర్జునుం డిట్లనియె.

తే. గీ. ఆడినది జూద మందెట్లు - పాడిదోచు?
నితడు ధర్మముతప్పి చ ♦ రింప డెపుడు
తగునొకో? దైవవైపరీ ♦ త్యమున కిటు ల
తిక్రమింపగ నావిడుట శాం ♦ తింపు మన్న!

వ. ఇట్లు దైవప్రాతికూల్యమునకు వగచు భీమార్జునులను సభాంతరమ్మునకు నీడ్వంబడిన ద్రోవదిని జూచి వికర్ణుం డిట్లనియె.

చ. తలలును గడ్డముల్నరసి ♦ తాలుకము లైర ద్రిమ్మ పెద్ద లై
లలనయొకర్తు కొల్వునకు ♦ లాగబడం గనులొప్పగించి బొ
మ్మలవలెజూచుటొప్పునె? స ♦ మర్థత లేమియు శోభయే? మాన్పగా
వలదొకొ? యుష్మదాంధ్రుగుల ♦ వారలుగారొకో? [illegible]

వ. అనిపలుకు వికర్ణుం గని కర్ణుం డిట్లనియె.

తే. గీ. వీరునీమాత్ర మెఱుగని ♦ వారుగారు
పిన్ననోటికి జెల్ల నీ ♦ పెద్దమాట
లూరకుండుము నీ కేల ♦ నోయి! నడుము
కులటయెడ బనిలేదు నీ ♦ తులు వచింప.

వ. అనుచు బ్రత్యాఖ్యానంబుసేయు నంతలో దుర్యోధనుండు దుశ్శాసనుం బిలిచి వీరెల్లరి వస్త్రంబు లపహరింపుమన బాండునందనులు పై పుట్టంబులందీసి యవ్వేడంబెట్ట దుశ్శాసనుండు ద్రౌపది పైటచెఱంగు బట్టదివుర బాంచాలి యొక్కింత తొలగి వెంటనంటి దుస్ససేనుండు పుట్టంబొలుచుచుండ మనమ్మున నీశ్వరసన్నిధానముం గల్పించుకొని బాహ్యప్రపంచము న్మఱచి శ్రీకృష్ణునుద్దేశించి.

భూపాల - చతురశ్రగతి.

ప॥ సకలచరాచర సృష్టికారణా - సామి
బ్రోవరావా - సర్వాంతర్యామి బ్రోవరావా ॥స॥
అ॥ప॥ ప్రకటదీన మందారమానిజన
పారిజాతభువనైక విఖ్యాత ॥సకల॥

చ ర ణ ము

హా! కృష్ణా వసుదేవనందనా - ఆర్తావనలోలా కాంచనచేలా
దయాలవాల శ్రీకాంతా హృద - యాంబుజబంభర శేష
శయనశౌరీ విశ్వంభర ॥సకల॥

మ. కురువృద్ధుల్ గురువృద్ధు లున్న సభలో ♦ గొంకేమియున్ లేక, పాపరతుల్గౌరవు లిట్లు నన్వరిభవిం ♦ పం జూచి దీనావన
త్వపడీవయ్యును మిన్నకుంటి వకటా! ♦ ధర్మంబొకో? అన్యథా
శరణంనాస్తిత్వమేవదేవ మను కృష్ణా ♦ దీనసంరక్షణా?

మ. ధరణీనాథున కెల్లరు న్వెఱచి పె ♦ ద్దల్మిన్నకున్నారు, తా
మురుబాహాబలశాలురయ్యు దగఁ ♦ గుంటన్దలల్వంచి యుం

డి రిట న్నాపతులేవ్వ రాడుకుయులా ♦ లింపంగదే? అన్యథా
శరణంనాస్తిత్వమేవదేవ ఘమ కృ ♦ ష్ణా! దీనసంరక్షణా.

వ. ఇట్లు మొరవెట్టుచు శ్రీహరికటాక్షమున నక్షయవస్త్రయగు ద్రోవదింగని సభ్యులెల్ల రాశ్చర్యమందిరి. పాంచాలినట్లు పరాభవించిన దుశ్శాసను వక్షస్థలమ్మును బగిలించి రక్తమును ద్రావుదునని భీమసేనుండు ప్రతిజ్ఞ జేసె. చీరలరాసులు పర్వతప్రాయము లగుటచే విసువెత్తి చేయునదిలేక దుశ్శాసనుండు మిన్నకుండె నట్టియెడ రాధేయుండు ద్రోవదింగని.

ఉ. ఉమ్మడిగొడ్డు చందమున ♦ నోపడగువా! మగలేవ్వరుంటచే
నిమ్మెయి గష్టముల్గుడిచి ♦ తీ వొక శూరునిగట్టు క్షేమ్మనన్
రమ్మని సన్న జేసితొడ ♦ లం గనుపర్చె సుయోధనుండు; కో
పమ్మున భీము డూరువుల ♦ భగ్నమొనర్తు ననెన్మహోగ్రుడై.

వ. అట్టియెడ ద్రౌపదీపరాభవమ్మంతయు గాంధారి ధృతరాష్ట్రున కెఱింగింప నతండును దుర్యోధను మందలించి పాంచాలిని రావించి యిట్లనియె.

హిం॥ ముఖారి — చతురశ్రగతి

ప॥ తలమానిక మువిదలకు నీ వుభయ
కులపావని వమ్మా — కోడలా ॥కుల॥

అ॥ప॥ తులువలై నాకుమారులొనర్చిన
దుండగముసైపుమా — కోడలా. ॥తల॥

చరణము

ఇచ్చవచ్చినటు వేడుమా వరంబెద్దియైనగాని — కోడలా ॥యెద్ది॥
సచ్చరిత్రవెంతయును నాకుదు- స్సలయొకటియునునీవొకటియూ

వ. అంత ద్రౌపదియు,

సీ. ధర్మతనూభవు ♦ దాస్య విముక్తు నొ
నర్పుమాయనగ, రెం ♦ డవవరమ్ము

నభిలషింపుమన శ ♦ స్త్రాస్త్రసాధనముల
తో దదీయానుజుల్ ♦ దొలగిదాఘ్య
ముంబాయునటుగోరె ♦ మూడవ వరము వే
డుమాటన్న క్షత్రియ ♦ రమణికింత
కున్నిటి వాంఛింప ♦ గూడదన నంత
సిరి నెత్తుమున యుధి ♦ ష్ఠిరనృపాలు

తే. గీ. డోటువడిన సర్వస్వము ♦ నొసగి యంధ
నృపతి వారి నింద్ర ప్రస్థ ♦ మేగ ననిపె
నది గని సుయోధనుండు ప్ర ♦ యత్న మెల్ల
విఫలమగుటకు జింతించి ♦ వెలవెలంగి.

వ. ధృతరాష్ట్రు నొప్పించి మఱల ద్యూతార్థంబు ప్రాతిగామినంపి ధర్మ నందను సపరివారమ్ముగ రావించి జూదమ్మున నోడిన వారజిన వల్కల ధారులై పండ్రెండేండ్లు వనవాసమ్ము జేసి యాపై నొక్క యేడు జనపదంబున నజ్ఞాతవాసంబు జేసి యం దెఱుంగబడి రేని మఱల నరణ్యాజ్ఞాత వాసమ్ములు సేయునట్లు పన్నిదము నిర్ణయించి శకునిచే జూదమాడించి యోడింప ధర్మజుండు విధి నియోగమ్మునకు వగచుచు వనంబునకు బోవ సమకట్టి యెల్లరికడ సెల వంది విదురునింట గుంతీదేవి నుంచి యెల్లవారి యాశీస్సులంది పరిత్యక్త విభవుండై యనుజ ద్రౌపదీ ధౌమ్యపరివార సహిత మ్ముగ దంతి పురము విడిచె.



శ్రీ

# మహాభారతము

## పాశుపత సంసిద్ధి

మోహన - ఆది

ప॥ వినుడు పాశుపతసిద్ధి - కనుడుదాన - నభిమతార్థ సంసిద్ధి॥వినుడు॥

అ॥ప॥ అనిమిష రాజ తనూభవుడురు జం
ద్రార్ధ మౌళి పోరాడిన సత్కథ ॥వినుడు॥

చరణము

అనఘులౌ పాండుసుతులేవురు ధౌ-మ్యాది భూమిసురులనుగాములుగా
వనితామణి పాంచాలిం గొని వన-వాసార్థము వెడలిరి కరిపురి విడి॥

తే.గీ. క్ష్మావలయ మెల్ల గోల్పడు ♦ కతన బాడము
వనట గనువిప్పి తేఱిచూ ♦ చిన జగమ్ము
భస్మమగునంచు ధర్మ సం ♦ భవుడు చేల
మున ముఖాంబుజముం గప్పి ♦ కొనుచు నేగె.

క. ఆహావరంగమ్మున నిజ
బాహాబలదర్పమెసగ ♦ పరిపంథుల ను
త్సాహమున గూల్తునంచును
బాహువుల న్సాచియేగె ♦ పావని వనికిన్.

క. సురరాజసూను డింతకు
దఱుచుగ బాణమ్ము లేసి ♦ దర్పోద్ధతి సం

గరమున నరివీరుల వే
సరక జెఱతునంచు నిసుము ♦ చల్లుచు నేగెన్.

తే. గీ. ఇదుమ హెన్నని గుడువ బా ♦ ల్పడిన తనదు
సుందరాకారముం గాంచి ♦ కుందకుండ
జనసమూహమ్ము, ధూళి ధూ ♦ సరితదేహు
డగుచు శల్యుని పెద్ద మే ♦ నల్లు డేగె.

కం. ఘనదుఃఖభాజనమ్ముగ
వనికేగు స్వకీయ దీనవక్త్రమ్మును సూ
చినవారికెల్ల నెగ్గగు
ననుచు స్సహదేవుడేగె ♦ నవనతముఖుడై.

తే. గీ. కదనమునజచ్చిన మగల ♦ కై వల వల
యేడ్చు చిటు కౌరవాంగన ♦ లేగుదు రన
తలవిరియబోసి తడసిన ♦ వలువగట్టి
దుఃఖభారంబునం జనె ♦ ద్రుపదపుత్రి.

వ. మఱియు భారతరణమ్మునంజచ్చు శూరుల పరలోకవిధులనూహించుచు ధౌమ్యుండు రౌద్రయామ్య సామగాన ముఖరితాస్యుం డగుచు జనియె నట్లు ధర్మనందనుండు మహారణ్యమ్ములు గడచి పోవుచు ధౌమ్యోపదేశమ్మున సూర్యు నారాధించి యరణ్యమున నుండంగల పంద్రెండువత్సరములును వన్యఫలమూలకంబులు పాక స్థానంబున ద్రోవదిచేత సాధితంబులై యక్షయంబులగు చతుర్విధాహారంబులగునని వరంబంది కతిపయ ప్రయాణముల గామ్యక వనంబు సొచ్చుచుండ నొక్కనాటి యర్ధరాత్రమ్మున గిమ్మీరుం డను రాక్షసుండు మార్గనిరోధియై వారిం బాండుకుమారులని తెలిసి యట్టహాసమ్మున నిట్లనియె.

అఠాణా - ఖండగతి

ప॥ వెనుకబోయిన తీవ - పదములకు దగిలినటు
భీముడే యగుపించెనా - నాయన్న నుజంపిన ॥భీ॥

అ॥ ప॥ సుదినమిా వేళనా - సోదరుని ఋణము దీ
ర్చుటకు దలియమ్యె నా - రా నేబకాసురుని తమ్ముడ ॥వే॥

చ ర ణ ము

మీాకు గాలముతీఱె - నాకడకువచ్చితిరి
పోకార్తు గాచుకొనుడీ - పాండుకుమారులార ॥పో॥
పాకారి కేనినను - బవరమున డీకొనగ
వశముగాదని తెలియుడీ - నేకిమ్మీారుడ ॥వె॥

సీ. అని పలుకుచు సమీార ♦ తనయుపై గవియదా
రుణభంగి నతని పా ♦ వనియుదాకై
భూరుహమ్ములగొని ♦ పోరి రాపై శిలా
సంగరమొక్కింత ♦ సల్పిరంత
మానుషాశను భీమ ♦ సేనుండు పరిహీన
బలునిగా గుర్తించి ♦ బాహుదండ
ముల బకుంగూల్చి న ♦ పోల్కి వాని కటికం
ఠప్రదేశమ్ముల ♦ స్పట్టినేల

ఆ. వె. బెట్టి దేహయష్టి ♦ విఱిచి కాలునిపురి
కనిపె ధర్మజాడు ♦ లభినుతింప
గరము సంతసించి ♦ కామ్యకవనమున
బాండవులు వసించి ♦ యుండునంత.

వ. అట్లు కామ్యకవనంబున మునివృత్తినున్న పాండవులం బరామర్శింప శ్రీకృష్ణుండు పాంచాలయాదవ ప్రముఖుల న్వెంటనిడుకొని తద్వ నమ్మునొచ్చి పాండవేయులంగని జాలివడుచు ధార్తరాష్ట్రులకలిగి.

కేదారగౌళ - రూపకము

ప॥ అవమతులై సాబలేయు - లడవులపాల్జేసిరామి॥ మ్మ॥
అ॥ ప॥ అవనీతలమంతయు మా-యాదురోదరమునగెల్చి॥ య॥

చ ర ణ ము

యువతీమణి నావిధి నిం - డోలగమున కీడ్చిరాో
శివ శివ ! పుట్టమ్ములొలిచి - చెఱచిరాభరతాన్వయంబు॥ నన॥

సీ. రణభూమి గౌరవ ♦ రక్తధారాపాత
ఫేనులై నిండ పా ♦ లింపకున్న
కన్నీటఁ దేలించి ♦ గాంధారికోడండ్ర
విధవలం జేసి యే ♦ డ్పింపకున్న
జిలివిధికేనొక్క ♦ సుతుడు సైతము లేక
చీకు జేని దపింప ♦ సేయకున్న
విఖ్యాత పాండవ ♦ విజయఢంకారావ
మెల్లదిక్కులను మ్రో ♦ గింపకున్న
తే. గీ. ధౌమ్యుఁడభిషేచనంపు మం ♦ త్రాలు సదువ
నెగడు జయజయ శబ్దముల్ ♦ నింగిముట్ట
సార్వభౌమునిగా మహీ ♦ స్థలికి ధర్మ
సూను గావింపకున్న కృ ♦ ష్ణుండగాను.

వ. అని పలుకనంతలో ద్రోవది గోపాలుంగని.

క. అన్నా నీ మెఱుఁగవిదే
మున్నది సభకీడ్చి వలువ ♦ లొలిపించిరి కు
న్నెన్నఁడు నాపడిన గతి
న్బన్నము వడిరే కులాంగ ♦ నలు త్రిజగములన్

సీ. సిరికాల వాలమా ♦ భరతాన్వయమునఁ జ
న్మించినారు ప్రశస్తి ♦ నించినారు
వెలిగి ధనుర్వేదమూ ♦ ములాగ్రమ్ముగ నభ్య
సించినా రున్నతి ♦ గాంచినారు
గాండీవమాదిగా ♦ గలుగు నాయుధము లా
ర్జించినా రరుల దూ ♦ లించినారు
రాజసూయ మహాధ్వ ♦ రం బన్న చేత జే
యించినారు యశమ్ము ♦ పెంచినారు
తే. గీ. బాహుబల్లమ్మేమిటికి భీమ ♦ పార్థులకును
రచ్చకీడ్పించి నన్నుఁ బ ♦ రాభవింప

దమకు గాదని జూచి రిం ♦ దరును గలిగి
దిక్కుమాలినదాన నై ♦ తినిగదన్న.

వ. అనుచుం దన పరిభవమ్ము సెప్పికొని దుఃఖించు ద్రౌపదిని నూరార్చి వాసుదేవుండు సుభద్రాభిమన్యులం దోడ్కొని ద్వారవతి కరిగె. ధృష్టద్యుమ్నుండు ద్రౌపదేయులం దోడ్కొని కాంపిల్యమ్మునకుం జనియె. నంత ధర్మజాదు లచ్చోటువిడిచి ద్వైతవనంబు సొచ్చి మార్కండేయ బకదాల్భ్యాది మహర్షుల యాశీస్సులందినవా సంబు లేర్పఱచుకొని యుండునంత నొక్కనాడు పాంచాలి ధర్మజున కిట్లనియె.

హూండ్ - ఆది

ప॥ అడవులకంపిసహోదరాత్మజుల-ననుభవించుచున్నా డెభోగముల॥న॥
అ॥ప॥ చెడుగులెంచనక కొడుకులంగలసి చీకు ఱేడు పాషాణహృదయుడై
1. నృపకిరీట మాణిక్య కాంతిచే నెఱ్ఱనైన భవదీయ పదయుగము
యిపుడుకఠినంపురా నేల నడువ నెఱ్ఱనయ్యె నకటా! యెంతవచ్చె॥న॥
2. క్షమయు తేజమును గాలోచితముగ కల్పింపవలయు క్షత్రియుండెపుడు
క్షమారమణ గాంధారేయులపై శాంతిజూపు టేలా శూలీ॥ య॥

చ. సెలవిడి పంపుమా కదన ♦ సీమకు నీవిపు డైన భీమపా
ర్థుల నవలీల నొక్కత్రుటి ♦ లోపల దాయలగూల్చివత్తు రీ
యలజడివోవు ఘోరవిపి ♦ నాంతర భోగ్యంబుల నెంతకాల మీ
సిలుగుల కాస్పదంబుగ న ♦ సించి కృశించుటు రాచవారికిన్.

వ. అన విని ధర్మజుం డిట్లనియె.

ఉ. క్రోధగుణంబు పాపముల ♦ కుం గుదురై చెలువొందు వేదముల్
క్రోధియొకింత కర్జము నె ♦ ఱుంగ, ధమత్ముల నైవ గూల్చు, నెం
తేదెగు నాత్మఘాత మొన ♦ రించుకొనవన్; క్షమగల్గువాని కా
మోదము భద్రము స్వజయ ♦ మ్ముంగలుగున్ క్షమియాయలెసగ్యయా

వ. అనిపల్కు ధర్మజునకు భీమసేనుం డిట్లనియె.

క. పిత్రుపై తాతామహాగు నీ
క్షితియంతయు నొరుల కప్ప ♦ గించి యడవులన్
వ్రతములు ధర్మములను చీ
గతి గాలముగడుప నగునె? ♦ క్షత్రియులో కెటన్.

ఉ. సింగపుపాలియామిషము ♦ చేకొను నక్క-విధాన రాజ్యల
క్ష్మిం గొని దాయలిట్లు మన ♦ చే, జరియింతురు రాజనీతి పా
రంగతుశ్రేష్ఠ తలంతురు ప ♦ రాక్రమహీనులు పాండవేయు లం
చుం గడుచుల్క-నన్వనము ♦ సొచ్చి యిటుల్ మునివృత్తినున్న చోన్

ఉ. పాచికలాడి రాజ్య మెడ ♦ బాపిరి దాయలుమోసగించి, ధ
ర్మాచరణంబు శత్రు విజ ♦ యంబున కెంతయు సాధనంబుగా
దీ చదువేల యాజ్ఞయిడు ♦ మేనును తమ్ముడు వేగి వారలం
బీచమడంచి నిన్ను పృథి ♦ వీవరునిం బొనరింతు మగ్రజా!

వ. అనవిని ధర్మరాజిట్లనియె.

తోడి — రూపకము

ప॥ కయ్యమాడుటకు సమయము - గాదు తమ్ముడా ॥కయ్య॥

అ॥ ప॥ వెయ్యేటికి నీవాడిన — విధము ధర్మముగుంగాక ॥కయ్య॥

1. వనమున బంర్రెండేండ్లును - జనపదమున నెఱుగకుండ
పనివడివత్సరముగడుప - ప్రతినజేసినారముగద ॥కయ్య॥

తే. గీ. చంచలంబగులక్ష్మికై కా ♦ సపడినరుడు
సత్యధర్మంబులెడయగా ♦ జనదుగాన
రాజ్యకాంక్షచే సలిపిన ♦ ప్రతినవీడి
కదనమొనరింప ననుమతిం ♦ పదు మనంబు.

వ. అనిన భీమసేనుం డిట్లనియె.

తే. గీ. మరణమేరికి నియతంబు, ♦ మరణమునకు
మున్నె వైరంబు దీర్చుకో ♦ బోనివాని
జీవితము వ్యర్థమగుగాన ♦ జావమోది
వైరులందొ ల్త, నడుపు మా ♦ పైని ప్రతిన.

క. శ్రమపడి యెట్టులో వనవా
సము సేయగ వచ్చుగాక ♦ సాధ్యమె యజ్ఞా
తమొనర్ప, మేరుగిరిఁ గూ
ర్మము సేయుటగాదె మనల ♦ దాచుకొనుటయున్.

వ. అనుచు యుద్ధమే కర్తవ్యంబని పలుకు భీమసేనునకు ధర్మజుం డిట్లనియె.

శా. సామాన్యంబను కొంటివో? కలరు భీ ♦ ష్మద్రోణశారద్వతు
ల్ధీమంతు లుర్వరురాజపక్షమున వా ♦ రిన్ గెల్వకే శాత్రవ
స్తోమంబుం గనువిచ్చిచూడనగునే? ♦ దుర్యోధనార్థంబు నా
నామర్త్యేశులు ప్రాణముల్విడువను ♦ న్నారెందఱో సిద్ధమై.

తే. గీ. వినుము రాధాకుమారుఁ డ ♦ భేద్యకవచు
డస్త్రశస్త్రవిద్యారహ ♦ స్యజ్ఞు డతడు,
కర్ణువిలునేర్పు బాహువి ♦ క్రమము దలచు
కొన్న నాడు నాకుండదు ♦ కన్నునూఁత.

వ. ఇట్లు ధర్మజుండు దుర్యోధను నిర్జింపలేమని విచారించుచుండ సమయంబున కృష్ణద్వైపాయనుం డచ్చోట కరుదెంచి పూజితుండై ప్రతిస్మృతియను విద్యను ధర్మజున కుపదేశించి "నాయనా! దీనిని నీవర్జునున కుపదేశింపుము. తపోవీర్య విభవుండై యర్జునుం డింద్రాది దిక్పాలకులను, ఈశ్వరుని బ్రత్యక్షుంబు సేసికొని దివ్యాస్త్రలాభంబంది శత్రువుల జయించునని పలికి మీరొండు వనంబున కరుగునది" యని చెప్పి యమ్మునివరుం డరిగిన బాండవులచ్చోటువాసి బ్రాహ్మణులతో గామ్యక వనంబున సరస్వతీ తీరమ్మున నివసించుచుండ నొకనాడర్జునుం డన్నకడ ప్రతిస్మృతి నుపదేశమంది కవచకార్ముకాస్త్రధరుండై భూసురాశీర్వాదమ్ము వడసి పూర్వోత్తర దిశాభిముఖుండై యరిగి యింద్రకీలనగమ్మున నింద్రుం గని నుతించి యాతని యనుమతమ్మున హిమశైలశిఖరంబున కరిగి యూర్ధ్వబాహుండై యేకపాదాంగుష్ఠాగ్రంబున

నిలిచి వాయుభక్షణంబు సేయుచు బరమేశ్వరు నుద్దేశించి యిట్లు కీర్తించుచు ఘోరతపంబు సేయదొడంగె.

పూర్వకళ్యాణి - సంకీర్ణజాతి త్రిపుట

ప॥ హరహరహర మహాదేవశంభో పుర - హర గంగాధర॥ హ॥

అ॥ ప॥ సురవరనుత కోమలపద - సరసీరుహ కరిచర్మాంబర॥ హ॥

చ॥ ధరణీధరచాప నిరతాశ్రితజనావనాటోప, యుపశమిత సమస్త పాప - దయాభరణ దానవసంహరణ - గరళకంధర ధరాధర తనయారమణ చంద్రధర సృష్టిస్థితిలయకారణ దురితాపహరణభుజగాభరణా॥ హర॥

తే. గీ. ఇట్లు తపమొనరించు దే ♦ వేంద్రతనయు
భక్తినిష్ఠ కెంతయుచు నా ♦ పార్వతీశు
డలరిపాశుపతాస్త్ర మీ ♦ యందలకొని
బలము చలము బరీక్షింప ♦ దలపుగొనుచు

సీ. ఎఱుకతయై వెంట ♦ గిరికుమారిచరింప
బంగరుమైచాయ ♦ పరిఢవిల్ల
వెఱపింపగల గొప్ప ♦ విల్లొండు జేబూని
మూపునం దమ్ములు ♦ పొదిచెలంగ
చింకితలలు పొట్టి ♦ చేతులు మిడిగ్రుడ్లు
గలిగి భూతములెఱు ♦ కులటుదనర
పులులుసైతము మూక ♦ మూకలై పాఱుచు
జీకాకుపడ బొలి ♦ కేకలిడుచు

తే. గీ. నెఱుకురాజై పురారి డ ♦ గ్గఱుచు మూక
దైత్యుగిటిజేసి విజయుపై ♦ దవుల నరుడు
దాని దవ్వులగని గుణ ♦ ధ్వని యొనర్చి
నిలువ నెఱుకుల తేడు కాం ♦ తేయునకనె.

బాగు - చతురశ్రగతి

ప॥ తాళుతాళు మొకిఁ—ంత వరాహము గూలనేసాకడగితి వెవ్వండవు

అ॥ ప॥ మేటమేమి ? చెప్పిన నాలింపవు కాలమాసన్నమాయె నే సేకు॥

చ ర ణ ము

శరవిద్యా పాటవము నీకున్న - సంగతి తెలిసియుసులే, చాలింపుము
మరియాదకు జూచిన నీగరువము మానకుంటివిదిగో పోగర్వోక్తులా॥

కం. అన గ్రీడి లెక్క సేయక
సునిశిత బాణముస నేసె ♦ సూకరమును ద్రో
డనె హరుడేసెను దానిం
గొన కిరువురి బాణములు ద ♦ గుల్కొనె కిటికిన్.

క. శరము లిరుదెసల దాకిన
కిరియును శరఘాతకలన ♦ గిరగిర దిరిగెన్
శరవిద్ధుండై నక్తం
చరుడుం గిటిరూప మొకటి ♦ జాలించి చనెన్.

వ. అర్జునుండు విస్మితుండై ముంగట జాపధరుండగు నెఱుకురాజుంగని.

కన్నడ - ఆది

ప॥ ఏమేమో ప్రేలితి వింతకుము - నెవ్వండవు చెప్పుమా సరిగా విన లే॥
అ॥ ప॥ కామినీయుతుడవై తిరుగనేటికీ మహారణ్య మధ్యంబుననీ ॥ వే॥

చ ర ణ ము

ఏలచేసితివినా యేస్సినకిటి నేసిమూర్ఖుండవై-మృగయాధర్మవిరోధంబిపుడే॥
చాలు తెలిసె నీవడత నానిశిత - సాయకాగ్ని పాల్జేతు గాచుకో ॥మ్మో॥

వ. అనిన నెఱుకుఱేడిట్లనియె.

ఉ. ప్రాణమువాసె మామక శ ♦ రాహతి జేసి వరాహమట్లు, నీ
బాణముద్దాకి కూలెనని ♦ పల్కెదు సిగ్గొక్కటులేదు ? నిన్ను నీ
వే నుతియించు కొందువిటు ♦ లెంతయు జెప్పగ జాలనిశౌర్యమున్
మానక బీరమున్న నిలు ♦ మా, యికనీపస గాననయ్యెదున్.

చ. అనుచు బినాకితాకె నరు, ♦ నర్జునుడున్ శరవృష్టి ముంచె న
య్యనఘు; శరమ్ములన్నియును ♦ వ్యర్థములై చని హెూం, గిరాతుడే
సిన విశిఖమ్ము లింద్రసుతు ♦ భిన్నశరీరు నొనర్చె మాయ మ
య్యెనుపయి పెచ్చు వాయుసఖు ♦ డిచ్చిన యక్షయసాయకమ్ములున్.

వ. అట్లగుట కర్జునుండు విస్మయపడి.

16

నీలాంబరి - చతురశ్రగతి

ప॥ ఘనకిరాత వేషమ్మున వచ్చిన - గంగాధరుడో యీతడు ॥ఘన॥
అ॥ప॥ రణమున నాశరధాటికోర్చి బీ - రమ్ము సెడక మూర్ఛిల్లకుండు నే॥ఘ॥

చ ర ణ ము

మాయమయ్యె నగ్ని దేవుడొసగిన - సాయకమ్ముల తక్షయశరనిధితో ॥మా॥
యేయుపాయమున వీనిగెల్తు నే - డేల వచ్చె గిట్టికై పోరాటము ॥ఘన॥

మ. అని గాండీవము నెత్తి యాటవికునే ♦ యన్ వ్యర్థమైపోయె, గో
పనుడై చేసె గృపాణపాత మదియున్ ♦ వమ్మయ్యె, బార్థుండటన్
ఘనవృక్షమ్ములు రాలు వైవ నడగెన్, ♦ గౌంతేయుడాపై రణం
బొనరించెం దెగి ముష్టిఘాతముల శౌ ♦ర్యోద్రేక విస్తారుడై.

క. బుడుత నెలతాలు పాక
వ్వడి బిడికిటబొడువ గ్రీడి ♦ వడిమూర్ఛవడెన్
వడముడితమ్ముడు సూపిన
కడిమింగని సంతసించి ♦ గంగాధరుడున్.

సీ. జడలమిన్నేటితో ♦ సామేనిగౌరితో
బాలుపారు జాబిల్లి ♦ పూవుతోడ
చిలువ సూడిగముతో ♦ పులితోలు శాల్వతో
వలనైన ముమ్మొన ♦ వాలుతోడ
చొక్కపుటాబోతు ♦ జక్కితో వెలిమిడి
పూతతో జిఱునవ్వు ♦ మోముతోడ
రాణించు పునుకకస ♦ రాలతో విసపుగు
త్తుకతోడ నొసటిచే ♦ సికనుతోడ

తే.గీ. హరుడు సాక్షాత్కరించి తె ♦ మ్మర్జునా! త్వ
దీయధైర్యమ్మునకు మెచ్చి ♦ తిని వరమ్మ
వేడుమన నింద్రసూనుండు ♦ విశ్వనాథు
గాంచి కేల్దోయి మొగిచి ను ♦ తించె నిట్లు:

కేదారగౌళ - మిశ్రజాతిత్రిపుట

ప॥ శరణు శరణు గంగాధరగిరి - జామనోహరా॥ శ॥

అ॥ ప॥ పరమపురుష భక్తపోష - విష ధరపరిభూషా॥

మి॥ కరధృతధరణీధర పురహర హర వరకరుణాకర శుభకర - గరళ కంధరా తరుణేందుధరా - శరణాగత పురందర పరాత్పరపరబ్రహ్మ రజతాచల - సదన మదనదమన వృషభగమనా॥ శర॥

క. ఎఱుకసెడి నిన్నెఱుంగక
మెఱుకు దొరంబలె దలంచి ♦ యెదిరిన నాయీ
మఱుకువ సైరించి దయా
పరత బ్రసాదింపు మభవ! ♦ పాశుపతంబున్.

వ. అనివేడు పురందరనందనుం గని గిరిజా సుందరుం డర్జునా! అతి మానుషంబైన నీపరాక్రమంబునకు మెచ్చితిని. నీగాండీవ మక్షయ శరధితోడ మదీయ మాయాగ్రస్తంబయ్యె మఱల నిచ్చితిం గొను మని యిచ్చి పార్థుం గరుణించి మంత్రధ్యాన జపహోమపూర్వ కంబుగా సంధాన మోక్షణ సంహార సహితంబుగా బాశుపతా స్త్రం బిచ్చి యీ దివ్యాస్త్రంబున నీవెల్లలోకంబులు జయింతు వని వరంబిచ్చి పురాంతకుం డంతర్ధానమయ్యె నంత నింద్ర యమ వరుణ కుబేరాది దిక్పాలకులు విజయునికడకు నరుదెంచిరి. వారిలో యముండు దండంబును, వరుణుండు పాశంబును, కుబే రుండు కౌబేరకాస్త్రంబును బార్థునకు విధియుక్తంబుగా నిచ్చి యరుగ, నంత దేవేంద్రుం డర్జును నమరావతికి దోడ్కొనిరమ్మని రథంబిడి మాతలిఁ బనుప, బాండవమధ్యముం డద్దివ్యరథం బెక్కి యింద్రలోకమ్మున్ సొచ్చిన శతమఖుండు నభిముఖుండై తనయుం గౌగిలించుకొని ప్రియమ్మున నర్ధపీఠాసనాసీనుం గావించె.

శ్రీ

# మహాభారతము

## ఘోషయాత్ర

హంసధ్వని-ఆది.

ప॥ వినుడీదుర్యోధను ఘోషయాత్ర-వీనులపండువుగా ... విన్పించెద॥వి॥

అ॥ ప॥ వినవిన నత్యద్భుతమీ భారత-వీరవరుల సత్పుణ్యచరిత్రము॥వి॥

చరణము

దేవగంధర్వ విద్యాధర పరి - సేవితుడై సురరాజతనూజుడు

దేవలోకముననుండునంత జను-దెంచెనతనికడకొక నాడూర్వశి॥విను॥

సీ॥ బలితంపుజందోయి ♦ పైఁ జరదపములంది

వలిపమ్ము రింగులు ♦ వారగట్టి

సురతరుసూనము ♦ లుఱుమునదుఱిమి సిం

గారించిమేలి బం ♦ గారునగలు

సొలవంపుపూటలకమ్ము ♦ లలరించి ముద్దులొ

గుల్కు ఫాలమ్మున ♦ దిలకముంచి

నాణెంపురతనాల యొ ♦ డ్డాణమ్ము గైసేసి

మంచిముత్యాల సో ♦ మ్ములు ధరించి

తే॥గీ॥ రత్నమంజు మంజీర ఝు ♦ ళంఝుళలును

కంకణాంచిత ఝుణఝుణ ♦ త్కారములును

పాకరిపుసూనునెదు దన ♦ రాక దెలుప

వచ్చె నూర్వశి మెచ్చి వి ♦ వ్వచ్చుకడకు.

క. రాగని ప్రణమిల్లగ నెల
నాగయునన నీకిదేమి ♦ న్యాయము ? వినుమా
భోగపుజాడను మనసిజ
రాగముగొని వచ్చితిని భ ♦ రతకులదీపా !

వ. అనవిని యర్జునుండును సెవులుమూసికొని.

చ. హరిహరి, యెంతమాట విన ♦ నయ్యె, బిడౌజుడు తండ్రినాకు, నీ
వరయగ దల్లివౌదువు, మ ♦ దన్వయ సంభవుడౌ పురూరవుం
బరిణయమైతి వక్రతన ♦ వావికి నవ్వవు పూజ్యురాల వీ
వరుస వచింతువే ? వరుస ♦ వావులుసైతముపీడ బాడియే ?

వ. అనవిని యూర్వశియు

ఉ. వావులతోడ నేమిపని ♦ వారవధూటికి ? భార్యయేకదా
ద్రోవదిమీకు ? తల్లియని ♦ తోచదా నీకపుడన్న భార్య ? యీ
వావులులేవొకో యచట ? ♦ భ్రాతృసతీమణి తల్లిగాక నీ
కేవిధిదల్లియా జనకు ♦ డేలిన భోగముచాన యర్జునా !

తే. గీ. అరయ దేశాటనము, సుధీ ♦ వరులమైత్రి,
రాజసభ మెలంగుట, శాస్త్ర ♦ రసమెరుగుట,
వెలవెలది పొందు నీధైర్య ♦ గలుగువాడు
చతురుడగు గాన నాపరి ♦ చయ్యముగొనుము.

వ. అనిన నర్జునుండు.

జంఝూటి - త్రిశ్రగతి

ప॥ స్థానులకు సమాధానము - సరిగ నెవ్వరు చెప్పగలరు ॥సా॥
అ॥ ప॥ మ్రానవయన నరుడను నీ - తో నాకీ తగులమేల ॥సాను॥
1. వ్యాసుననుమతమున మాతృ - శాసనమున ద్రోవదినటు
మాసోదరు లేవురము గ్ర - మముగం జెండ్లాడవలసె ॥సాను॥

తే గీ. వావివరుసలు లేకపో ♦ వచ్చుగాక
॥ ఋచటియాచారమ్ముంభట్టి, ♦ యేనరుండ

నీవు దేవవేశ్యవు మన ♦ కిర్వురకును
సంగమముపాడిగా దింక ♦ జనుము వేగ.

వ. అనినవిని యూర్వశియు,

క. నరనారాయణుల న్నిను
నరుడనిరి, తపోధనులు స ♦ నాతనమును లా
నరనారాయణు లధికులు
పరికింపగ సురలకన్న ♦ బాండుకుమారా!

క. నారాయణముని నను తన
యూరువున సృజించెదాన ♦ నూర్వశినైతిన్
వీరాగ్రగణ్య! నీవీ
కారణమున సురలలో నా ♦ కండవుగావే?

వ. అన నర్జునుం డిట్లనియె.

తే. గీ. అన్నదమ్ములు నరుడు నా ♦ రాయణుండు
వారిజాక్షి! నారాయణు ♦ నూరుభాగ
మున జనించిననీవు నా ♦ తనయవైతి
వట్టినిను గూడ నగునె నా ♦ మాంధుడనయి!

వ. అనిన నాదేవవేశ్యయు,

తే. గీ. అన్నదమ్ములె నరుడు నా ♦ రాయణుండు
సురవిభుండు నారాయణు ♦ సోదరుండు
మఱదివైతివి సంశయిం ♦ ప బనిలేదు
వావియును సరిపెట్టు కో ♦ వచ్చుదీన.

వ. అని పలుకుచు జవాలున గాగిలింపబోవ నర్జునుం డొకింత తొలంగి సమ్మతిం జూపకుండుటచే నూర్వశియు గోపించి చుఱ చుఱం జూచుచు.

హిం॥ తోడి - త్రిశ్రగతి

ప॥ లేనిది లేకయుండ సరి - లేమలు నగుదురు నగుగని॥ లేని॥

అ॥ ప॥ త్నానయి వచ్చుటకొన్నను - తప్పాగలదె వేశ్యాంగనకు॥ లేనిది॥

1. తొలుత నీమనం బెఱుగక - వెలిబుచ్చితి నామనంబు
కలదే యింతకు మించిన - కష్టము పరిభవము సతులకు॥ లేనిది॥
2. యువకుడవై నన్నిగతి - నుసురుపెట్టితివి గావున
యువతీజనమధ్యంబున - నుండుమా నపుంసకుడవై॥ లేనిది॥
చ. అనిశపియించి వేల్పు వెల ♦ యాలుచనెన్; దివిజేంద్రుడుం గుమా
రునికడ కేగుదెంచి మును ♦ లున్నరిరారు జితేంద్రియత్వమం
దుననొగి నీకటంచు విను ♦ తుల్ బొనరించుచు శాపమింక నీ
కనుభవమా నొకింత వెర ♦ వై పదుమూడవ వత్సరమ్మునన్.
వ. అని పల్కుచు దివ్యాస్త్రమ్ము లెన్నియేని నుపదేశించి, కుమారు నైదేండ్లు తనకడ నుంచుకొని, పార్థుని కుశలవార్తయు, దివ్యాస్త్ర సంసిద్ధియు ధర్మజున కెఱింగింప రోమశుం బంప నమ్మహాముఁనియు బృహదశ్వ మహామునిచే సకల కలికల్మష నాశన కరంబగు నలోపాఖ్యానంబువిని గాండీవిరాక కోరుచున్న ధర్మజుని కడకుం జని పార్థుని క్షేమం బెఱిగించి ధర్మజాదుల నెల్లరం దోడ్కొని సమస్త పుణ్యతీర్థంబులు సేవింపజేసి గంధమాదన పర్వతంబునకు జేర్చె నందొకనాడు పాంచాలీ భీమసేనులు విహరించుచో సవిహార విధూతంబై యొక్క సౌగంధిక కమలంబు భూమిపయింబడ జూచి ద్రోవది భీమసేనున కిట్లనియె.

శ్రీరంజని - ఆది

ప॥ అతిమనోజ్ఞమిూ యరవిందముగను - మనుప
మాన మిదియ........సుమజాతికెల్ల॥ నతి॥
అ॥ ప॥ కుతుకమ్మున దీనిని సృజియించిన -
చతురాననుచతురత స్తవనీయం॥ బతి॥

చరణము.

ఈసమీపముననిట్టికుసుమంబు-లెందేనిగల్గుచో ... దెచ్చియిమ్మునాథా
యీసౌరభ రామణీయకముభువి-నేసూనములకు ముమ్మాటికిలే॥ దతి॥

క. అనిపల్కి లతాంతము గొని
చనియెం బాంచాలి ధర్మ ♦ జాతునికడకున్
ధనువుం బాణములుం గొని
యనిలతనూజుండు పయన ♦ మై సుమమునకై.

సీ. కమలంబుదెచ్చిన ♦ గాడ్పున కభిముఖుం
డై చని మార్గమ ♦ ధ్యమున నెదిరి
పైవచ్చుమృగముల ♦ బ్రహరించుచుం బద
ఘట్టనమ్మున బృథు ♦ ఘూర్మధరేంద్ర
మద్రువ వేగంబున ♦ నరుగుచుం గడకు ముం
గట సరోవరమొండు ♦ గాంచి యందు
గాడ్పుపట్టికృతావ ♦ గాహుడై వెలువడి
సంభృతోత్సాహుడై ♦ శంఖమొత్తె

తే. గీ. శంఖనిస్వనమున గుహా ♦ శయనుడైన
హానుమ లేచి మార్గమ్మున ♦ కడ్డముగ బ
రుండి మృగములు వెఱచి ప ♦ ర్వులిడ జేసె
సత్త్వమేపార లాంగూల ♦ చాలనంబు.

వ. తద్ధ్వనివిని భీమసేనుండు విస్మితుండై సమీపించి యోగనిద్రనున్న హనుమంతుంగని నిద్రజెఱుప సింహనాదం బొనర్ప నాంజనేయుండును మేల్కని భీము ననాదరంబున జూచుచు నిట్లనియె.

నవరోజు — ఖండగతి

ప॥ నన్నేల మేల్కొలిపి — నాడ వీవెవ్వడవు
కన్నులగుపడ కేండ్లు — గడచి వృద్ధుడనైన॥ నన్నేల॥

అ॥ ప॥ ఉన్నబలమంతయును — సన్నగిల్లి కదల లే
కున్నాడ నిదురించు — చున్నాడ వానరుడ ॥నన్నేల॥

చ ర ణ ము

వెఱపింప నాబోటి — పేదమృగముల నిట్టు
లురక గర్జింప నగు — నే ధర్మమెఱుగకిటు

నరమాత్రులిచ్చోటు - దిరుగ వీల్గాను క్రి
మ్మఱును నామాటవిని - మనదలంచితివేని ॥స న్నె ల॥

తే. గీ. అనినవిని భీము డనె క్షత్రి ♦ యాన్వయుండ
పాండుతనయుండ విఖ్యాత ♦ బాహుబలుడ
వాయువరమున గొంతి గ ♦ ర్భంబునందు
బుట్టినట్టివాడ నను భీ ♦ ముడనియంద్రు.

క. తెరువిమ్ము నాకు లేదా
శరనిధి లంఘించి చనిన ♦ సామీరిగతిన్
ధరణీధరము న్నిన్ను న
బరువడి లంఘించి పోవు ♦ వాడ నటున్నన్.

తే. గీ. అంతపనియెందులకు వృద్ధు ♦ నైతి లేవ
జాల బోయెదవేని నా ♦ వాల మిావు
బాయద్రోచి పొమ్మను నంత ♦ బాండుసుతుడు
వామకరమున నెత్తగా ♦ వశముగాక
కరయుగమ్మున నెత్తి క్రమె ♦ గ్గతిలబడియె.

శా. లాంగూలమ్ముగదల్పనోపక కడున్ ♦ లజ్జించి కేలోడ్చి ని
ల్వంగాం తేయునకిట్లనె న్హనుమ పా ♦ రావారమున్ దాటి సీ
తంగన్గొన్న సమీరసూనుడను పా ♦ ర్థా! నేనె, పాటింపకీ
భంగం బిర్వుర మన్నదమ్ములము నీ ♦ పై ప్రేమగన్పించితిన్.

తే. గీ. సమరమున నర్జును రథ ధ్వ ♦ జమ్మునందు
నిలిచి మిామిాపరాక్రమం ♦ బులను జూతు
గాకయని భీముడేగు మా ♦ ర్గమ్ముసూపి
హనుమ డంతర్హితుండయ్యె ♦ నాక్షణంబ.

మంజరులు

ఆమార్గంబుననేగి కొలనుగని - యందలి సలిలము గ్రోలి
భీమసేనుడుం గోనెనాపైడి - తామరపూవుల నోలి
అదిగని కాపున్నయక్షరాక్షసు - లలిగి భీముపై బడగ
నదమదంబుగావించి యెల్లరన్ - సమీరతనయుడు వడిగ

తనకెదురువచ్చు ధర్మజాను లం - గని మ్రొక్కి ప్రమోదింప
తన తెచ్చిన కమలంబు కృష్ణకిడె - దన్నెల్ల రభినుతింప
నాసమీపమున బాండుతనయులు ని - వాసముగ నుండునంత
భూసుర వేషమున వారిగలసి జ - టాసురుండుండె నంత.

సీ. ఒకనాడు వేటకై ♦ బకవైరి వనికేగ
బలలాశి వికృత రూ ♦ పమ్ముదాల్చి
ద్రౌపదీనకుల ధ ♦ ర్మజులనెత్తికొని జ
వమ్మున బఱచె బా ♦ పలు భయపడ
రక్కసుం గరము భ ♦ రమ్మగానదిమె నా
కుంతీసుతాగ్రజుం ♦ డంతలోన
సహదేవు పిలుపున ♦ సామీరి సనుదెంచి
తనవారి విడిపించి ♦ దనుజుదాకి

తే. గీ. ఘోరయుద్ధంబు గావించి ♦ క్రూరదైత్యు
గెడపె ధౌమ్యాదులెల్ల ర ♦ గ్గింప నట యు
ధిష్ఠిరుడు వృషపర్వు నా ♦ దేశమునను
విడిసె నట మాల్యవద్గిరి ♦ విపినసీమ.

వ. అందు విహరించుచో నొక్కనాడు మారుతానీతంబై పంచవర్ణ సురభికుసుమంబొండు తమముంగటంబడిన విస్మయంబంది ద్రౌపది యేకాంతమ్మున భీమసేనున కిట్లనియె.

కన్నడ - ఆది

ప॥ పంచవర్ణ సురభి ప్రసూనమిది - ప్రాణనాథ లోచనపర్వంబగు॥సం॥
అ॥ప॥ మంచితావులలరించుతోంటెతా-మర పూవునకన్నను నినుమడిగా

చ ర ణ ము

ఈయపూర్వ రమణీయ ప్రసవమ్మ - లెన్నడేనెందు జూచియెఱుంగను
నాయభీష్టమీడేర్పవూసుమము-లేయెడంగలవో గొని తెచ్చియిచ్చి ॥ప॥

క. అనవిని వేగ ద్రౌపది మ ♦ నోభిమతంబాడ గూర్పనెంచి పా
వనిగిరిశృంగమెక్కి నలు ♦ వంకలగన్గొని శంఖమొత్తె, త

ధ్వనివిని యక్షరాక్షసులు ♦ దాకిరిభీము, రణమ్ము ఘోర మ
య్యెను మణిమంతుడాదిగ స ♦ మిద్ధపరాక్రము లీల్గిరెందరో.

వ. ధర్మజుండును భీము నన్వేషించుచు నాతనియొద్దకుంజనియె నటకు కుబేరుండు సనుదెంచి పాండవసత్కృతుండై భీమసేను సాహసంబు వారింపుమని ధర్మజుని వేడుకొని పోవ, బాండుకుమారులు కుబేరాదేశంబున నార్ష్టిషేణాశ్రమంబున నుండునంత జలధికుక్షిలో డాగి వేల్పులం గాఱించు నివాతకవచులను, కాలకేయాసులను పాశుపతాస్త్రప్రయోగమ్మున వధించి మహేంద్రునిచే నభేద్యకవచమ్మును మణికిరీటంబును వడసి మాతలిప్రయుక్తంబగు రథంబెక్కి నాకలోకంబుననుండి యర్జునుండు సనుదెంచి యెల్లరకుం గనుపండువు సేసె. అంత బాండవులు బదరీవనంబాదిగాగల పెక్కుచోట్లులం దిరుగుచుండ నొక్కనాడు భీముండు హిమవన్నగశృంగపరిసరారణ్యంబున నొక్క యజగరమ్ము చేతబట్టువడ, భీముంగానక వెదకుచు ధర్మజుం డయ్యెడకరుదెంచి చూచి యాశ్చర్యపడి భీమసేను వదలుమని వేడ నయ్యజగరం బిట్లనియె.

సారంగ - ఖండగతి

ప॥ వినుమయ్య నహుషుడను - జననాయకుడ నేను ॥వి॥
అ॥ ప॥ పౌనరమీ పూర్వులకు - పూర్వజుడ నోయనఘ ॥విను॥
1. శతమఖంబు లొనర్చి - శక్రత్వ మందితిన్
క్షితిసురులు మోయనౌ - క్కితిని బ్రహ్మరథంబు ॥వి॥
2. ద్విజుల నవమానించి - తి నటంచు శపియించె
నజగరము గమ్మంచు - నలిగి కలశభవుండు ॥విను॥

తే. గీ. పాండవాగ్రజ! నాచేయు ♦ ప్రశ్నములకు
నుత్తరంబిడ శాపాంత ♦ మొదవు నాకు
దమ్మని న్విడిపించుకో ♦ దలచితేని
వడి సమాధానమిమ్ము నా ♦ ప్రశ్నములకు.

వ. అనిన నియ్యకొని ధర్మజుంగని యేగుణంబులు గలవాఁడు బ్రాహ్మ ణుండు ? అతం డెఱుఁగందగిన వస్తువెయ్యది ? యని ప్రశ్నింప.

తే. గీ. సత్య దాన క్షమా తప ♦ శ్శౌచ దమద
యాగుణమ్ములు గలుగు వా ♦ డవనిసురుఁడు
సుఖము దుఃఖము సమముగా ♦ జూచుకొంట
వాని కెఱుంగ దగినట్టి ♦ వస్తువగును.

వ. అనిన నోధర్మజా! నీచెప్పిన సత్యక్షమాది గుణంబులు శూద్రునం దున్న శూద్రుండు బ్రాహ్మణుండగునే యని ప్రశ్నింప.

తే. గీ. శూద్రుఁ డాయా గుణముల స ♦ చ్ఛూద్రుఁడగును
గాక బ్రాహ్మణు డెన్నండు ♦ గా డతండు
దాన సత్యాది గుణములు ♦ లేని బ్రాహ్మ
ణుండు సైతము ధరణి శూ ♦ ద్రుం డనబడు.

వ. ఇట్లు సమాధానమ్ములు సెప్పి యనుజు న్విడిపించుకొని ధర్మజుండు వృకోదరుం డోడ్కొని తమ్ములంగలసి యవ్వనంబున సుఖంబుండి మార్కండేయు వలన సమస్తధర్మాధర్మంబు లెఱింగియనంతరంబు ద్వైతవన సరోవర సామీప్యంబునందు సద్యస్కందంబను యజ్ఞం బుసేయుచుండ నిట హస్తినా పురంబున.

సీ. రాజ్యభోగములంగో ♦ ల్పడి యరణ్యముల న
ల్లాడు పాండవుల గ ♦ న్నారగాంచు
తలపున ఘోషయా ♦ త్రావ్యాజమున వంధ
వసుధేశు నొప్పకో ♦ ల్వడసి కౌర
వాగ్రజుం దనుజు క ♦ ర్ణాదులం గలసి ద్వై
తవనంబు సొచ్చి గం ♦ ధర్వవిభుని
చిత్రసేనుండాక ♦ జెలగి గంధర్వులు
రణమున గర్ణాదు ♦ లన్నయిచ్చి

తే. గీ. కురునృపాలుని తెక్కలు ♦ విఱిచికట్టి
కొనకు గొంపోవు చుండ గ ♦ గ్గోలువడుచు

సైనికులు దిక్కు-నెడి ధర్మ ♦ జాతుకడకు
సత్వరమపోయి మొరలిడ ♦ సాగిరిట్లు.

శుభపంతువరాళి - చతురశ్ర

ప॥ శరణాగతరక్షణ బిరుదముగల - దొరవుధర్మరాజా రక్షింపుము॥శ॥
అ॥ ప॥ కురుకులేంద్రును పరివారముతో గొనిపోవుచుండిరయయో!
గంధర్వులు॥

చరణము

తలప గారణాంతరమున వైరము - గలిగెగాని కౌరవ్యవీరనుజులు
చెలిమిమీఱ విడిపింపుమావీరి - గలవెనీకు తెలియనిధర్మంబులు॥శ॥

తే. గీ. అనినవినిధర్మ భూపతి ♦ యనుజులగని
కౌరవేంద్రుబంధవిముక్తు ♦ గా నొనర్చి
సత్వరము రండన నొకింత ♦ సమ్మతింప
కా వృకోదరు డిట్లనె ♦ నగ్రజునకు.

క. అంధనృపాల సుతులుగ
ర్వాంధులు నీకేమి వెట్టి ♦ యా? విడిపింపన్
బంధము, కాగల కార్యము
గంధర్వులె దీర్ప మనసు ♦ కన్ శ్రమతొలగున్.

క. అడవులపాలై యిడుమలు
గుడుచు మనలగాంచినవ్వ ♦ గొనివచ్చిన యీ
వెడగు సుయోధనుగర్వ
బడగెన్ దయదలపనేటి ♦ కన్నా! మనకున్.

వ. అనవిని ధర్మజుం డిట్లనియె.

ఉ. కలహములుండుగాక వెను ♦ కన్మనలో ననకెన్నియేని, యం
న్యుల వలనం బరాభవము ♦ నొందు నెడన్ మన మూరకుంట కే
వలమును లోకనింద్యమగు, ♦ బాడిగదా శరణాగతావనం
బిల? నటుగావునం గురుకు ♦ లేంద్రుని బంధవిముక్తుజేయుడీ.

వ. అనిన విని భీమసేనుం డిట్లనియె.

సీ. నిదురించు ననుగట్టి ♦ నీట ద్రోయించి గా
ఱించి పాముల గఱ ♦ పించినారు
వెస నన్నమందున ♦ విసము గల్పించి పె
ట్టించి చంపింప నూ ♦ హించినారు
మొగి వారణావత ♦ మ్మున లక్క యింటిలో
నుంచి నమ్మించి కా ♦ ల్పించినారు
జూదమం దోడించి ♦ సుదతికి జీర లో
ల్పించి కానడవి కం ♦ పించినారు

తే. గీ. తివిరి వారెగ్గు సేయని ♦ దినము కలదె?
వారిచేత లెవ్వియు దలం ♦ పఫ్టు గదన్న ?
యొక్కనిముస మోపికవట్టి ♦ యుండు మట్లు
గానిచో గార్యహానియగా ♦ గాదె ? మనకు.

వ. అనవిని యజాతశత్రుండు సాంత్వనపూర్వకమ్ముగా నిట్లనియె.

చ. శరణని వేడుచో రిపుని ♦ సైతము బ్రోచుట శూరధర్మ, మా
కురుపతి తమ్ము పాండవులు ♦ గొబ్బున గాతురటన్న యాశతో
నరయును, పోదమన్న జెడు ♦ నధ్వరదీక్షయుక్తు నన్ను జూచి వీ
రరిగి సుయోధనున్ విడుపరయ్య! యశంబును బుణ్యమబ్బెడున్.

వ. అనిపల్కు ధర్మనందను పలుకు లతిక్రమింప నేరక భీమార్జున నకుల సహదేవులు తక్షణంబ గంధర్వులం దగిలి ఘోరయుద్ధం బొనర్చి సైన్యసమేతమ్ముగ చిత్రసేను నోడించి కౌరవుల్లర్గ నగ్రజునొద్దకు [illegible] ధర్మజుండును సంతసించి బంధమోక్షణంబు గావించె [illegible] లజ్జితుండై చెదరిన సేనలం గూర్చుకొని [illegible] విషాదయుక్తుండై [illegible]

ధన్యాసి - రూపకము

ప॥ ఎంతటియవమానము ఘటి - యించె నేటికి ॥నా॥ కెం॥

అ॥ ప॥ కాంతాజనసహితముగా గంధర్వులు బంధించి ॥రెం॥

చరణము

పాండవేయులే ననుగా - పాడవలసి వచ్చెనా ?

యుండినై జగాన బ్రతికి - యుండవలసి వచ్చెనా ? ॥ఎం॥

సీ. జనకుడు వలదన్న ♦ విన కా వనమ్మున
కేగెడుబుద్ధి నా ♦ కేల గలిగె ?
గలిగెబో సురనాథు ♦ కొలనిగట్టున నట్లు
క్రీడాగృహముల ని ♦ ర్మింపనేల ?
నిర్మించితినిబో, వి ♦ నీతిబాసి వియచ్చ
రాళిపై గవిసి పో ♦ రాడనేల ?
పోరాడితినిబో, వి ♦ ముక్త జీవుడగాక
యేటి కీ తక్కువ ♦ పాటువడితి ?

తే. గీ. నకట ! పోడిమిసెడి లోకు ♦ లపహసింప
నే మొగమ్మున బురమున ♦ కేగువాడ
బలుమరు పరాభవమున కా ♦ స్పదముగాగ
రాచకొలమున నొగి బుట్ట ♦ రాదు గాదె ?

వ. ఇట్లు విషాదవివర్ణుండైయున్న దుర్యోధనుకడకు గర్ణుండుసేరి యిట్లనియె.

చ. అలసట సుంతయేని గన ♦ వా ఖచరాధిపు నెట్లు పోరిలో
గెలిచితివోయి ! చేయదగు ♦ కృత్యము సుంతయు దోచకుంటచే
దొలగితి నేనుసైతము నె ♦ దుర్పగజాలక చిత్రసేను, నీ
బలము బరాక్రమంబు గురు ♦ వల్లభ ! వెల్లడియయ్యె నేటికిన్.

వ. అనినం గురుపతి లజ్జితుండగుచు రాధేయున కిట్లనియె.

చ. అరులజయించి వచ్చితి న ♦ టంచు దలంచి నుతించుచుంటి వీ
వెఱుగక నేడు నాపడిన ♦ హీనపు బాటు, నిజాంగనా సహో
దర సహితమ్ముగా ఖచర ♦ తండము నన్గొనిపోవుచుండ స
త్వరమరుదెంచి బంధమెడ ♦ బాపిరి నన్గరుణించి పాండవుల్.

వ. ఇట్టిదురవస్థకుం బాలైన నేను ప్రాయోపవేశమ్మున ప్రాణత్యాగం బొనర్తుననుచు గర్ణాదులు వలదని బ్రతిమాలినను వినకున్న నాటి రేయి దుర్యోధను నొక్క కృత్య పాతాళంబునకుం గొనిపోవ నచటి దైత్యులు వానిం గాగిలించుకొని సంభావించి ధైర్యమ్ము సెప్పి మఱల కృత్యచే నెప్పటిచోట నిలుప ప్రభాతంబగుడు ప్రాయోపవేశము న్మాని యెల్లరం గలసి కురుపతి కరిపురంబున కేగె.



శ్రీ

# మహాభారతము

## సైంధవపరాభవము

భైరవి - ఆది

పII వినుడు సైంధవపరాభవచరితము - వినిపించెద నేడు ... వీనుల విందుగ

అII పII కనుడు సంసార వార్ధి దాఁగడచి-యనుపమాన కైవల్యానందము ॥వి॥

చరణము

దురితమనక పరకాంతారతులై - చరియించిన మానవులకు సతతము
పరిభవమ్ము దుర్యశము గల్గు, ద-ప్పదు సైంధవుడే సాక్షీభూతుడు ॥వి॥

సీ. పాండుపుత్రులు ద్వైత ♦ వనమును వీడి కా
మ్యకమున దృణబిందు ♦ నాశ్రమమున
వసియించు చోకనాడు ♦ పాంచాలి కా ధౌమ్యు
సాయముంచి వనంబు ♦ సనిరి వేట
కా ద్విజుండు సమిత్కు ♦ శార్థమై యందంద
సంచరించుచునున్న ♦ సమయమందు,
సైంధవోర్వీపతి ♦ సాల్వకన్యను బెండ్లి
యాడ వైభవమున ♦ నరుగు నచట

తే.గీ. నాశ్రమద్వారమున గృష్ణ ♦ నరసి మోహ
పడ సమీపించి కుశలమ్ము ♦ లడిగి బంధు
భావమున నాదరించు రాఁగ ♦ జీవనేత్రి
కిట్లు లనియెను కామిత్వం ♦ బెఱుకపడగ

దనన్ లరుదెంచి యాశ్రమము ♦ నం ద్రౌపదిం జూచి బరిచారికాముఖ
మ్మున గలసర్వముం దెలిసి ♦ పోయి జయద్రథు డేగు వంకకున్.

వ. ధౌమ్యుం గని నమస్కరించి యొక్కచో నిలిపి సైంధవసేనవయిం బడి సింహనాదంబులు సేయునెడ సింధుపతి ద్రోవదిం గని "వీరా నీమగలు? వీరిలో నెవ్వడెవ్వ డేవిధము వాడో చెప్పుమని" యొక సక్కెముగ బలుక బాంచాలి యిట్లనియె.

సీ. బంగరుమైఛాయ ♦ వాడు ధర్మసుతుండు
శరణాగతత్రాణ ♦ బిరుదు డతడు
దశనోష్ఠపీడనం ♦ బెసగువా డనిలజుం
డతని కోపాగ్ని స ♦ ల్లాఱ దెపుడు
ధనువు చేగొని వచ్చు ♦ ఘను డాతడే సవ్య
సాచి దుష్టుల గన్న ♦ సైప డతడు
రూపనిర్జిత పంచ ♦ రోపుండు నకులు డీ
వ్వాడు సజ్జన బాంధ ♦ వ ప్రియుండు

తే. గీ. దేవసన్నిభు లా సహా ♦ దేవు డిప్పు
డెఱిగి యేమి? రొలుగకున్నా ♦ నేమి? కీ పతిత
నుగ్ర మకరాహతుం బగు ♦ నోడవలె న
శింతు వీ వింక వీరిచే ♦ సేనతోడ:
[illegible] మాం జరోతా

అని పలుకుచు నున్నంత బాండునందనులు సేనం దలపడి. వినిశిత బాణములు శేయు దొడంగిన - గినిసి సైంధవుడు దురుపడి బీరమున త్రిగర్త శిబి సింధు సౌ - వీర సైన్యపరివృతుడై ఘోరాహవమున నిల్చె నవిశ్రాంతము - కుంతిసు దర్పోద్ధతుడై తుముల మ్మధిక మ్మయ్యె గీలాలపూ - రము మాంసపంకమగుచు సాగె నాంగణమెల్ల వాహినిం బలె - ననుకరి భయానక మ్మగుచు వెఱచి జయద్రథుడు ద్రోవదిని దిగ - విడిచి రథము దోలుకొని పఱచె నంత భీమార్జును లుడుగక - తేఱిమి రాతని వెనుక్తొని

క. మణులో, విలసిత యువతీ
మణులో, వర వాహనములొ ♦ మాన్యంబులొ, గో
గణమో, కోరు మొసంగెద
నణుమాత్రము సంశయింప ♦ కవనీదేవా !

వ. అనిన విని కృతక భూసురుండును

క. ఒండేమి వలదు కవచము
గుండలము లొసంగుమయ్య ♦ గాని చనియెద దృ
ప్తుండ నయి నీ యశము బ్ర
హ్మాండంబున దానశౌండ ♦ డని నిండుకొనన్.

క. అన విని కానీనుం డనె
ననఘా ! సురపతివి నీవ ♦ టం చెఱుగుదు నై
న నొసంగెద నీకడ గల
ఘనశక్తిని నాకొసంగి ♦ గైకొను వీనిన్.

వ. అని పలుకుచు కవచకుండలమ్ము లొలిచి యిచ్చిన సంతసించి వాసవుండును కర్ణశరీరంబు సూర్య దీప్తిం జెలువారుదున ట్లనుగ్రహించి, తన యమోఘశక్తి నొసంగి దీని నాపత్కాలంబున దుర్జయుండగు నొకశత్రునిపై బ్రయోగింపు మతని వధించి నన్ను జేరునని చెప్పి స్వర్లోకమ్మున కరిగె నది యెఱింగి కౌరవులు విచారించిరి. పాండుకుమారులు సంతసించి మఱల ద్వైతవనంబున కరిగి యందుండ నొకనా డొక్క బ్రాహ్మణుని యరణి నొక మృగమ్ము కొమ్మునం దగిల్చికొని పఱచిన నద్ధరామరుం డది ధర్మజున కెఱింగింప దమ్ములుం దానును చాపహస్తులై తన్మృగము న్వెన్నంటి పెందవ్వు వెడలి యొక్కచో నాహారిణం బదృశ్యంబైన విషాదమ్ముఁదును నతిశ్రాంతులై యొక్క వటవృక్షంబు నీడ విశ్రమించి యత్యంత పిపాసితులై జలంబులు దెమ్మని నకులు నంప, నతండును ముందట నొక తటాకముంగని యందలిజలంబులు ద్రావబోవ నొక్క యశరీరభూతం బిట్లనియె.

మోహన - రూపకము

ప॥ ఆ సరోవరము నాయెది - యందలి సలిలము గ్రోలకు ॥మా॥
అ॥ప॥ నా సంప్రశ్నములకు సరి - గా సమాధాన మిడుపటి ॥కో॥

చరణము

బలిమిం జొచ్చిన వారలు - ప్రాణంబులు గోల్పోదురు
వల దీ సాహసము నీకు - వచ్చిన దారిం బొమ్మిక ॥యా॥

చ. అన విని యాదరింపక యె ♦ యా సలిలమ్ముల గ్రోలి తీర మ్మం
దున బక జేతసత్వమటి ♦ తోడనె ధర్మసుతుండు పిన్న త
మ్ము నకుప నాతడయ్యెడకు ♦ బోయి సహోదరుజ్మాచి గుండ్యోచుం
బనివడి నీరు ద్రావి ధర ♦ పై నొఱగెన్ సహజన్ముపోలికన్.

ఆ. వె. మాద్రికొడుకు లట్లు ♦ మసలుట గని స్వంత
పించి ధర్మసుతుడు ♦ విజయు ననుప
వాడు పోయి తొంటి ♦ వైఖరి నీర్ద్రావి
పుడమి నొఱగె ద్రవటు ♦ వడినచోటు.

క. కవలుం గవ్వడి మసలుట
బవమానతనూజు ననుప ♦ వా డరిగి మహో
జవమున జలముల గ్రోలియు
వివశుండై పడియె సాల ♦ వృక్షము వోలెన్.

క. తమ్ములు మసలుటకుం గత
మెమ్మెయి గనలేక ధర్మ ♦ నృపుఱుం జని తీ
రమ్మున బడియున్నం గని
బమ్మెరపడి సూచి కొంత ♦ వడి కిటు వగచెన్.

సావేరి - త్రిపుట

ప॥ కటకటా! నాతమ్ము లిటుబడ - గారణం బేమొకో తెలియదు ॥క॥
అ॥ ప॥ కుటిలకర్ములు ధార్తరాష్ట్రులు - ఘోరమేమొనిం సేతురుగాద ॥కట॥

చరణము

తమ్ములేరి యని కుంతి యడుగ - దాని కేమి సమాధాన మిడుదు
ని మ్మహాటవి కప్పగించితి - నిట్లు చివరకు తమ్ములగుట్టల ॥కట॥

ఉ. వాఁడవు వీరిమోములు ర ♦ వంతయు, వైరులతోఁ గూడి పో
రాడిన జాడ గానబడ ♦ దక్షతము ల్సకలాంగకమ్ము, లీ
కీడొనఁగూడ నేఁడు పరి ♦ కింపఁగ హేతువు దోఁచ దెంతయుం
జూడఁగ నీజలమ్ము పరి ♦ శుద్ధముగాక విషాన్వితంబొకో!

వ. అని వగచి దప్పికొఱ్ఱక నీర్ద్రావ యత్నింప నయ్యశరీరభూతంబు బకరూపంబు ధరించితా నొకయక్షుండ నని పలుకుచు వారట్లు పడుటకుం గత మెఱింగించి తనప్రశ్నంబుల కుత్తరంబు సెప్పుమన ధర్మజుం డొడంబడె నంత వారిరువురకు నిట్లు ప్రశ్నోత్తరంబులు జరిగె.

సీ. నలినాప్తు నెయ్యది ♦ నడపును? బ్రహ్మంబు,
రవి గ్రుంకి తిరుగుదు ♦ రెవరు? సురలు
తపను నస్తమయ మె ♦ ద్దాన? ధర్మమున, భా
స్కరున కెయ్యది యూత? ♦ సత్యనిరతి,
శ్రోత్రియుం డగు బుధు ♦ డుం డెట్లు? శ్రుతమున,
మెలగును మహిమ నే ♦ మిట? తపమున,
నతనికిని సాయమె ♦ య్యది ? ధృతి, నతఁ డెట్లు
బుద్ధిమంతుండగు ♦ బుధులసేవ,

తే. గీ. ద్విజున కమరత్వ మిడు నెద్ది? ♦ వేదపఠన,
మతని నెది సాధువుం జేయు ? ♦ వ్రత నియమము,
నెఱి నసాధువెట్లగును? త ♦ న్నియతి లేక
మానుషుం డెట్లగున్? శౌచ ♦ మార్గ మెడలి.

సీ. ఎవఁడు జీవన్మృతుం ? డిల ♦ దేవ పితృభృత్య
కోటికిం బెట్టక ♦ కుడుచు నతఁడు,
పృథివికన్నను భార ♦ మెది ? తల్లి, యాకస
మ్మునకన్న నెయ్యది ♦ పొడవు ? తండ్రి,
గాడ్పుకంటెను వడి ♦ గలదెయ్యది ? మనస్సు,
కడు దట్టమెది పూరి ♦ కన్న ? చింత,
కనుమూయకే నిద్ర ♦ గను నెద్ది ? మీను, జ
న్మించి ప్రాణము లేని ♦ దెద్ది ? గ్రుడ్డు,

తే. గీ. హృదయరహిత మెయ్యది రూప ♦ మొనసి ? రాయి
వేగమున బొందు నెయ్యది ♦ వృద్ధి ? యేఱు,
తిరుగు నెల్లపు డెవ్వ డొం ♦ టరిగ ? నినుడు,
మాటిమాటి కెవ్వఁడు బుట్టు ? ♦ మరునిమామ.

సీ. పథికున కాప్తు లె ♦ వ్వరు ! వర్తకులగుంపు,
గృహమేధి కెవ్వండు ♦ హితుడు ? భార్య,
రోగి కెవ్వఁడు మి ♦ త్రుం డగు ? వెజ్జు, మి
త్రం బెద్ది మృతునకు ? ♦ ధర్మగుణము,
కుదురు ధర్మమునకె ♦ య్యది ? దయ, కీర్తి కా
ధార మెయ్యది యగు ? ♦ దానగుణము,
సురలోకమున కెద్ది ♦ తెరువు ? సత్యంబు, క
ల్పించు సుఖం బెద్ది ? ♦ మంచినడత,

తే. గీ. మానవున కాత్మయెవఁడు ? కు ♦ మారు, డతని
బ్రతుకు తెరు వెట్లు సెల్లు ? ప ♦ ర్జన్యుకతన
ననఘ ! యుత్తమధర్మ మె ♦ య్యది ? యహింస,
యుండు నెది పండి యెపుడును ? ♦ యోగ మదియ.

సీ. ఆశ్చర్య మెయ్యది ♦ యగును ? చచ్చిన వారి
గని తాము సుస్థిరు ♦ లని తలచుట,
వర్తించు పురుష శ ♦ బ్దం బెవ్వనికి ? కీర్తి
మిను ముట్టి భువిని నిం ♦ డిన యతనికి
ముదమంద మానవుం ♦ డెది వీడి యగును స
ర్వజన ప్రియుండు ? గ ♦ ర్వంబు వీడి
తగు నెవ్వనిన్ సర్వ ♦ ధనియన ? సుఖదుఃఖ
ములపట్ల సమబుద్ధి ♦ గలుగువాని

తే. గీ. జగతి కెయ్యది దిక్కు ? స ♦ జ్జనులు సూర్యు
యంబు వెయ్యెడ నుదయించు ? ♦ నాకసమున
నన్న మెయ్యెడ నుదయించు ? ♦ నవనియందు
విషమనందగు నెయ్యది ? ♦ విప్రధనము.

వ. అని చెప్పినవిని సంతసించి యక్షుండు ధర్మజుంగని.

కేదారి - ఖండగతి

ప॥ భళి, భళీ, రాజేంద్ర - భవ్యగుణ గణసాంద్ర ॥భ॥

అ॥ ప॥ లలి నీసమాధాన - ములు మెచ్చు వచ్చె మే ॥భళి॥

చరణము

చచ్చిపడియున్న నీ - సహజన్ములం దొకని
సచ్చరిత ! బ్రతికించి - యిచ్చెద న్వేడుమా ॥భళి॥

తే. గీ. అనిన విని ధర్మసంభవుం ♦ డట్టులైన
నకులు బ్రతికింపు మని వేడి ♦ వం గరంబు
సొత్తసిల్లి యక్షు డనె, బల ♦ శాలురైన
భీమపార్థులవిడి వీని ♦ వేడ నేల ?

వ. అన విని ధర్మజుండును.

ఉ. ఆనతవైరి పాండువిభు ♦ డాతని కిర్వురు భార్య, లందు కుం
తీనలినాక్షి కాన్పునకు ♦ నే మనియుంటిని పెద్దవాడ ని
ట్లే నకులుండు గూడ దగ ♦ డే మనియుండగ మాద్రికన్న సం
తానమునందు ? ధర్మమును ♦ దప్పదు నామన మెన్న డేనియున్.

చ. అన విని యక్షుడిట్లనె జ ♦ నాధిప ! నీదగు ధర్మబుద్ధికిన్
ఘనతగ మోదమందితిని ♦ నల్వురు తమ్ములు లబ్ధజీవులై
మనుదురు, మిమ్మెఱుంగరుజు ♦ మా ! పదుమూడగు నేట నేడనుం
డిన నెవరున్ వర్ణం బిడితి, ♦ నే యము డన్నినుఁ జూడవచ్చితిన్.

వ. అని పల్కి యా హాదిణాకహ్యాలం బగు సరణి నొసంగి యంతర్ధానం
బయ్యె నంతలో సజీవులై నిద్రనుండి మేల్కొనినట్లు భీమార్జున
నకులసహదేవులు లేచినం గని ధర్మజుండు సంతసించి సోదర
సహితుండై చని బ్రాహ్మణున కరణి నొసంగి పరమేశ్వరకటాక్షమ్మున
గష్టసముద్రమ్మం గడచి గొట్టైకీ - యరణ్యావాసదీక్షం బూరి
గావించి యజ్ఞాతవాసంబు సలుప యత్నింపుచు వెంటనున్న
ధౌమ్యాది భూసురోత్తముల వీడ్కొల్పి యాందునకరం జనుచు
సుఖమ్మున నుండె.

శ్రీ

# మ హా భా ర త ము

## కీ చ క వ ధ

పూర్వకల్యాణి - ఆది

ప॥ కీచకవధా కథావిధాన మెఱి - గింతు నేడు వినుడు ముదంబిడు ॥కీ॥

అ॥ప॥ ఆ చపలుడు పాంచాలినాశించి - యనుజన్మున మేతముగా నశించె॥కీ॥

చ ర ణ ము

పాండవేయు లజ్ఞాతమొనర్పగ - బయనమైరి, విరాటపురమునకు
చండాయుధములనన్నింటిని నొక్క - శమీవృక్షమున న్వ్రేలంగట్టిరి ॥కీ॥

తే. గీ. నరునకును ధర్మనందను ♦ నకును నక్క-
ఱరులకు భయంకరముగ న ♦ హోరగముల
యట్టు లగుపట్ట వవ్విప ♦ మూర్ధమునను
యమతనూజుండు శాసించె ♦ నాయుధముల.

వ. అంత ద్రౌపదీసహితమ్ముగ బాండవులు మత్స్యదేశమ్ము సొచ్చి యయ్యెడం బ్రవర్తింపదగిన విధానమ్ము లెఱింగింపుకొని విరటపురంబు ప్రవేశించి విరాటుకడ సేవావర్తనంబున మెల్లంగదలంచి.

సీ. యతివేషమున గంకుఁ ♦ డను పేర ధర్మభూ
విభుడు విరాటు సే ♦ వింప దొడగె
వలలనామమున బా ♦ వని సూపకారుడై
కుదిరె మత్స్యాధీశు ♦ కొలువునేయ
నలరె బృహన్నలా ♦ ఖ్యం గ్రీడి పేడియై
యువతి కన్నియలకు ♦ నాట్యగురువు

తనరె దామగ్రంథి ♦ యన నకులుండు భూ
నాథు తురంగ శా ♦ లాధిపతిగ

తే. గీ. నాలకాపరిగానుండె ♦ సచట మాద్రి
పిన్నకొడుకు తంత్రీపాలు ♦ డన్న పేర
రాణికడ మాలినియనం జె ♦ లంగె కృష్ణ
యొరులెఱుగకుండ సమవర్తి ♦ వరబలమున.

సీ. సర్వసర్వంసహా ♦ చక్రరత్నణము సే
యందగు తేడు స ♦ న్యాసియయ్యె
కరఘాతమున మేరు ♦ గిరినే నుఱుము సేయ
గల దోర్బలుడు సూప ♦ కారుడయ్యె
శీతాంశుమౌళి గె ♦ ల్చినజోదు బుగ్గపై
వ్రేలిడుకొని యాడు ♦ పేడియయ్యె
మహనీయ శతకోటి ♦ మదన సౌందర్య వి
గ్రహు డట్లు గుఱ్ఱాల ♦ రాయ డయ్యె

తే. గీ. తలకి కలననిశీలముం ♦ దప్పబోని
పుణ్యవర్తను డటు ♦ గొల్లబోయడయ్యె
వాసిగాంచిన దొరసాని ♦ దాసి యయ్యె
గటకటా! యేమనగ వచ్చు ♦ కాలమహిమ?

క. పాండుకుమారులు విరటుని
దండ నుచితవృత్తి మెలగు ♦ తరినొకనాడు
ద్దండ బలశాలి యగు మ
ల్లుం డొక డరుదెంచి భూవ ♦ రుం గని పలికెన్.

కన్నడ – జంపె

ప॥ మల్లయుద్ధమున నను – మార్కొని జయింపగల
మగవాడు లేడందున – యీభూమండలమున ॥మ॥

అ॥ ప॥ కల్లగా దెందటినో – మల్లుల జయించి నే
గైకొంటి బిరుదు లె – న్నని భూవలభా ॥మ॥

చ ర ణ ము

నీకొలువునందు న - న్నెదురగలవా డున్న
నిలుపు మీక్షణమునందు - నిర్మూల మొనర్చెద ॥నీ॥
లేకున్న జయపత్ర - మిచ్చిన నస్వంపు మా
లేరు లేరంచు ము - మ్మారు వాకొని వేగ ॥మల్ల॥

క. అని పల్కు వాని యాకృతి
ఘనతరవక్షమ్ము, మేని ♦ కండల బిగువుం
గని నివ్వెఱపడు జేనిం
గనుఁగొని ధైర్యమున నిట్లు ♦ కంకుం డనియెన్.

చ. కలడుగదా నృపా! విదిత ♦ కాయుడు మీకడ బానసీడుగా
వలులడు, వాడు వీనిగెలు ♦ వంగల, డాతని దోర్బలమ్మునే
దెలిసితి ధర్మసూనుకడ ♦ దెల్లముగా నొకనాడు; కావునం
బిలువగ బంపుమా బలియు ♦ వేగ జయింపగలాడు మల్లునిన్.

వ. అనిన విని భూపతి పానిం బిలువనంప వలలుండును సనుదెంచి రాజాజ్ఞం గొని మల్లున కెదురై నిలిచి భుజాస్ఫాలనం బొనర్చి కలియంబడి యొక్కింత పోరాడి కడకు గాసెంబట్టి కాల్సేతులు వ్రేలంబడునట్లు ముష్టిబలంబున నెత్తివైవ నార్చుచు ముక్కున నెత్తు రొలుక నేలంబడి యమ్మల్లుండును డిల్లపడి చరణాక్రాంతుడై బీరమ్ము సెడి రాజసభనుండి తొలంగి చనియె. విరాటుండును వలలుని బలంబునకు మెచ్చి యగ్గించుచు నిజనివాసంబునకుం జనియె. పాండునందను లట్లు కొన్ని దినంబులు కొఱతగా వత్సరకాలంబు గడపునంత నొక్కనాడు రాజశ్యాలకుండగు కీచకుండు తన యక్క సుధేష్ణకు మ్రొక్కం జనుదెంచి, నిదురించు నామెకు సమీపమ్మున నున్న ద్రోవదిం గని మోహపరవశుండై

మోహన - రూపకము

ప॥ కలరే లోకమున నిట్టి - చెలువముగల పూబోడులు ॥క॥
అ॥ప॥ వలపుల వర్షించెడి యీ - కులుకులాడి యెవ్వతెయో ॥కల॥

చ ర ణ ము

చారు జలధరాచ్ఛాదిత - చంద్రరేఖవైఖరి నీ
నారీమణి కోడు మాసిన - చీర గట్టు హేతువేమొ ॥౬॥

సీ. కనుగీటి చూచెనా ! ♦ కాముడే యగుగాక
మతిమాలి తా బ్రతి ♦ మాలకున్నె ?
చిఱునవ్వు నవ్వెనా ! ♦ కరిముఖుండా గాక
యిక బెండ్లికై తత్త ♦ రింపకున్నె ?
చెఱగు దాకించెనా ! ♦ పరమహంసయోగాని
యంగలార్చుచు శివా ♦ లాడకున్నె ?
నిలిచి మాటాడెనా ! ♦ నలువయైనను సరే
సృష్టి యేమటి చిందు ♦ లేయకున్నె ?

తే. గీ. తలిరు విల్కాని వాడి పూ ♦ ములుతు లైదు
ముద్దగా జేసి కరగించి ♦ పోతబోసి
యమృతముం జిల్క స్త్రీ రూప ♦ మమర జేసె
గాని చో నిట్టి యువతి జ ♦ గాన గలదె.

క. అన్ని మెచ్చి నెమ్మనంబున
మనసిజ శరాగమున నొకట ♦ మైమఱచుచు మె
ల్లన నయ్యుగ్మలి కడకుం
జని యభిమత మొలుకపలుప ♦ సైరంధ్రి యనెన్

క. సిరులెల్ల దఱుగు, గలుగును
పరిభవ, మాయువు న ♦ శించు, వైరము లెసగున్,
నరకావాసము జేకురు
బరకాంతల గవయుటన్న ♦ పాపముగాదే ?

తే. గీ. తలవిరియబోసి శివశక్తి ♦ వలె నగుపడి
చెలువ మెడబాసి మాసిన ♦ వలువగట్టి
దాసి నగు నన్ను బ్రేమింప ♦ దగునె నీకు ?
వ్రతము చెడ్డను ఫలమైన ♦ బడయవలదె ?

వ. అనవిని సింహబలుండును,

తే. గీ. పరసతీసంగమమున సం ♦ ప్రాప్తమైన
పాపమున కోరుతును గాని ♦ పచ్చవిలుతు
వాడితూపులతాకు నో ♦ ర్వంగజాల
ననుచు దరికొన సైరంధ్రి ♦ యనె నదల్చి.

బిలహరి - త్రిశ్రగతి

ప॥ ననుఘుట్టకు పతివ్రతను - చెనటీ! దూరముగనుండుము ॥నను॥
అ॥ప॥ అనఘుడవై మనరా నీ - కాడుబుట్టువులు లేరా ॥నను॥

చ ర ణ ము

అందని పెనుమ్రాకుల పం - డ్లాశించిన లాభమేమి
మ్రందరె పరసతుల గోరి - రావణాదు లెంద ఱందరో ॥నను॥

మ. అతులారాతిమదద్విపప్రకర హ ♦ ర్యత్యాభదోర్విక్రమా
ప్రతిమానూనసము జ్వలామలయశః ♦ ప్రాకట్య స చ్చంద్రికా
తతసంపూరిత దిగ్దిగంతరులు గం ♦ ధర్వు ల్సుమా మత్పతు
ల్నతలోకత్రయు లేవురుం గినియ మా ♦ న ప్రాణము ల్దక్కునే?

క. అని పల్కి చివాలున నే
గిన సేయునదేమి లేక ♦ కీచకు డట వే
ల్కనియున్న యక్క చెంతకు
జని సుమశరతాప మోర్వ ♦ జాలక పలికెన్.

ధన్యాసి - రూపకము

ప॥ అక్కా! యాచిన్నది యెవ - రక్క యదేర్పక యె ॥నక్కా॥
అ॥ప॥ చక్కెరవిల్కాని నిశిత - శరములపాల్జేసి చనియె ॥నక్కా॥

చ ర ణ ము

నేనెంతగ వేడుకొన్న - నించుకయును దయజూపదు
నేనీతమ్ముడగావున - నీవైనం జెప్పిచూడు ॥న॥

క. అనిన విని సుధేష్ణయు త
మ్మునిమూర్ఖత మాన్ప దలచి ? బుద్ధులు సెప్పన్
వినకున్న గడకు చా వె
ట్లును పీనికి తప్పదంచు ♦ రూఢిగ బలికెన్.

తే. గీ. ఎంత జెప్పిన వినవు ర ♦ వంతయేని
నీకు దప్పదు చావు కా ♦ నిమ్ము నేడు
మధురసమ్ము దెమ్మంచు నీ ♦ మందిరమున
కంపుదును జాని దీర్చుకొ ♦ మ్మభిమతమ్ము.

వ. అనిన విని కీచకుండు సంతసించి నిజసదనంబునకుం జని నానావిధ మధురసంబు లొనరించి తానున్న ప్రదేశంబును విజనంబు గావించి పాంచాలి రాక కెదురుసూచుచు విరహతాపంబున జిత్తం బుత్తల పడ నేమియుందోచక కాముం దిట్టుచు, సోముం దెగడుచు, మల యానిలు నిరసించుచు బడరాని వేదనం బొఱలుచు, నడుమనడుమ జీమచిటుకు్కమన్న సైరంధ్రి వచ్చెనని పరిభ్రమించుచు బహువిధ ప్రలాపంబులం బ్రొద్దుబుచ్చుచున్నంత సుధేష్ణా ప్రేరితయై కట్ట కడకు రాక తప్పనిసరియై యొక్క కాంచన చషకంబుం బుచ్చు కొని, కనుదమ్ముల నశ్రులు వెల్లిగొల్ప, విపన్నివారణమ్ముగ హరి స్మరణం బొనర్చుచు, భగవత్కటాక్షమున దన్నుం గాన నదృశ్యా కారుండై యొక్క రక్కసుండు వెన్నంటిరా, జని చని బెబ్బులి యున్న పొదం జొచ్చు లేడి చందంబున ద్రోవది సింహ బలు మందరంబు సొచ్చి నిజాగమన కారణం బెఱింగించి మదిర వోయింపు మన నాతం డప్పలుకు పెడసెవిం బెట్టి బలాత్కార మ్మున పయింబడి తన్నంట యత్నించుచుండ, దన్గావ వచ్చిన దనుజసహాయమ్మున విదల్చి యాజ్ఞసేని విరాటుని కొలువుకూట మ్మువంకకు బరువిడుచున్నంత, గీచకుండును బిడాలంబు శారి కపై బడువడువున పాంచాలిపై బడి తల నొడిచిపట్టి తన్నాసినీ రక్షకుండైన రాక్షసునిచే ద్రోల్ల ప్రేయంబడి యొకంతకు తేచి విస్మయపడి కోపంబుగదుర నకాంత న్వెన్నంటి కొలువుకూటమ్ము వంకకు వచ్చుచున్నంత నయ్యెడ సూచి పవనతనయుం డంత్యకా కారుండై కోపాటోపమ్మున నాచేరువనున్న యొక్క యున్నత వృక్షమ్మును డాసి ధర్మజుదెసం జూచుచున్నంత యుధిష్ఠిరుండును కనుసన్న న్వారించి యిట్లనియె.

మ. వల దా వేగిరపాటు తీయునగు మే ♦ ల్పండ్లిచ్చు శాఖోప శా
ఖల నల్దిక్కు-ల విస్తరించి ఘనమా ♦ ర్గ(శ్రాంతి జేకూర్చు బాం
ధులకావృక్షము; వంటకట్టెయల కెం ♦ దు న్వ్యాజము ల్లేవొకో?
వలలా! నీబల మా కుజమ్ముపయి జూ ♦ పం బాడిగా దాగుమా?

క. అని పల్కి- ధర్మనందను
డనిలజుకోపమ్ము సెటిచె ♦ నాలోనవె కొ
ల్వున కేగుదెంచి ద్రోవది
జనవిభుం బతులు వినగ ♦ జయ్యన బలికెన్.

సావేరి - ఆది

ప॥ కంటిరే సభికులార నన్ను వె-న్నంటివచ్చుతుంటరి నీకీచకు ॥కంటి॥
అ॥ ప॥ కొంచెతనముమాన్పకీకరణి మీావంటివార లూరకుంటధర్మమె॥

చరణము

నానావిధశస్త్రాస్త్రవిదులు గం - ధర్వులేవురున్నారు నామగలు
కానరైరి నాదిక్కు- తమకు-గానియటు లూరకున్నా రిందఱు॥కం॥

ఉ. పాయక ధర్మభంగమగు ♦ పట్టున సక్రమబుద్ధి గల్గు భూ
నాయకు లెందు దండనము ♦ నం గలుపాత్ముల నొంచుటల్ నృప
న్యాయపథంబు; కీచకు దు ♦ రాగత మిఱ్ఱ్యెడ మాన్పకున్న చో
నాయుసురంటదా మనుజ ♦ నాథునకుం బ్రళయాగ్నితుల్యమై?

వ. అన విని విరాటుండు కటకటంబడి, కీచకు మంచిమాటల నునన
యించి యంపె నయ్యెడ ధర్మజుండు రోషించి ద్రోవదిం గని.

ఉ. ఈసభవారు నీదు తెఱ ♦ గెల్ల నెఱింగిరి చేరుమా సుదే
ష్ణాసదనంబు, నీమగలు ♦ చాలకగా దిట గోపగింప రెం
తేసమయంబుగా కునికి; ♦ యేటికిదూ ఱెడ వాత్మనాథులన్?
దాసతి బన్నముల్ బడు కో ♦ తమ్మునను నాథుని ధిక్కరించునే?

తే. గీ. రాజసభలందు తడవు ని ♦ ల్వనగునే? కు
లాంగనకు నిన్ను పోలె; నా ♦ ట్యమ్ముపూపు
పొలుపునంబాలుపోకల ♦ బోవనేల?
యాలసింపక పొమ్ము మా ♦ ర్యాదగాదు.

వ. అన విని పాంచాలి రోషించి.

ఉ. నట్టువకాడు నామగడు ♦ నట్టువురాలను నేను నాపతిం-
బట్టియె కంకుభట్టు! యెటు ♦ వచ్చును వేఱొక విద్య క్రొత్తగా
బుట్టి నటుండెగాడు కిత ♦ వుండును నామగ డట్టి జూదరిం
గట్టుక లేనిగౌరవము ♦ కావలె నన్నను నేడు వచ్చునే?

వ. అని పల్కి యచ్చోటు వాసి సుధేష్ణామందిరమ్మున కేగి నాటి రేయి మహానసగృహంబున నిద్రవోవు భీమసేనుకడకు జని మేల్కొలిపి కీచకు దురాగతం బెల్ల కడముట్ట నెఱింగించి,

భూపాల - ఖండగతి

పల్లవి: కన్నార నాపడిన - బన్నమును గాంచి యీ
తెన్నువ న్నిదురించు - చున్నాడవా నాథ ॥క॥

అ॥ ప॥ న న్నోమువార లు - న్నారె మీరలు గాక
నాఖ్యెడ న్దయమాలి - నాయమా చరియింప ॥క॥

చ ర ణ ము

అరయ నాజన్మ న - త్క్షత్ర మేమో గాని
పరిభవము లే గంటి - నే నాటికానాడె
జరిగొన్న రోసమున - ధర్మజుని పై తమును
నిరసించినా వట్లు - నిర్భాగ్యురాలనై ॥కన్నా॥

సీ. నృపతి కోటీర మ ♦ణీఘృణి వేష్టితాం
ఘ్రితలుండు ధర్మజో ♦ ర్వీవిభుండు
వెడ గూడు తీరయు ♦ నిడి తన్ను పోషింప
నొడిగి యొక్క నిపంచ ♦ నుంచవలసె
నీ రేడులోకమ్ము ♦ లెత్తివచ్చిన జయిం
పగజాలు శౌర్య సం ♦ పన్నులైన
నీవు నీతమ్ములు ♦ నేటికి నీ ఛంపు
వృత్తుల తోడ జీ ♦ వింపవలసె

తే. గీ. గుండె నీరగు మిము జూచు ♦ కొలది నాకు,
రాణికిం జందనమ్ములు గూర్చు ♦ దాచి నాచి

నలుగు వెట్టుట పట్లు ము ♦ న్వారలునాడు
కరతలమ్ములు కాయలు ♦ గాచె జూడు.

ఉ. పుట్టము లొల్చుపట్టునసె ♦ పోదగు ప్రాణము సింధురాజుచే
నట్టుల బన్నమందుటకు ♦ నై నిలిచెన్, మఱియంత బోవ కీ
చెట్టకు గీచకాధముని ♦ చే నవమానమునంద నిల్చె నా
యట్టి యభాగ్యదేవతకు ♦ నకట! మృత్యువుగూడ వచ్చునే?

తే. గీ. అనుచు నశ్రుజలమ్మున ♦ మునిగియున్న
చెలియమోము వక్షమ్మున ♦ జేర్చి హృదయ
మలమటం బొంద వనిత నూ ♦ రార్చి కొంత
వడికి గోపమ్ము గదుర నా ♦ వడముడి యనె.

బాగు - ఆది

ప॥ నే వధింతు గామాంధు సింహబలు - నీరజాక్షి నీవూఱడిల్లుమా॥ నే॥
అ॥ప॥ భూవరుం డడ్డమైన - భయమ్మునబోయి పాతాళమందు డాగినను॥

చ ర ణ ము

సమయభంగమగు నంచు ధర్మజుడు
జన దిద్యాది యాని నను వారించిన
రమణి నీవె కరుణించి యొక వేళ
క్షమియింపు మనుచు వాకొనిన గాని ॥ నే॥

ఉ. వానికి నీవొడంబడిన ♦ నైఋతిగా నటియింపచి నేర్పున
న్మానక రేయి రమ్మనుము ♦ నర్తనశాలకుఁ బిమ్మవోలె యంద
దేను పరుండియుందు, జను ♦ దెంచు నతండును మల్లి పట్టులో గత
ప్రాణునొనర్తు గీచకుని ♦ భంగుర బాహుబలమ్ము పెంపునన్.

క. అని పల్కిన విని ద్రోవది
చని నిద్దురవోల్లు వేగు ♦ జామున నేటి
లకని సముచిత రీతిం దన
పను లొనరుచుచుండ సింహ ♦ బలుడద్యోడకున్.

సీ. చను దెంచి యుర్వీశా ♦ సంబోలు సేయుచో
బాంచాలియును నోత్త ♦ బడినయట్లు

నటియించుచును రేయి ♦ నర్తనశాల కొ
కరుడవ రమ్మన ♦ గరము సంత
సించి కీచకు డేగె ♦ చెలువ యయ్యది గాలి
కొడుకున కెఱిగింప ♦ గ్రుద్ధుడగుచు
నాటి రేయి నిజాంగ ♦ న న్నంట సిడుకొని
నర్తనాగారమ్ము ♦ నకును జేరి

తే. గీ. రమణి నొక్కెడ నునిచి ప ♦ ర్యంకమందు
ద్రోవదింబలె శయనింప ♦ భావభవ వి
కారుడై కీచకుం డందు ♦ జేరి భీము
సేనుపై గేలుసాచి సూ ♦ చి తలయూచి.

కాఫీ – ఆది

ప॥ కుందరదన రాకేందువదన యర - విందనయన జగదేకసుందరీ॥కుం॥
అ॥ప॥ముందెనీవునాకైవచ్చితివా - మోసగింతువేమోయనుకొంటిని ॥కు॥

చ ర ణ ము

కలరు నాకు పెక్కండ్రు కామినులు-వలచిమెదురులంచమ్మోలీయగా
నెలత నీదు కాల్గోటికిం బోల - నేర నట్టి నిర్భాగ్య దేవతలు ॥కుం॥

చ. తనిసితి నీదు వాగమృత ♦ ధారలు కర్ణరసాయనంబులై
తనరినకారణమ్మున ల ♦ తాంగి ! భవన్మధురాధరామృత
మ్మును మనసార గ్రోలి సుర ♦ భోగము లందినవాడనిగా దలంతి
తును తడవేల లెమ్ము మద ♦ నుఁడదయుండుగదా తలోదరీ!

వ. అను విని సమ్మోహచేతమ్ముగ భీముండును

సీ. పడతుల సేవ్వు నిక్క ♦ వముగ నన్వేషించి
యైన నామాదిరి ♦ యాడుదాని
పని లేదు నన్ను ము ♦ ట్టినవెనక నీకింక
గరితలతోడి సరి ♦ గతికిబోవ
తెలియగాగలవు నా ♦ దేహమ్ము సోకిన
యంత నీదేహ మె ♦ ట్లగునొ యిప్పుడు
పొందజాలుదువు నా ♦ పొందు కారణముగా
భోగాల సార్వ సురలోక ♦ భోగములను

తే. గీ. నాకు ముదమేమిగలదు ని ♦ న్నలియుకన్న
తగినజోడు నా కీనాడె ♦ తారసిల్లె
నిన్న పీల్గానికి క్షమింపు ♦ నేడు దీర్తు
నాకొఱంతయుగూడ నో ♦ యందగాడ !

తే. గీ. అని చివాలున లేచి సిం ♦ హబలునట్టె
సందిటంబట్టి యెత్తి రో ♦ షమున భూమి
తలమునం బడనేయు గం ♦ ధర్వు డనుచు
లేచి భీము నెదుర్కొనె ♦ గీచకుండు.

తే. గీ. తన్నొకరులు జూతురేమో య ♦ టన్న భయము
సింహబలున, కజ్ఞాతమ్ము ♦ చెడునటన్న
జంకు వడముడికిం గల్గి ♦ చప్పుడించు
కేనియును సేయక యె బ్రహా ♦ రించుకొనిరి.

వ. ఇట్లు పెద్దయుంబ్రొద్దు పోరాడి కడకు భీమసేనుండు కీచకుం గూల్చి తన్ను మెచ్చుచున్న ద్రోవదిం డడవుసేయక పొమ్మని పలికి తాను మహానస మందిరమ్మున కరిగె నివ్వేడ బాంచాలియు నాట్యశాల వెలువడి తన పతులగు గంధర్వులచే సింహబలుండు మృతినొందెనని కావలివారలకుం జెప్పిన వారును కీచకానుజన్ములగు నుపకీచకుల కయ్యది యెఱింగింప నుపకీచకు లెల్లరు బలవించుచుం జనుదెంచి బిట్టెవగచి సైరంధ్రికారణమున నీతని కీచావు వచ్చెనని కోపించి ద్రోవదిం బెడగేలువట్టి యగ్రజుశవంబుతో నంట గట్టి పితృవనమ్ము దెసకుం జనుచుండ యాజ్ఞసేనియు నతిరావమ్ముగా నాక్రందనమ్మొనర్చుచో నయ్యెలుంగు విని భీమసేనుండు రోషసంభ్రమంబుండై పరువునం బోయి యున్నతంబగు నొక వృక్షముం బెల్లగించి వారిపయిం బడి యుపకీచకుల మాటనూట యేపుర నుక్కడపచి పాంచాలీబంధమోక్షణమ్ము గావించి యవ్వెలందిని సుధేష్ణామందిరమ్మున కనిపి తాను మహానసగృహమ్మున కరిగె.

శ్రీ

# మహాభారతము



## గోగ్రహణము

హరికాంభోజి - ఆది

ప॥ ఘనగోగ్రహణకథావిశేషమును - వినుపించెదవినుడీ సభాసదులార॥
అ॥ప॥ వినుతయశుడు గాండీవి భీష్మాది వీరవరులనెల్లరనోడించిన ॥ఘన॥

చరణము

కీచకుడొకగంధర్వునెదుర్కొని గెడసెనన్న - వార్త వినిసుయోధనుడు
యోచించి పాండవేయులావిటనున్నారని - సమకట్టి గుర్తింప॥ఘన॥

సీ. కౌరవాగ్రజుడు త్రి ♦ గర్తేశుని సుశర్మ
యనువాని విరటుగో ♦ గణముబట్ట
నియమింప ఘనవాహి ♦ నీ సమన్వితముగా
నరిగి దక్షిణగోగ్ర ♦ హణ మొనర్ప
మత్స్యభూజాని ధ ♦ ర్మజముఖ్యుల సహాయ
మున త్రిగర్తేశు నో ♦ య్యనె జయించె
మఱువాడు నిజయోధ ♦ వరులతో వెడలి కౌ
రవు లుత్తరమున ధే ♦ నువులబట్ట

తే. గీ. నచటి గోపాలకులు పురి ♦ కరుగుదెంచి
రాజపుత్రున కెఱిగింప ♦ రాజసమున
సమరకౌతుక మేపార ♦ సతులచెంత
రిత్తబీరమ్ము జూపుచు ♦ నుత్తరుండు

చక్రవాకము - రూపకము

ప॥ సమయమబ్బినందుకు తగు సారథి లేడాయె నాకు ॥సమ॥
అ॥ ప॥ సమరమున నిలిచి కౌరవ - సైన్యమెల్ల రూపుమాప ॥సమ॥

1. జంకుదు రా మమ్మూర్తులు - సైతము నాపేరు విన్న
టంకారమ్మాలించిన - తావుల్దప్పి చరింపరె ॥స॥

2. సరిగా నాసామర్థ్యము - శాంతనవాదు లెఱుంగరో?
పురమున లేననుకొనిరో - దురమున నేమని తలచిరో ॥స॥

తే. గీ. అనిన విని చెంత నే యున్న ♦ యాజ్ఞసేని
"నడువజాలును మన బృహ ♦ న్నల యరదము
పనిగలిగెగాన నతని దో ♦ డ్కొని చను" మన
నృపతనూభవు డిట్లనె ♦ నేవగించి

చ. సరిసరి! పేడినా? గొనుట ♦ సారథిగా గతిలేక, వింటిప
ట్టెఱుగడు సుంతయేని యత ♦ డెన్నడు వీణియ పట్టెకాని, యీ
గురుతరనాట్యశాల యను ♦ కొంటివొ? సంగరభూమియన్న, న
ల్వురు నను గేలిసేయరొకొ ♦ లోకులు చుల్కనజూచి, నాలిసేసి

క. అన విని ద్రోవది, క్రీడికి
మును ఖాండవదహనసమయ ♦ మున సారథ్య
మ్మొనరించె నత డనుచు నొ
య్యన దెచ్చిన నుత్తరుడు బృ ♦ హన్నల కనియెన్

చ. పవరము గల్గె నాకు బల ♦ వత్తరమై కురుసేనతోడ నీ
యువతి వచించె సారథిగ ♦ నొయ్యన నిన్గొని పొమ్మటంచు, ఖాం
డవదహనమ్ముపట్టున ధ ♦ నంజయు సారథివైతివంట నీ
వత్సస్సమబ్బె జూచి ముద ♦ మందగ నీరథచోదకత్వమున్.

వ. అన విని కిరీటి వైరాటి కిట్లనియె.

తే. గీ. ఖాండవ మ్మేర్చునప్పుడు ♦ కవ్వడికి ర
థమ్ముదులపిన మాట వా ♦ స్తవమెగాని
నీరథము దోలుటన్న సం ♦ దియము దోచె
నైనవత్తు దప్పని సరి ♦ యయ్యెగాన.

మం జ రు లు.

అని పల్కుచు భూమింజయునకు దే - రాయితమ్ము గావింప
జనపాలకనందనుడు రథమెక్క - దను చేడియ లగ్గింప

కురువీరుల పాగలు దెండని ప - ల్కిరి బొమ్మపాత్రికలకు
గరితలెల్ల, నట్లే యని చని యు - త్తరుడు క్రీడితో బలుకు
ఆ కురుసేనం గని పాఱిపోకు - మా! వెఱచి మధ్యలోన
నీకు వచ్చిన భయమ్ము లేను పై - నేనున్నాను నరేన
యని పలుకుచు జనిచని కౌరవ సై - న్యంబెల్ల దేఱిపాఱ
గనుగొని వైరాటి కిరీటి కనియె - దనదు మేను గరుపాఱ.

మ. సరిలే! కౌరవసేన యన్న నిదియా! ♦ చాల్జాలు నీపాటి కీ
యరదమ్మున్ మరలింపు! మీనరికి సై ♦ న్యప్రాంతమును జేరుటే
పొరపాటయ్యె దలంప బ్రాణములు తీ ♦ పుల్లావె? వేయేల నీ
తరమా, నాతరమా, కృపాదినిఖిలా ♦ స్త్రజ్ఞానవళిం గెల్వగన్.

వ. అని పలుక భూమింజయునకు ధనంజయుం డిట్లనియె.

చ. కురుబలము జయింతునని ♦ కోతలు గోసితి వింటిమొద్ద సం
గర మొనరింపకే రిపుల ♦ గన్గొని భీతిలనేల? నవ్వరే
గరితలుసైత మిట్టి నిను ♦ గాంచినచో, పసుల న్మరల్పకే
పురమున కేమొగమ్మునను ♦ పోయెదవోయి నృపాలనందనా!

తే. గీ. ఇట్లు పలుకుచు తేరు వో ♦ నిచ్చుచుండ
నీపసులు పాడుగాను పో ♦ నిమ్మనుచు ర
థమ్ము పైనుండి యుఱికి ప ♦ త్తనము దెసకు
బాఱిపోదొడగెం బిక్క ♦ బలము కొలది.

వ. అట్లు పాఱిపోవుచున్న యుత్తరుం గని విజయుడు పగ్గంబులు నొగల ముడిచి రథం బుఱికి వెన్నంటి పదశతమాత్రప్రదేశమ్మున నిలువరించి రాజపుత్రు బట్టుకొని "నీవు సారథివై రథమ్ము నడుపుము నేనా కౌరవులంగెల్తు" నన నయ్యుత్తరుండును.

కేదారగౌళ - జంపె.

ప॥ నిను సారథిం జేసి - కొని వచ్చినందులకె
నే ఖేదపడుచు ని - న్నే... రథికునిగా జేతునె ॥నిను॥

అ॥ ప॥ కొనకు నినునమ్మికొని కురుసేనకెదురుదునె
కుక్కతోకను బట్టి గోదావరీదినటు ॥నిను॥

చ ర ణ ము

సారథినిజంపియే - చంపుచుర రథికునట
సమరధర్మ మెఱుంగవో... నీవో బృహన్నలా ॥సా॥
పోరాడుమా నీవె - పోయీ శత్రువులతో
చేరువయ్యె న్నీకు - చేటుకాలము నేడు ॥నిను॥

మ. అరులం గెల్చుటయన్న చో నభినయంబా? నాట్యమా? గానమా?
దురమన్న న్వెనుదీయుచుందు వొకచో ♦ దుర్వార తేజోబల
స్ఫురణమ్ము ల్గల మేమె; క్లీబుడవు నీ ♦ వున్ మాటలేగాని పో
టరివెట్లౌదువు? రమ్మికం బెనగులా ♦ డం జెల్లునే ప్రజ్ఞకై?

వ. అని పల్కు నుత్తరు బలాత్కారమ్ముగ రథం బెక్కించి నిశ్శ్రేష్ఠ యుధంబైన జమ్మికడకుఁ జేర్చి ధైర్యమ్ము సెప్పుచు నావృక్షమ్ముపై రాజపుత్రు నెక్కించి యాయుధబంధం బందుకొని గాండీవముం బుచ్చుకొని యెప్పటియట్ల నాయుధబంధ మందు బెట్టింప నుత్తరుం డట్లొనర్చి వృక్షమ్ము దిగివచ్చి యయ్యవి పాండవుల యాయుధమ్ము లని బృహన్నలచే నెఱిఁగి మహాత్మా! పాండవులిప్పు డెందుండిరని యడుగ నర్జునుం డిట్లనియె.

సీ. ధర్మాత్ముఁడైన నీ ♦ తండ్రికి మిత్రస
త్తముఁడైన కంకుఁడే ♦ ధర్మసుతుఁడు
వలలనామమున మీ ♦ బానసీఁడౌ కీచ
కుని గూల్చి నతఁడె వృ ♦ కోదరుండు
వారువమ్ములమీఁది ♦ పారుపత్తెమ్మున
నెసఁగు దామగ్రంథి ♦ యే నకులుఁడు
గోపాలురకు నాయ ♦ కుండై చరించు తం
త్రీపాలుఁడే సహ ♦ దేవుఁ డరయ

తే. గీ. నర్జునుఁడ నేను మాలిని ♦ యాజ్ఞ సేని
యూర్వశి శపింప బేడినై ♦ యుంటి నిచట
గడపితిమి మీపురమ్మున న ♦ జ్ఞాతదీక్ష
వత్సరంబిటు మత్స్య భూ ♦ పాల తనయ

వ. అన విని యుత్తరుండు సంతోష విస్మయంబులు ముప్పిరిగొన మహాత్మా ! నీ వర్జునుడవేయగుచో నతనికి గల పదిప్రసిద్ధనామములం బేర్కొని, యాయానామంబు లెట్లుగల్గినవో చెప్పుమన.

సీ. అవదాతవర్ణుండ ♦ నగుట నర్జునుడ, ఫ
  ల్గునితారబొడమి ఫ ♦ ల్గునుడ నైతి
పృథకుంబుట్టుట బార్థు ♦ డేనైతి, హరినమ
  ద్భుతకిరీటుడనై కి ♦ రీటినైతి
వెలిగుఱ్ఱముల్గల్గి ♦ శ్వేతవాహను డైతి
  భయపెట్టి కలన బీ ♦ భత్సుడైతి
విమతకోటిజయించి ♦ విజయుండ నేనైతి
  సురలనోడించు జి ♦ ష్ణుండనైతి
తే. గీ. శరము లిరుగేల విడి సవ్య ♦ సాచినైతి
  రాజసూయార్థమై గెల్చి ♦ రాజవరుల
  సంగ్రహించి ధనము ధనం ♦ జయుడనైతి
  నాకు నీ పది సార్థక ♦ నామములగు.

వ. అని చెప్పిన విని యుత్తరుండు కిరీడికి నమస్కరించి చేతులుమోడ్చి

శ్రీరాగము - ఆది

ప॥ శరణు శరణు రిపుమర్దన విక్రమ - పరమ
  పురుష యో - పాండవమధ్యమ ॥శర॥
అ॥ప॥ నరుడ వీవని మ - నంబున నెఱుగక
  నాపలికిన మాటలు మన్నింపుము ॥శర॥

చ ర ణ ము

లేదు భయము నాకింక భీష్మాది - యోధు లన్నా జగచ్చక్రముల
నీదయాలభ్యముగ సార్థినై నీయురదసరు చోలెద నాగ లెక్కడ॥శ॥

చ. అనిన కిరీటి సాధనము ♦ లన్నియు గైకొని తేరిపై నొణ
ధ్వని యొనరించి శాసరోషణ ♦ తాకముఁవిల్లియు శంఖమొత్త ద
ద్ధ్వని విని కుంభసంభవుడు ♦ పల్కె సుయోధనుతోడ చూచితే?
మనుజవరేణ్య! పార్థుడతి సుభటా! యరుదెంచుచటే మహోగ్రుడై.

చ. అనిమొన దేవదానవుల ♦ కైన నజేయుఁడతండు, ఫాలలో
చనుని జయించి పాశుపత ♦ సాయకమున్ గొనె, ధర్మమూర్తిగా
వున సమయమ్ము దీర్చి వెలి ♦ వోని సరాక్రమమొప్ప వచ్చెడు
న్మనలజయింపబూని, యను ♦ మానముతే దితడంతవాడెయా.

వ. అనుచు నెద్దియో చెప్పబోవు ద్రోణుంగని సుయోధనుండిట్లనియె.

ఉ. పాండవ పక్షపాతమున ♦ బల్కెద వంతియెగాని క్రీడియొ
క్కండె టెటు గెల్వజాలు నురు ♦ కార్ముకదక్షులనిందఱన్ మహో
ద్దండపరాక్రమక్రముఁడ ♦ తండని వందివిధాన శాత్రవుం
గొండొకపెద్దగా నుడువ ♦ గూడునొకో మిముబోటివారికిన్.

వ. అన విని కృపుండు దుర్యోధనుం గాంచి.

మ. విలు జేతంగల వారి కెల్లరకు స ♦ వేద్యంబు నిక్కంబుగా
బలభిత్సూను పరాక్రమం బతడు పో ♦ వం డెన్నడున్ వట్టి మా
టలతో గావున జాగరూకులయి యుం ♦ డం జెల్లునం చాడు నీ
యలఘుం బాండవపక్షపాతి యన నా ♦ యంబౌనె ? దుర్యోధనా!

వ. అన విని రాధేయుండు సక్రోధుడై సుయోధనున కిట్లనియె.

పూర్వకల్యాణి – ఆది

ప॥ తిన్న యింటివాసాల లెక్కించు – తిరు దోచె
నీ భావలనైజము ॥తిన్న॥

అ॥ ప॥ ఎన్నదగిన శస్త్రాస్త్రవిదు లంచు – మన్నిం
పగ కందాలోబడి తిని ॥తిన్న॥

చరణము

వెంట పీరిగొని పోరికి వచ్చుట – పిల్లిని గొని పెండ్లియిల్లు సేరుట
వంటిదే యగును గానిచో దగునె – పవరమందు పిటికిమందు
వోయుట ॥తిన్న॥

2. కల్లగాదు "తోజెడ్డగోతి వని – మెల్ల జెటిచె" నన్నట్టిసామెతయు
నెల్ల సైనికులు కొరతొప్ప మాడుగ – టేల? తమవల్లగాకున్న
యానన్న ॥తిన్న॥

ఉ. చాపలసాయ మేమిటికి ♦ పార్థివసత్తమ! నీకు సంగరా
టోపము మీఱ నే నొకఁడ ♦ దుర్భేద పార్థుని శీర్ష మస్త్రవి
ద్యాపటిమంబు తేటపడ ♦ నంటఁ ద్రుంచు చుందుఁ డా భవా
నీపతి యడ్డగించినను ♦ నేఁడు కిరీటికి సావు తప్పునే?

వ. అన విని యశ్వత్థామ కర్ణున కిట్లనియె.

ఉ. గొల్లల నడ్డగించుటను ♦ కొంటివొ? సంగరమందు భైరవీ
వల్లభు సైతము న్గెలిచి ♦ వచ్చు కిరీటి నెదిర్చి నిల్చుటల్
జెల్లవు ప్రొల్లుమాట లిక ♦ చేగువకుం జను దెంచుచున్న వా
డల్లదె క్రీడి కౌరవ కు ♦ లాటవి గాల్ప గృశానుతుల్యుఁడై.

తే. గీ. ప్రబల దుర్గంధ ధార్తరా ♦ ష్ట్రకులధూమ
కేతు వన దోఁచె నాకపి ♦ కేతు వదిగొ?
శకుని దుర్మంత్ర తంత్రము ♦ ల్సాగ వింక
యెల్లరుం గూడి పోరి కా ♦ యితముగండు.

వ. అని పల్కు నశ్వత్థామాదుల వారించి యర్జునుఁడు సమీపంగతుఁ డగుటచే భీష్ముండు తాలధ్వజం బెత్తించి సైన్యమ్ము దీర్చి యున్నంత విజయుం డద్దెసకు చేరవోవం బనిచి గురుకృప గాంగేయులకు బదసమీపస్థలంబులం బడ రెండును, గర్ణాభ్యర్ణ ప్రదేశంబులం జన రెండునుంగా నమ్ము లేసిన క్రీడింగని ద్రోణుండు సంతసించి,

కళ్యాణి – రూపకము

ప॥ భళిరా! శిష్యుఁడవన నీ – వగదా యో పృథాతనయ ॥భళి॥
అ॥ ప॥ అలరితి నీ గురుభక్తికి – నారాధించితివ నన్ను ॥భళిరా॥

చ ర ణ ము

ఇలగురునకు బంగనామ – మిడుశిష్యులు నూర్గురేల
సలలితమ్ముగ నొకఁడేనియు – జాలఁడా నినుబోలువాఁడు ॥భళి॥

చ. పదయుగళింబ్రణామముల ♦ వైఖరి నేసి శరద్వయమ్ము, స
మ్ముదమున సేమమాయు నెడి ♦ పోల్కి శరద్వితయమ్ము వీనులం

బదపడి సోకిసోకని క్ర ♦ మమ్ము నన్నేసి భళీ! కృతజ్ఞత
న్విదితము జేసికొంటివి త్రి ♦ విష్టపస్థ స్యుడవోయి నాయనా!

తే. గీ. అనుచు నగ్గించు నంతలో ♦ నర్జునుండు
చిత్రగతి నెట్టులో కురు ♦ సేనజొచ్చి
గోవుల మఱల్చి నంత శ ♦ కుని జయద్ర
థాను లోకమ్ముగి పైబడ ♦ నతిరయమున.

సీ. మండలీభూతమహా ♦ గాండీవరేఖయే
వరలు సురేంద్ర చా ♦ పమ్ముగాగ
కర్ణముల్ బ్రయ్యలు ♦ గావించు తద్గుణ
క్వణమే మహాఘోర ♦ గర్జగాగ
శకుని సైంధవముఖ్య ♦ శత్రు వీరకరాక్ర
మంబే నిదాఘకా ♦ లంబుగాగ
కోదండ నిర్ముక్త ♦ గురుతరోత్కటశరా
సారమే తతవర్ష ♦ ధారగాగ

తే. గీ. విజయజలధర మెల్లెడ ♦ విస్తరింప
గాల్వలై పాఱె రక్తమ్ము ♦ కదనభూమి
బెగడి చేష్టలు దక్కిరి ♦ వీరులెల్ల
నట్టిచో దాకె వాసవి ♦ నర్కసుతుడు.

వ. అట్లు తన్నెదిరిన కర్ణుం గని

దర్బారు — రూపకము

ప॥ కరము పండువయ్యె నాకు — కర్ణా నిలు పాఱిపోకు ॥క॥
అ॥ ప॥ సరి నా కెవ్వరు లేరని — సభలం బల్కెదు వీ వట ॥క॥

చరణము

పలుకవచ్చుగా కెన్నియొ — పలికిన యటు చేయుదరమె
తలపగ కార్యవిదూరులు — తులువా! వాచాశూరులు ॥కర॥

క. అని పల్కి ధనంజయుపై
దినమణిసూనుండు గురిసె ♦ తీవ్రశరంబుల్,

తను జుట్టుముట్టు సేనలు
కినిసి నిశాతాంబకముల ♦ క్రీడియు నేసెన్.

ఉ. అంచిత విక్రమాతిశయ ♦ మల్లన జూపుచు సైన్యముం బటా
పంచలు జేసి చేతివిలు ♦ భగ్నమొనర్చి తదంగకమ్ము న
న్నించి శరమ్ము లంగ ధర ♦ ణీవిభు బోరుతొలంగజేసి పూ
రించెను దేవదత్తమును ♦ క్రీడి విరాటతనూజు డుబ్బగన్.

వ. అట్లు కర్ణుండు కయ్యంబు విడిచి పాఱినంత నమానుష విక్రముండగు ద్రోణుం డప్పార్థుం దాక నేతెంచిన నరుండు గురున కిట్లనియె.

తే. గీ. పదియురెండేడు లడవులం ♦ బడి యిడుమలు
గుడిచి వచ్చిన యట్టి శి ♦ ష్యుడగు క్రీడి
మీరుపెట్టిన దీపము ♦ మీపవిత్ర
పదములకు సేయు నిదె యభి ♦ వాదనంబు.

తే. గీ. పతిని డీకొను సుతుగన్న ♦ పడతి, గురు నె
దుర్కొను నెట న్సమాప్త వి ♦ ద్యుం డటన్న
సామెతగ మీకడ న్విద్య ♦ సంగ్రహించి
మిమ్మెదురజూచు నన్ను క్ష ♦ మింపుడనఘ!

ఉ. చేతులు రావు నాకు గురు ♦ శేఖర! మీపయిదొల్త సాయక
వ్రాతము లేయ, నాపయిని ♦ ప్రప్రథమంబున మీర లేయుడీ
భీతిదొలంగు నాకు, నిది ♦ విన్నను నామొడ నింక ధర్మసం
జాతుడు కోపగింపడు, ని ♦ జమ్మున కయ్యది ధర్మమే యగున్.

వ. అని పల్కిన యర్జును ధనురాచార్యుం డిరువది బాణముల నేసిన వానినన్నింటి గవ్వడి తుత్తునియలొనర్చి పోరుచో గౌరవసైన్యంబు క్రీడి కడ్డంబుసొచ్చిన విష్వచ్చుం డసంఖ్యాక బాణపాతంబున సైన్యంబును దైన్యంబునొందించుచు ద్రోణుం డేయు బాణంబుల దునియలు గావించుచున్నం జూచి విస్మయపడి గురుండు.

మోహన - ఆది

ప॥ నిన్నాహవమున నిలువరింపగా-నేరఁ డాఫాలనేత్రుండైనను ॥ని॥
అ॥ప॥ ఎన్నదగినవిలుకాఁడవౌదువో-యన్నా! విను నాకన్న ఘనుండవు॥ని॥

చరణము

దేవదానవుల గెలిచిన నిన్నుం - దేటఁజూడ వశమా మానవులకు
నీవంటిశిష్యునకు విద్యగఱపి - నేఁగృతకృత్యుఁడ నైతి నర్జునా ॥ని॥

వ॥ అనుచున్నంత మహేంద్రసూనుఁడును ద్రోణాచార్యుపైనించి మార్గణపాళి న్విరథుం బొనర్ప దత తీ ♦ వ్రక్రోధులై తాకి రర్జును ద్రోణాయనియుం గృపుండు, నరుఁడున్ ♦ రోషించి వారి న్మహాస్త్రనికాయమ్ముల బాఱదోలి ఘాటియుం ♦ దాకె న్వడి న్భీష్మునిన్.

క. హరినోర్చినవాఁ డొకఁడు
హరునోర్చినవాఁ డొకండు ♦ నాయిర్వురు సం
గర మొనరించుచు ఖేచర
వరసన్నుతి పాత్రులైరి ♦ భారతవీరుల్.

తే. గీ. కొనకుఁగ్రీడి మందాకినీ ♦ తనయుచేతి
విలుదునిమి వక్షమును శర ♦ మ్ములనినుపగ
సో లెరథకూబరమ్మున, ♦ సూతుఁడంత
నరదముం దోలుకొనిపోయె ♦ నచటువాసి.

వ. విజయుండును యుద్ధమ్మున దనివిసనక గుంపులుగట్టియున్న కురుసైన్యంబుపైబడి యేట్లాడుచు కడకు దుర్యోధనుపై జుఱుకుటమ్ములనేయ నయ్యురగకేతనుండు యుద్ధభూమినుండి తొలంగి చనుచుండం గని కవ్వడి సుయోధను నిట్లుపాలంభించె.

కన్నడ - ఆది

ప॥ కయ్యమున్న జూదంబనుకొంటివి-కాబోలును పాపము దుర్యోధన ॥క॥
అ॥ప॥ అయ్యవారిముంగట నే చూపితి-వౌర నీపాఱుబోతుతనంబిటు ॥క॥

చరణము

ప్రతిన జేసెచిన్నన్న మిము నూర్వురం - గూల్చెదనని ఘోరాహవమున॥
బ్రతికిపోతి వద్దాన నేడిసీ! పాఱిపొమ్ము - కౌరవకులపాంసన ॥క॥

సీ. అనిన రోషించి పా ♦ర్థునిపయి గురుపతి
కవియ భీష్మద్రోణ ♦ కర్ణముఖ్యు
వీరు లెల్లరు నొక్క ♦ పెట్టున వచ్చి తా
కిన విజయుండు మో ♦ హనశరమ్ము
విడువ నాయుధములు ♦ విడిచి యెల్లరు నేల
నొఱగిరి నిద్రించు ♦ చున్న యట్టు
లర్జునప్రేరితుం ♦ డై యుత్తరుడు శాంత
నవు డున్నవంకకు ♦ న్జనక తక్క
తే. గీ. యోధవరుల యుష్ణీషమ్ము ♦ లొకట గోసి
తెచ్చి రథ మెక్కి వెనుకకుం ♦ దేరుపోవ
నిచ్చుటయు గౌరవులును ల ♦ జ్జించి భీష్ము
నానతిం దారిబట్టిరి ♦ హస్తిపురికి.

వ. అంత నర్జునుండు తిరిగి జమ్మికడకు సేరి గాండీవాదిసాధనమ్ములు పూర్వప్రకారమ్మున నిక్షేపింపజేసి, దేవదత్త కిరీటాది పరికరమ్ము లంతర్ధానమ్ము సేయించి, కురుబలమ్ము గెల్చి యుత్తరుడు వచ్చుచున్నట్లు సాటింపుడని గోపాలురపురంబునకనుపనవ్వారుసనిభూమిం జయు విజయమ్ము విరటునకు దెల్పి చనిరయ్యెడవిరటుండు కంకునితో జూదమాడుచు దనకుమారునివిజయంబున కెంతయుబ్రమోదించుచు బొగడుచున్న నయ్యది బృహన్నల జయంబని ధర్మజుండన రోషించి భూపతి సారెగొని ధర్మపుత్రు నేయ గంటువడి రక్తమ్ము స్రవించుచో తక్షణంబ తచ్ఛోణితముం దనయుత్తరీయమ్మున నొత్తు సైరంధ్రిం గని మత్స్యమహీవల్లభుండు నీ వీ శోణితంబుపై జీరంబట్టుటకు గారణం బేమన సైరంధ్రి యిట్లనియె.

చ. కులమును శీలముం గలుగు ♦ కోవిదమాన్యుడు కంకు డట్టి యీ
యలఘుచరిత్రు రక్తము ధ ♦ రాధిప! ధారుణిపైని యెన్ని చు
క్కలువడు నన్నివర్షములు ♦ గల్గును కాటక మిందుగాన నే
సిలుగును నీకు నిక్కతన ♦ జేకురకుండగ నిట్లు జేసితిన్.

తే. గీ. అంతలో నుత్తరుం డట ♦ కరుగుదెంచి
సర్వమును నెఱిగి కౌరవ ♦ సైన్య మెట్లు

గెలిచి వచ్చితి” వంచు న ♦ గ్గించి పలుకు
తండ్రి కిట్లనె నెంతయుం ♦ దత్తరమున.

సరస్వతి - ఖండగతి.

ప॥ ఎంతపని జేసినా - వీయనఘు సారెగొని
యేసి పాపముగొంటివా - యితండెవడనుకొంటి ॥ వెం॥
అ॥ప॥ సంతతామలసత్య - సంధుడా పాండుభూ
కాంతు నగ్రసుతుండు వరధర్మ భూనేత ॥యెం॥

చరణము

వలలుడే భీముడు, బృ - హన్నలయే విజయుండు
వారువమ్ముల నేలు నా - దామగ్రంథియె నకులుడు ॥వ॥
అలరు తంత్రీపాలు - డరయ సహదేవుండు
చెలువ సైరంధ్రియే క్షితినాథ! పాంచాలి ॥యెం॥

తే గీ. ధార్తరాష్ట్రుల కట్లు జూ ♦ దమున నోడి
పదియు రెండేండ్లు పాండు భూ ♦ పాలసుతులు
సలిపి వనవాస మంత న ♦ జ్ఞాతదీక్ష
గడపినారలు మనవీట ♦ కాలవశత.

వ. అన విని విరాటుం డద్భుతామోదమ్ములు ముప్పిరిగొన వినయమ్మున ధర్మజునకు మ్రొక్కి తత్క్షణం బుత్తర నయ్యెడకు రావించి “యిమ్ముద్దియ నర్జునున కిడి పెండ్లి సేయ దలంచితి” నన నర్జునుం డక్కన్నియం గోడలిగా గైకొందు నన విరటుండు సంతసించి సుముహూర్త నిరూపణంబు సేయించి యాదవపాంచాలాది బంధుజనుల నెల్ల బెండ్లికిం బిలువంబంచె నంత పాండుకుమారులు జమ్మిపై నిడిన యాయుధమ్ముల బూజాపూర్వకమ్ముగా దెచ్చికొని యుపప్లావ్యంబున వసించియుండ నయ్యెడకు సపరివారమ్ముగ సుభద్రాభిమన్యుల దోడ్కొని బలరామకృష్ణు లరుదెంచి కుశలం బెఱింగి యభిమన్యుని భద్రగజారూఢుం జేసి విరటుపురంబున మంగళతూర్యనాదంబులు సెలగ మహావైభవమ్మున నుత్తరాభిమన్యులకు వివాహమహోత్సవంబు గావించిరి.

శ్రీ

# మహాభారతము

## పాండవ సందేశము

యమునాకళ్యాణి - ఆది

ప॥ వినుడీ పాండవసందేశ కథన్ - వినిపించెద నేడు శుభంబగు ॥విను॥

అ॥ ప॥ వననిధివోలె ప్రతిసపర్వర సోదయ - భాసుర మగు నీ భారత చరితము ॥విను॥

చరణము

ఉత్తరాభిమన్యులవివాహ మ - హోత్సవానంతరమున పాండవులు చిత్తము లలర నుపప్లావ్యమునం - జేరి రెల్ల రానందభరితులై॥ వినుడీ॥

సీ. కౌరవాగ్రజుడు సం ♦ గ్రామమందున గృత
నిశ్చయుండై తని ♦ నీరజాక్షు
సాయమర్థించి నా ♦ రాయణుండును పవ
ళింప నాతనితల ♦ యంపివైపు
నాసీనుడై యుండ ♦ నర్జునుండరిగి కా
ళ్ళకడయొద్ద జేరి ని ♦ ల్వబడియుండె
నంతలో మేల్కాని ♦ హరి పార్థు జూచి సం
తసముబ్బ నెల్లరి ♦ కుశలమడిగి

తే.గీ. వెఱకనున్న సుయోధనుం ♦ గని సగౌర
వముగా సేమమరసి స ♦ ర్వజ్ఞుడయ్యు
నేమెఱుంగనియటుల న ♦ టించి తావ
చ్చాగమనకారణంబేమి? ♦ యన నతండు

తోడి - రూపకము

ప॥ కౌరవపాండవులు పెనగు - కాలము చేరువయ్యెను ॥కౌ॥

అ॥ ప॥ కోరగవచ్చితి రణమున ♦ గోపాలా! నీసాయము ॥కౌరవ॥

చరణము

సరసిజాక్ష బాంధవమున - సములము నీకుభయులము
కర మనుకూలుడవు గమ్మ - కయ్యమున్న నాకియ్యెడ ॥కౌ॥

ఉ. నే నరుదెంచితిం దొలుత ♦ నీకడకున్ను నుబోటి సజ్జను
ల్మానుగ ముందువెన్కల గ్ర ♦ మమ్మగ నారసిగాదె కార్యసం
ధానము సేయుచుందురు జ ♦ నార్దన! కావున నాకు నీవు నీ
సేనయు దోడుగావలయు ♦ సెప్పగలాడవె నీకు ధర్మముల్?

వ. అన విని వాసుదేవుం డిట్లనియె.

శా. ముందే వచ్చితి వీవు, చూచితిని ము♦న్ముం దర్జును న్నాకు, ని
యం బెంతేని విభేద మేర్పడదు, సా ♦ యం బిర్వురుం గోరు టీ
చందం బారయ ధర్మమేయగును, నా ♦ సైన్యమ్ము భాగింతు, ని
రం బెవ్వారల కేది యిష్టమగునో ♦ యద్దానిం గైకొండికన్.

ఉ. వీరులు నన్నుబోలు పది ♦ వేవురు గోపకు లున్నవార ల
వ్వారొకవైపు, సేయుదురు ♦ భండన; మే నొకవైపు, సుంతయుం
బోరొనరింప; సేయుదు ను ♦ బుద్ధికిదోచిన సాయ; మిందులం
గోరు డభీష్ట మెయ్యదియొ ♦ కోరగ జెల్లును ముందు క్రీడికిన్.

వ. అన విని యర్జునుండును,

శ్రీరంజిని - రూపకము

ప॥ సారథివై రథమెక్కుము - చాలునాకు గోపాలా ॥సారథి॥

అ॥ ప॥ నీ రణమేరికివలయును - నీకటాక్షమున్న జాలు ॥సారథి॥

చరణము

నీవే యుద్ధ మొనర్చిన - నెట్టువచ్చును పేరు మాకు
బావా! నీ దయయున్నడ - పగతుర గెల్చు టెంత పని ॥సా॥

క. అన విని సుయోధనుడు నె
మ్మనమున సంతోషమంది ♦ మాధవ! నేద

క్కిన దానిఁగొందు ననుచుం
జనె నంతట శౌరి సవ్య ♦ సాచి కనె నిటుల్.

తే. గీ. విక్రమోపేతు లాహవ ♦ వీరు లైన
గోపకుల పదివేవురం ♦ గొనక విడిచి
యాయుధము నైన ముట్టని ♦ యట్టి వెట్టి
గొల్లబోయని నను గోరు ♦ కొంటి వేల ?

వ. అనిన విని కిరీటియు

ఉ. నీ కెదు రైరణమ్మునను ♦ నిల్చిన నీ పదునాల్గులోకముల్
మాకు సహాయమైన నిను ♦ మారొకనజాల మనంగ, గోపకా
నీకము గోరి యిన్నెదుర ♦ నేర్తుమె ? నా రథమందు నిల్వుమ
య్యా ! కురుసేన గాదు త్రిపు ♦ రాంతకునైన జయింతు గేశవా !

సీ. పరమేష్ఠినోట వె ♦ ల్వడిన వేదమ్ముల
సారమ్ము శౌరియే ♦ సారథియట
పాశుపతార్థమై ♦ పవరమందున నుమా
రమణు గెల్చిన క్రీడి ♦ రథికుడంట !
వరుణకుబేరవై ♦ శ్వానరాంతకమహే
శ్వరవాసవాదు ల ♦ స్త్రగురులంట !
గాండీవముఖాదిగా ♦ గల సాధనమ్ములు
దేవతావళి ప్రసా ♦ దించినవట !

తే. గీ. సంగరమ్మున నెవడాగ ♦ జాలువాడు ?
తెలిసియే కోరితిని జుమా ♦ దేవదేవ !
హృదయ పరిశోధనార్థమై ♦ యిట్టిమాట
లాడితివిగాని బావా ! మ ♦ హానుభావ !

వ. అని పలికి గోపాలుం దోడ్కొని ధర్మభూపాలు కడకుం జనియె
నంతనతఁ డల్లుండును పుత్రమిత్రసైన్యసమేతమ్ముగా బాండవసహా
యార్థమై వచ్చుచుండ మార్గమధ్యమ్మున దుర్యోధనుం డంతయుం
దన్ను గౌరవింప సంతుష్టాంతరంగుఁడై కురుపతిం గని "నీ కేయట్టి
యిష్టంబు కోరుమిచ్చెద" ననె.

మలయమారుతము - ఆది.

ప॥ కోయన దేమన్నది మద్రేశ్వర - గురుగదా
సమర ... కుశలుండవు...సత్యసంధుడవు ॥కో॥
అ॥ ప॥ చేరినాకమాత్యుడవై కౌరవ - సేన నెల్ల నడిపింపు రణమ్మున

చరణము

కౌరవులని పాండవులని భేదము - గలదె నీకు మామా ...
యుభయులోక రూపు ॥కౌ॥
నీరలోక మగ్గింప దురమ్మున - బోరాడుము నాకు
సహాయముగా ॥కోరు॥

చ. అన విని శల్యు డట్టులె స ♦ హాయ మొనర్తును గాక పాండునం
దనుల నవశ్యముంగని ప ♦ దంపడి వత్తునటంచు బల్కి తా
జని వడి వారలున్నెడకు ♦ సత్కృతుడై ధృతరాష్ట్రసూతికిం
దనకు బొసంగుమాటల వి ♦ ధానము దెల్పిన ధర్మజుండనెన్.

ఉ. కౌరవనాథు పక్షమున ♦ గియ్యకొనర్పుడు సమ్మతంబె; నా
కోరిక దీర్పు డొక్కటియ ♦ కోరునదేమన సూతసూతికిన్
సారథి వీవు దక్క కురు ♦ సైన్యమునం దొకరుండు లేడు మా
మా! రణమందు కర్ణు హృద ♦ యమ్ము గలంచి కిరీటి నేలుమా.

తే. గీ. అనిన మద్రేశ్వరుం డియ్య ♦ కొని యుధిష్ఠి
రాదులను వీడుకొని చనె ♦ హస్తిపురికి
నంత సమరసహాయార్థ ♦ మైన్యపాలు
రేగుదెంచుచు నుండి ర ♦ య్యిరుతెగలకు.

ఉ. అంతట నాంబికేయు డొగి - నంపెను సంజయు ధర్మసంభవున్
శాంతియుతాత్ము జేయుమని, ♦ సంజయుడుం జని యెల్లవారి న
త్యంత భయోరుభక్తి విన ♦ యమ్ములజూచి నమస్కరించి తా
నెంతయు నేర్పునం బలికె ♦ నిట్లు యుధిష్ఠిరుతోడ గొల్వునన్.

ధన్యాసి - ఆది

ప॥ సంతసించుచున్నాడుమీ తండ్రి-యెంతయేనిమీ సేమమాలించి॥సం॥
అ॥ప॥ వంతలన్నింటిబాసి మీరుపల్లావ్యంబునసుఖులైయున్నారని ॥సం॥

1. మతిమాలినవార్ధక్యముకతమున మాన్పడయ్యెదుర్యోధను చెయిదము
వెతలకోర్చి ధర్మమ్ముదప్పకే ప్రతిన జెల్లించుకొంటివో యనఘ॥
2. కలహమాడి దాయాదులుమడియుటకన్న దారుణం బున్న దే? తలప
కులవినాశకరమా కార్యమునకు దలపెట్టరు నీబోటిమహాత్ములు॥

చ. అలవియె నిర్ణయింపగ జ ♦ యాపజయమ్ములు తొల్త, మీరలే
కలన జయమ్ము గాంచెదరు ♦ గాక, యజాతరిపుండవంచు ని
ర్మలయశమంది తుచ్ఛమగు ♦ రాజ్యసుఖంబుల కాసజెంది దా
యల ననుకంప వీడి తెగ ♦ టార్తువె, నెత్తురు కూడు తిందువే?

తే. గీ. పాలొసగ లేదటన్న కో ♦ పమున బంధు
కోటిదెగటార్చి నెత్తురు ♦ కూడు దినుట
కన్న మేలగు నీకు భి ♦ క్షాటనమ్ము
జేసియైనను గడపుచే ♦ జీవయాత్ర.

చ. ఒరులకు మ్రింగ శేదగు మ ♦ హోగ్రహాలాహల మట్లు మ్రింగగా
హరునకు, దీవ్రకోపరస ♦ మల్లన మ్రింగికొనంగ నీకునున్
వరుసగ జెల్లె; శూలి కెన ♦ వచ్చు దయానిధి వీవు కాన నో
నరవర! యట్టి నీ వలిగి ♦ నన్ జగమంతయు భస్మరాసియౌ.

వ. అన విని ధర్మనందనుం డిట్లనియె.

కేదారగౌళ - ఆది

ప॥ భాగమీకుండ-శాంతిగూర్చుమనిపంపెనానిన్ను మాపెదనాయన?
అ॥ప॥ జోగులరై కారడవుల-బట్టుకయాగులాడుడనియా సందేశము?

చ ర ణ ము

కాకపోమతని తమ్ములకొడుకుల - మేకైవడి నిర్భాగ్యులమైనను
మా కాతనిచరితము-క్రొత్తగాదు-మాన్పలేడు దుర్యోధను మతమును

శా. "ఏనా డా విదురాదు లేమిటికి నీ ♦ కీ జూదపుంగల్మి, యా
చ్ఛో నింద్యంబగుగాన నాస విడు" మం ♦ చుం జెప్ప నాలింపడో
య్యానాడే చెడె వంశగౌరవమ్ము; భీ ♦ మాదుల్ మదీయాజ్ఞకున్
లోనై బన్నములెన్నియో సయించుటల్ ♦ గుర్తింపవో? సంజయా!

సీ. తెరపిలేకుండ గాం ♦ డీవి భండనమున
గంటకుటమ్ముల వాన ♦ గురియునాఁడు
కురుకుమారులతల ♦ ల్దురమున గద కేల
గొని భీముఁడు పగుల ♦ గొట్టునాఁడు
తలిమి మాద్రేయ ప్ర ♦ థము డరివీరుల
జిందఱవందఱ ♦ సేయునాఁడు
కారుచిచ్చుంబోలె ♦ గవిసి సైన్యాటవిం
జిన్నతమ్ముఁడు బూదె ♦ సేయునాఁడు

తే. గీ. తమ్మునికుమారులంచు పాం ♦ డవులు తెలియు
నట్లు మమ్ము గాశీయాత్ర ♦ కంపు పున్నె
మాత్మజుల ఘోషయాత్రకై ♦ యంపు పున్నె
మనుభవింపగలాఁ డిక ♦ నంధనృపతి.

శా. నీకేలా చెనో ♦ యాతఁడే యనెనో ? గా ♦ నీ, బిచ్చపుంగూడు మే
ల్మాకంచున్ వచియించినాఁడ విది ధ ♦ ర్మంబెట్లు? తేజోబల
ప్రాకట్యమ్ముగలట్టి రాచకొడుకుల్ ♦ రక్తాన్న మేగాక, యే
వీకన్ బిచ్చపుగంజి ద్రావుదురు? ని ♦ర్వీర్యాత్ములై, సంజయా!

వ. అని పలుకు ధర్మజుని వీరరసోచితమ్ములగు వాఁడిపలుకుల కెల్లరు నక్కజమందిరి. అంతవాసుదేవుండు సంజయుంగని ధర్మజునుద్దేశంబున కనుగుణంబుగ నిట్లనియె.

భైరవి – రూపకము

ప॥ సమర మెట్లునుం దప్పదు – సంజయ! నీకేమి వెఱ్ఱి ॥స॥
అ॥ ప॥ యము డాకలిగొనియున్నా – డఖిలజనక్షయమగు నిక ॥స॥
1. పరిభవపడి చేతగాని – వారింబలె ఁయుంటకంటె
పరిపంథుల నురుమాడుటె – భావ్యంబని తోచునాకు ॥సమ॥
2. సాగవింక మునుపటి వలె – సౌబలు దుర్మంత్రంబులు
నాగపురాధిపు నంధుని – నక్కవినయములు సెల్లవు ॥సమ॥
సీ. విసముపెట్టిరి, కర ♦ పించిరి ఫణులచే,
గాల్పించి రట్లు లా ♦ క్షాగృహమ్ము

జూదమాడించిరి, ♦ సుదతికి గొల్వులో
గారాని యిబ్బంది ♦ గలుగఁజేసి
ఖిలరాజ్యశ్రీల ♦ హరియించి పైపెచ్చు
కట్టుగుడ్డలతోడ ♦ గాన కంపి
రట్టిమోరకులతో ♦ నెట్టు లీపాండురా
జ తనూభవులకిక ♦ సంధిపొసగు

తే. గీ. రోషమయ మహాతరువు దు ♦ ర్యోధనుండు
స్కంధ మారయ గర్ణుండు ♦ సౌబలుండు
కొమ్మయగు దుస్ససేనుఁడే ♦ కుసుమఫలము
పోల్ప నా ధృతరాష్ట్రుఁడే ♦ మూలశక్తి.

చ. తలపగ ధర్మవృక్షమగు ♦ ధర్మతనూజుఁడు, స్కంధ మారయన్
బలరిపు సూతి, శాఖయగు ♦ వాయుసుతుండు వృకోదరుండు, పూ
వులును ఫలమ్ములా కవలు, ♦ భూసురు లేనును నాల్గువేదముల్
విలసిత మూలసంచయము ♦ వేయు నికేటికి? నమ్ము, సంజయా!

క. కాని మొక్కపరి కరిపురి
కే నేతెంతును వచింతు ♦ హిత వికనైనన్
భూనాథుఁడు వినెనా సరి
కానున్నది కాకపోదు ♦ కన్ వినకున్నన్.

వ. అనివిని సంజయుండట్లు సేయుట లెస్స యనిపల్కి యెల్లరికడ సెలవంది ధర్మజాదులు తన్ను సగౌరవమ్ముగ బనుప నుపప్లావ్యంబు వీడ్కొని ప్రొద్దుగ్రుంకునంతకు గరిపురమ్ము సొచ్చి ధృతరాష్ట్రుం గని పాండవుల సేమ మెఱింగించి యచ్చటి విశేషంబులం జెప్పె నిట ధర్మనందనుండును శ్రీకృష్ణభగవానుం గాంచి యిట్లనియె.

బిలహరి – ఆది.

ప॥ సారాంశము తెల్లమయ్యెనేగద! – సర్వము సంజయరాయబారమున
అ॥ ప॥ పోరాటము గాకుండ కార్యమేతీరునం జక్కబడదని తోచును

చరణము

తగును కార్యసాధనకునై సామ - దాన భేద దండోపాయమ్ములు
జగడమేల నీయోపినయంతకు-సంధిగూర్ప యత్నించిచూడుమా ॥సా॥

మ. మను గాపాడగ నిన్నుజూపి చనియెన్ ♦ మాయయ్య యానీకటా
క్షమునం గష్టములన్నియుం గడచె సం ♦ గ్రామమ్ము గాకుండ ని
ల్పుమ యెల్లేనియు మామకోభయకు ల♦మ్ముల్ సంధిగావించి సా
ధ్యముగాకున్నెడ నాసుయోధను ససో♦దర్యమ్ము గూల్పింపుమా!

శా. ఐదూళ్ళిచ్చినజాలు మాకనును, సే ♦ యంజాలడో జ్ఞాతివా
ౘై దుర్యోధను డింతమాత్రమును, నే ♦ లా? బాంధవశ్రేణి దా
యాదవ్రాతము గూల్చి చేకొనెదు రా ♦ జ్యం, బీ విపదాఽర్థి నెం
తే దాటింపగ గర్ణధారుడవుగ ♦ మ్మా, మాకు దామోదరా!

వ. అనినవిని వాసుదేవుండు ధర్మజుంగని.

ఉ. ఎంతటి ధర్మరాజవో? హ ♦ రించి దురోదరమందు సంపదల్,
గాంతకు గొల్వుకూటమున ♦ గాని పరాభవమ్ముం బొనర్చి, మి
మ్మెంతలు జేసియున్ వనుల ♦ కంపిన దాయలు చుత్తురంచు నీ
వంతున జాలినం దెదవు బా ♦ పురె! రాచరికంపు ధర్మమే?

శా. కాని మ్మేగుదు హస్తినాపురికి గం ♦ గానందనాదుల్ కరం
బానందింతురు మీవిధమ్ము విని, లో ♦ పాలోపము ల్లేలు, నా
పై నిందింతురు వారి నెల్లరును, యా ♦ వచ్ఛక్తియుం జూపి బా
వా! నాయోపినయంత బలుకుచు సభన్♦వారింపగా యుద్ధమున్.

వ. అనిపల్కి భీమసేనుం గని సంధివిషయమై ఏయభిప్రాయం బేమన
నతండును.

పూరి - రూపకము

ప॥ అడుగు దప్ప రీ పాండవు - లన్న మాట కెన్నడైన ॥న॥
అ॥ ప॥ ఇడుమ లెన్నియోనింతకు - నెక్కుడు ప్రాప్తించుగాక ॥అ॥

చరణము

కొడుకులతో బాటు సరిగ - పుడమి పంచిపెట్టుమనుము
వెడగుల మాటల చెవినిడి - చెడవలదను మాధునితో ॥నడు॥

శా. పాలీకున్న గదాభుజంగికి సుత ♦ ప్రాణానిలమ్ముల్వడి
న్బాలైపో మను వృత్తిగూర్తు దనకు ♦ గాంధారికిం బేర్మి, దా
సీలై భానుమతీముఖాంగనలటన్ ♦ సేవించుచో గల్గు బాం
చాలిం బట్టముగట్టు దేననుము రా ♦ జ్యంబెల్ల మాయన్నకున్.

వ. అనిన నర్జునుంగని నీయభిప్రాయం బెఱింగింపుమన నతం డిట్లనియె.

ఉ. సాహసవృత్తిమై ననుజ ♦ సౌబల కర్ణసహాయుడై రణో
త్సాహమునన్ సుయోధనుడు♦తానొగి సంధి పొసంగ నీనిచో
బాహుపరాక్రమ క్రమము ♦ భాసిల నుగ్రరణమ్ములోన బా
ణాహుతిసేతు నారథికు ♦ లందర నేనొకడన్ శరాగ్నికిన్.

వ. అనునంతలో నకులుండిట్లనియె.

ఉ. వారిబలమ్ము వారు, మన ♦ వారిబలమ్మును మేము మెచ్చుకొం
టూరయ నైజధర్మమగు ♦ నందునలేదు ప్రయోజనంబు గా
దే, రణమందు సాయకము ♦ లే తెలుపంగల వీ వితర్క మే
లా, రయమేగి యోపిన కొ ♦ లంది వచింపుము సంధిగూర్పగన్.

వ. అని పల్కిన విని గోపాలుండు సహదేవుంగని నీయభిప్రాయం
బేమన నతడిట్లనియె.

చ. అడిగితి వీవు గావున ము ♦ రాంతక! చెప్పెద నాలకింపుమా
యొడబడ డిట్లు సంధికి సు ♦ యోధను డాలముగాకతప్ప దా
చెడుగులు నూర్వురు న్వడి న ♦ శింతురు సేనలతోడ నాజిలో
బుడమి సమస్తమున్ శమన ♦ పుత్రునిపాలగు నేనెఱుంగుదున్.

వ. అని పల్కిన సహదేవుని వాక్యమ్ములువిని సాత్యకిప్రముఖరథికవరు
లెల్లరు నభినందించి రంతలో ద్రోవది గోపాలదేవుంగని దైన్య
మ్మున నిట్లనియె.

జంఝూటి - ఆది

ప॥ అన్నా! సంధిఘటింపకుమా నన్నంతలు జేసిన చెనటులతో ॥నన్నా॥
అ॥ప॥ బన్నమందిరి ఖగతురకుజాలకీ తెన్ను నంభోజ్ఞిదువడియువర ॥యన్నా॥
1. ఆ[illegible]పృథమున శుచి-యాగు వేణిం గొనియాడ్చిన పా-పాత్ములతో॥

2. దుస్ససేను తను - వింతలింతలుగ తునియలై చెదర- గనునంతకు॥
3. కౌరవాగ్రజుని పీనుంగును గ-న్నార ధర్మజుడు నేనుజూతు॥మన్నా॥

ఉ. ఓరిమి నీపరాభవము ♦ లోర్చితి జివ్వొడిగట్టినట్టు లే
తీరున నాఱు కెన్నడును ♦ దీనికి గల్గదు తోడబుట్టువీ
వారయ దుష్టనిగ్రహుండ ♦ వాత్మవిభు ల్జగదేకవీరులే!
వేఱొక యాడుదానికి ల ♦ భించునె సౌఖ్యము నాకె లేనిచోన్?

సీ. భీముండు కురుపతి ♦ పెందొడల్ విఱచి దు
శ్శాసను ఱొమ్మున ♦ స్రమ్మ్రదావ,
సవ్యసాచియు నంగ ♦ జనపాలు దునుమాడ,
నలనాడు గడు ప్రజ్ఞ ♦ లాడినారు,
అంతకుం జాలదు ♦ రైననేమి? యుధిష్ఠి
రాజ్ఞ మీఱరు ప్రశాం ♦ తాత్ములగుచు
గాన నేను సుభద్ర ♦ కయ్యమ్మునకు జని
ఏడాట లాడించి ♦ యేపడంచి

తే. గీ. కర్ణ దుర్యోధనాదుల ♦ గని మసంగి
ధారవోయుదు మింక త ♦ త్ఫలమునరుని
గాండివమునకు, భీముని ♦ గదకు, వారి
ప్రతినలును జెల్లు నా ♦ మనోరథముదీరు.

వ. అనిపలుక ద్రోవది నుచితవచనమ్ముల నూరార్చి యెల్లరికడ సెల వంది జలజాక్షుండు మఱునా డరుణోదయమ్మున శైబ్య సుగ్రీవ మేఘ పుష్ప వలాహకంబు లనంబరగు తురంగములం బూన్చి వైనతేయ ధ్వజంబెత్తి దారుకుండు తెచ్చిన రథమ్మున సాత్యకి సమేతమ్ముగ నెక్కి, కుంతినెంతయు నూఱడింపుమని పల్కి- ధర్మజాదుల వీడ్కొని చనిచని యొక్కయెడ నారద జమదగ్ని కణ్వాది మహామునులం గని నమస్క రించి రాయబారంపు వచనంబు లాకర్ణింప వచ్చిన యమ్మహర్షుల దీవన లంది సాయంసమయమునకు గుశస్థలమ్ము సేరి యయ్యెడ బట కుటీర మెత్తించి విడిసె. కరినగరమ్మున నాంబికేయుండు శ్రీకృష్ణుని రాక విని విదురాదులంగలసి సంతసించుచుండె.

శ్రీ

# మహాభారతము

## శ్రీకృష్ణుని రాయబారము.

భైరవి - ఆది

ప॥ శ్రీకృష్ణుని రాయబారచరితము - చెప్పెద నాలింపు డనఘులార॥శ్రీ॥

అ॥ ప॥ ప్రాకట ధర్మాధర్మనిరూపిత - లౌకికజ్ఞాన సంధాయకమిా॥శ్రీ॥

చరణము

శౌరి కుశస్థలినుండి కరిపురికి - జనుదెంచిన ధృతరాష్ట్రు డెదురేగి
గౌరవమ్మగా దోడ్కొని చనియ-ర్ఘ్యపాద్యాదివిధులం పూజించెను॥శ్రీ॥

సీ. అర్చించి యుచితాస ♦ నాసీను గావించి
వెల్లరిసేమమ్ము ♦ లెఱుగునంత
విదురునిగాంచి గో ♦ విందు డిట్లనియె 'నీ
యింటికి విందున ♦ కేను వత్తు'
నామాట నల కౌర - వాగ్రజుం డాలించి
తగునె? నీతికిని బాం ♦ ధవమునకును
వెలియగు నేత గా ♦ వింప నీకన, గృష్ణు
డా సుయోధనున కిట్లనియె నొత్తి

తే. గీ. 'పాండుతనయుల దూతనై ♦ వచ్చినాడ
కార్యముం దీర్చి యామీాద ♦ గారవింపు
రాయబారి ముందుగ దిన ♦ రాదు నీవె
ఱుంగవే?' యన ననియె దు ♦ ర్యోధనుండు.

క. అగు గాకుండును కార్యము
నగధర ! నాయింట గుడిచి ♦ నావలన న్నీ
కగు కార్యం బెఱిగింపుము
తగునే నీబోటి కీ వి ♦ ధమ్మున సేయన్ ?

వ అనవిని దేవకిపట్టి గాంధారిపట్టి కిట్లనియె.

ఉ. పాండుకుమారు లేవురును ♦ ప్రాణసములు నాకు, నీవు శ
త్రుండవు వారి కేగతి హి ♦ తుండవు నాకగుదీవు? గాన శ
త్రుండిడు నన్నముంగుడుతు ♦ రో! యమృతమ్ము విషమ్ము వోలెగా
కుండునె? యంగరక్ష తగ ♦ దో, తనువస్థిర మో సుయోధనా !

వ. అని సమాధానమ్ము సెప్పి కృష్ణుండు కుంతీసదనమ్మున కరిగి ధర్మ జాదుల సేమమెఱిగించి యాపె నూరార్చి విదురుగృహమ్మునకుం బోయిన విదురుండును సంభ్రమంబున నెదుర్కొని దేహోపచారం బుల నర్చించి కాంచన రత్నపాత్రమ్ముల భక్ష్యభోజ్యములు వడ్డింప జేసి పూల సురటితో విసరుచుండ బుండరీకాక్షుండు సాత్యకి సమే తింబుగ విందారగించి తృప్తుండై నిత్యంబును బ్రాహ్మణసమా రాధనం బాయింట జరుగునట్లు విదురునకు వరంబిడి యారేయి యయ్యెడ నిద్రించి ప్రభాతమ్మున మేల్కొని తనకై వచ్చిన దుర్యో ధనాదులం గలసి విదురుహస్తం బొక కేలను, సాత్యకిహస్తం బొక కేలను బట్టి రాజసభామధ్యంబునకరిగి తనకై యమర్చిన రత్న సింహాసనం బలంకరించి మేఘగంభీరంబగు నెలుంగొప్ప నాంబి కేయున కిట్లనియె.

మోహన – రూపకము

ప॥ మానితసుచరిత్రా మా – మా, సత్యవతీపౌత్రా ॥మా॥

అ॥ ప॥ నేనీకురుపాండవులకు నేస్తముగూర్పగ వచ్చితి ॥మా॥

చ ర ణ ము

1. తమ్ముని కొడుకులు నగపా – లిమ్మని రిష్టపడ వేని
నెమ్మయి నైదూళ్ళేనియు – నిమ్మని యేవురు వసింప ॥మా॥

2. పాలు నీరు గలసినట్లు - వారు వీరు గలసి పుడమి
నేలుసట్లొనర్పు మిదియ - మేలు నీకు సము లుభయులు ॥మా॥

ఉ. పెంచితి తండ్రిలేని పసి ♦ పిల్లల, బెద్దల జేసితీవు, నే
ర్పించితి విల్లువిద్దియల ప్రే ♦ ముడి బుత్రులతోడి పాటుగా
మించితి వింతదనక, నడు ♦ మ న్విడనాడుట నీకుధర్మమే ?
మంచికి జెడ్డ నన్నిటికి ♦ మామ! మఱెవ్వరు ? నీవయేగదా !

ఉ. వారికి వీరి కెల్లరకు ♦ భారతవంశమునందు బెద్ద వీ
వారయ, ధర్మమెయ్యదియొ ♦ యట్లొనరింపుము పుణ్యపాపముల్
జేరుననిన్నె, యేరికెటు ♦ జెప్పగ నొసటు జెప్పుకొమ్ము నీ
కీరితి నిల్పుకొమ్మురగ ♦ కేతను దిన్ననిత్రోవనుంచుమా.

ఉ. మంచితనంబెసూపుచు గు ♦ మారుల నేవినిపించెదో? స్వాంతం
త్రించెదవో? యొకించుక యె ♦ దేనొక దారికి రమ్ము, కానిచో
మించును కార్యమెట్లు నిక ♦ మీదను లేదు ప్రయోజనమ్ము చిం
తించినగాని, సంధిపొస ♦ గింపవయేని కులక్షయమ్మగున్.

వ. మఱియు నో యాంబికేయా! నీ యెఱుంగనిపనులు లేవు. ఐనను భారతాన్వయము ప్రియంబంద బందుగులకు హితంబు దెల్పవచ్చితి వినుము దుర్యోధనుం డాదిగాగల నీ తనయు లధర్మారంభులై స్వార్థపరత్వమున వంశమర్యాదల నతిక్రమించి మొదటినుండియు నకార్యాచరణమునకు వెనుదీయకుండిరి. అట్టి మోరకులగు నీ కుమారుల నీవ మందలించి జగతింగల రాజన్యులందరు నీకు పాదాక్రాంతులుగా జతుస్సముద్రవేలావలయితంబగు నీ ధరామండలం బేలుటొప్పదే? ఇట్టియెడ నీ వుపేక్షాపరుండవగునెడ గౌరవపాండవులకేగాక భూప్రజకెల్లం గీడువాటించిన దురితం బందెను. కౌరవపాండవులయం దేరికి దుర్మరణమ్ము సంఘటిల్లి నను తద్దుఃఖానుభవమ్ము నీకుగాదే! సమానవిక్రమాఢ్యులగు వీరాంఢారు లకాంణమ్ముగ నిశితాశుగమ్ముల యాపుదాయుట సహింపనగునే! నీప్రాభవమ్మును నీతియు శాంతియు నెల్లరాజు

లుంబొగడ నుభయపక్షమ్ములరక్షించుకొనుము. నీపనుపునం బది రెండు వత్సరమ్ములు వనవాసమ్మును, నొక్కయేఁ డజ్ఞాతమ్మును సలిపి యెల్లచుట్టమ్ములు నేడుగడయు నీవయని తలంచి ధర్మముగ నర్ధరాజ్య మర్థించుపాండవుల సందేశమాలించి కులంబు పాడిసెడ కుండ గాచుకొనుము. ధర్మము పాపంబునను, సత్య మనృతంబు నను నశించునెడ దక్షు లుపేక్షించుట విలయమ్మునకు మూలము గాదే? కాన వారి తండ్రి పాలువారికిడి నీభాగము నీవు సపుత్ర పౌత్రకమ్ముగ ననుభవింపు మెల్లరకు హితంబగు నిన్నఖిల రాజన్య వరులలో నసమాన వైభవుం జేయుతలంపున ధర్మజుండు దిగ్విజ యంబు సేయు ప్రాభవంబున కోర్వఁజాలక సుయోధనుండు సౌబలాదులం గూడుకొని కూటద్యూతంబు నెపంబున సర్వస్వము హరించి పైపెచ్చు సభామధ్యంబున బాంచాలి కట్టుపుట్టంబు లొలువ నద్దానికి నీ వోడంబడుట ధర్మజుండు గుర్తించె. సత్య సంరక్షకై భీమార్జునుల కోపాటోపమ్ము లుడిపి కంటినీరొత్తుకొని వనవాసమ్మున సమస్తక్లేశమ్ము లనుభవించియు బంధుభావంబు నకు వెఱచి నన్నిట కంపిన సత్యప్రతిజ్ఞుండగు యుధిష్ఠిరుపట్ల లోభం బుడిగి సోదరసహితంబుగ ధర్మజు నిప్పుడ రావించి మీరును వారునుం బంచి కుడుచుట శ్రేయస్కరంబని పల్కు శ్రీకృష్ణుని వాఙ్నైపుణికి సదస్యులెల్లరు బులకాంకితశరీరులై యౌరా! గోపాలుడింత యొప్పు బల్కునే? యిట్టి నయ కోవిదుం డును, ధీరుండును నెందేని గలడే యనుచు నచలాకృతులై యున్నెడ ధృతరాష్ట్రుండును వాసుదేవున కిట్లనియె.

ఉ. అంధుఁడ నౌట భూవలయ ♦ మంతయు బాండునృపాలుఁడేలె, గ
ర్వాంధులు నాకుమారు లిపు ♦ డయ్యది యేలుచునుండి, రెట్టిసం
బంధము లేదు రాజ్యపరి ♦ పాలనమందున నాకికేగతిన్
సంధిఘటింతు? దూఱెదవు ♦ సర్వమెఱింగియు నన్ను నల్లుఁడా!

వ. అని పల్కు నమ్ముదుసలి వాచాకౌటిల్యమునకు వాసుదేవుం డేవ గించుకొనుచు.

కన్నడ - ఆది

ప॥ నీయోపిసకొలది చెప్పిచూడుము- నేడే నీకుటిలత విడనాడుము॥నీ॥

అ॥ ప॥ మాయోపాయము లింక సాగ వో
మాఁము ॰ కార్యము బహుదుర్భరమా ॥నీ॥

చ ర ణ ము

1. పెద్దవాడవనుచు బల్కు- నానుడి-పెడచెవిబెట్టకుమా యగు నలజడి
పద్దుదీర్చివచ్చినపాండవులకు-ముద్దువచ్చినపుడెచంక కెక్కుము ॥నీ॥

2. రణమో, శుశ్రూషయొ పాండవు - లొనరింపగ నున్నారు నీపట్ల
వెనుకముందు లరయకున్న నీకుల-విధ్వంసము గాకుండదిప్పట్ల॥నీ॥

ఉ. సూతుని మైత్రిచే దెగువ ♦ సూపుడు వచ్చిరి గాదె నీతనూ
జాతులు? సాగెనిందనుక ; ♦ సాగవు కర్ణుల వేవురన్ బలా
రాతిసుతుండె గూల్పగ గ ♦ లం, డతిమానుష తేజుడై పురా
రాతిని సైతముం గెలిచి ♦ లావును జూపడె యింత యేటికిన్.

వ. అనిన విని వైచిత్రవీర్యుండు సుయోధను నేరంబిలిచి.

సీ. కల్పాంతమగు వేళ ♦ గడలిలో వటపత్ర
శయనుడై నిద్రించు ♦ శాశ్వతుండు
భువనము ల్పదునాల్గు ♦ బొజ్జలో నిముడించి
♦ పరిపాలనము సేయు ♦ భద్రమూర్తి
నిరత సంభవ జరా ♦ మరణ దుఃఖము లెవ్వి
యెఱుగని యోగీశ్వ.♦ రేశ్వరుండు
సనకాదిముని మనో ♦ జలజాతముల నర్త
నము సేయు సచ్చిదా ♦ నందమూర్తి

తే. గీ. పాలమున్నీటిరా పట్టి ♦ వలచు మగడు
కమలభవు బొడ్డుతామరం ♦ గన్నవాడు
పార్థసారథి దూతయై ♦ వచ్చె నార !
చేరువకు బనిగల్గి కు ♦ మార ! నేడు.

క. ఇచ్చెదొ సగపా, లైదా
ళ్ళిచ్చెదొ? సీతోచినట్లు ♦ లిడి పంపుము, వి
వ్వచ్చుని గెలువగలాడని
మెచ్చకు మీకర్ణు, సంధి ♦ మేలు, కుమారా!

వ. అనునంతలో గాంధారియు సుయోధనుం గని యిట్లనియె.

సీ. తొలుతనుండియు మన ♦ కులమున నిలుచు రా
జ్యంబు కనిష్ఠకు ♦ టుంబమందె
వినవొ, యయాతినం ♦ దనులలో జ్యేష్ఠుండు
యదుడు మదోన్మత్తు ♦ డగుట జేసి
రాజయ్యె బూరు న ♦ రపతి, దేవాపి బా
హ్లిక శంతనులలో మ ♦ హీశుడయ్యె
శంతనుండాపై వి ♦ శాంపతియయ్యె వి
చిత్రవీర్యుడు నదీ ♦ పుత్రుడుండ

తే. గీ. కడగి నీజనకుని సమ ♦ క్షమున బాండు
నృపతి రాజ్యమ్మ సేయుటే ♦ వెఱుగవొకొ?
ధర్మసుతుడు రాజగుటయే ♦ తగును గాన
చెడక వారలతో సంధి ♦ జేసికొనుము.

వ. అన విని దుర్యోధనుండు తలిదండ్రులం గని,

కాంభోజి—ఆది

ప॥ చెప్పదగిన వారలు గావుననిటు-చెప్పిరిచాలింపుడు మీధోరణి॥ చె॥

అ॥ప॥ఒప్పుకొంటనైమదూల్లిడవారల-కోడినయటులొగా దేతలపగ॥ చె॥

చ ర ణ ము

1. ఎటుగలియుదు నే డన్యోన్యమైత్రి - యిటపరస్పరాపకారులకు మా
కటకట మేగాని లోనిపగలు బ - యలిచెల్మలుగాక మాకు వారికి॥
2. ఊళ్లైదింటి నొసంగుడంచు మా - యోపాయం బిటు పన్ని రేగాని
కల్లగాక నిజముగా దమకు భా-గంబున్నెడ నీగతి యాచింతురె॥ చె॥

తే. గీ. తమ్ముని కుమారులంచు బా ♦ లిమ్మనెదవు
తమ్ముడగు పాండునరపతి, ♦ దండధర స

మీర శస్త్రాశ్వనులు తమ్ము ♦ లైరె? నీకు
చెప్పుకొనుటకు సైతము ♦ సిగ్గుగాదె?

చ. కలనయినం దలంపకుడు ♦ కయ్యమునన్ మము బాండవేయులే
గెలుతురటంచు, బెండ్లి మటు ♦ కీడ్వడజూచుచు నూరకుందురే?
బలముగలట్టి వారయిన ♦ బాపురె! వారికి మాకు సంధియా?
నలువురు నవ్వరే వినిన? ♦ నాకడ జెప్పకు మిట్టిమాటలన్.

శా. ఈకంసారివచించు మాటలకు నెం ♦ తేజంకుచున్నారు తం
డ్రీ! కర్ణుండును నేను నాయనుజులు ♦ న్నిల్వన్ రణంబందు ము
ల్లోకమ్ముల్బయి నెత్తివచ్చినను ♦ గెల్తు, న్నమ్ము నామాట లీ
వాకౌంతేయులతోడి సంధివలద ♦ య్యా! నాకుమిమ్మాటికిన్.

వ. అనవిని గాంధారి కుమారుంగని,

మం జ రు లు.

విను జరాసంధ హిడింబ కీచక - భీమసేనులు నీవున్
తనయా! యొక్కగురునికడను సహా - ధ్యాయులు మీ రేవురునున్
దూరమున మీరొకనిచే దక్కిన - ల్వరునుం జావగలరని
గురుడు మిమ్ము శపియించెనని వింటి - మతి వడముడిచేత నని
బడ నీవొకడవె మిగిలియున్నావు - కడకు, నామాట వినుము
దుడుకుదనముమాని పాండవేయుల - తో సంధిజేసికొనుము.

క. అనిన సుయోధను డిట్లనె
జననీ! గురుశాప మొకట ♦ జరుగునయేనిన్
విను సంధిజేసినను త
ప్పునొకో చా, విట్లు పలుక ♦ బోలునె నీకున్?

వ. అనిపలుక దుర్యోధనుకోఅగామికిం గటకటపడుచు భీష్మాది కురు
వృద్ధులును, ద్రోణాదిగురువృద్ధులును, నారదాదిమహర్షులును
సంధి కొడంబడుమని యెంతయును బోధింప వినకున్న సుయో
ధనుం గని మధుసూదనుం డిట్లనియె.

హంసధ్వని - ఆది.

ప॥ తెలియనేరకున్నావు పాండవుల-బలిమి నేటిదనుకన్ను సుయోధన ॥ తె॥
అనుప॥ గెల్వవజాలునో కౌ-కడెవారిలో గలననిలిపిపదునాల్గులోకము. ల॥

చ ర ణ ము

ఓడింపడె మిమ్మెల్లర విజయుం-డుత్తరగోగ్రహణమునా డొకడె
తోడులేని క్రీడికొలది యట్టిది తోడై నేవచ్చెద నాలమునకు ॥ తె॥

సీ. పడగపైగల గాలి ♦ కొడుకు చూపలకెల్ల
భయసంభ్రమంబులు ♦ బాదుకొల్ప
పిడుగులుబడిన కై ♦ వడి బిట్టు ధ్వనియించు
చిందమ్ము గుండియల్ ♦ సెదరజేయ
తెలుపిలేకుండ గాం ♦ డీవము చండాంబక
కాండము ల్గురిసి చీ ♦ కాకుపఱుప
పాశుపతాది ది ♦ వ్యశరాగ్నికీలలు
తవిలి సైన్యాటవిం ♦ దగులబెట్ట

తే. గీ. తెల్లగుఱ్ఱాలు గూర్చిన ♦ తేరినుండి
దండముంగొని నేదోలు ♦ చుండ క్రీడి
మొనల జెండాడుచున్నప ♦ ట్టున మొఱలిడి
సంధికావలె నన్నను ♦ జక్కబడదు.

ఉ. తమ్మునిఁ బొమ్మ జీలిచి పృ ♦ థాసుతుమధ్యము డా బకారి ర
క్తమ్మును ద్రావునాడును, వ ♦ దంపడి నీతొడ లాజిలోన భ
గ్నమ్మొనరించునాడు నొగి ♦ గావలె నన్నను సంధిగాదు, నీ
నమ్మిన కర్ణు డేమియు నొ ♦ నర్పగజాలడు కౌరవేశ్వరా!

వ. అనిపల్కు- మురారిం గని కోపగించుకొనుచు దుర్యోధనుండు దుశ్శాసన కర్ణ శకునులం గలసి సభనుండి తొలంగి చని దుర్మంత్రంబునకుం జొచ్చి కృష్ణుని బంధింప దలంచి పగ్గములంగొని యొకంతకు నోలగంబునకురా భీష్మ విదురాదు లెంతయు వారింప దలకొన్నను వినక దుష్కార్యమ్మునకు నుపక్రమింపబోవు నెడ గోవిందుండును మందహాసమ్మున గాంధారీనందనున కిట్లనియె.

మోహన - ఆది

ప॥ నను బంధించెదవా - దుర్యోధన ॥నను॥

అ॥ నను బంధింపగ నగు పాభక్తున-కు, చెనటివి నీవీ చేతకు దెగితివి

మ॥ నను భంజింప నెల్లసంసారబంధములు పటాపంచలై పోవు నన
పనికిమాలినట్టి నీచేతగల రజ్జువులా నన్ను బంధించునవి ॥నను॥

చ ర ణ ము

భళిరా! రెయొక్క-నిజేసి నన్నిచట్ట - బరిమార్పగ దలపోసినాడవా
తులువా నేచిక్కె-దననుకొంటివ-దురితఫలం బనుభవింప నుంటివి॥

మ॥ పలుగాకివి రాచపాడియెఱుగవి - పసరంబవు నీతో నుడు లేటికి
కలవారింగూడుకొని రమ్మింక-గనుపర్చెద గనుమీ నాతమాస॥న॥

వ. అని పల్కుచు లీలామాత్రమ్మగ నట్టహాస మొనర్ప.

సీ. ఫాలస్థలంబున బ్రహ్మ, ♦ వక్షమ్మున
నంబికాపతి, ముఖం ♦ బందు వహ్ని,
పార్శ్వంబుల మహేంద్ర ♦ పౌలస్త్య యమమరు
ద్విశ్వ లాదిత్యులు ♦ నశ్వినులును,
సవ్యదక్షిణ భుజ ♦ స్కంధమ్ముల హల గాం
డీవ యుక్తులు బల ♦ దేవ నరులు,
పీపున నాయుధో ♦ పేతులై చెలగు యు
ధిష్ఠిర భీమ మా ♦ ద్రీతనయులు,
అఖిలాస్త్రయుతపాణు ♦ లై యూరులన్ యదు
వృష్టి భోజాంధక ♦ వరులు
కరముల శంఖ చ ♦ క్ర గదానిశిత ఖడ్గ
శక్తి ప్రముఖ మహా ♦ సాధనములు
శ్రోత్ర నాసా నేత్ర ♦ సుషిరమ్ములను ధూమ
సహిత పావక శిఖా ♦ సంచయములు
ఘనరోమకూప మా ♦ ర్గమ్ముల ప్రళయార్క
సన్నిభ సత్ప్రభా ♦ సముదయములు

తే. గీ. కలిగి యెంతయు దర్శనీ ♦ యమగు విశ్వ
రూపముం జూడనేరక ♦ లోచనముల
మోడ్చి యొకట భయాన కా ♦ ద్భుతరసాంబు
నిధి సభాస్తారులెల్లను ♦ నింగి రంత.

ఆ. వె. తనర నారదాది ♦ మునులకు సంజయ
భీష్మ కుంభజన్మ ♦ విదురులకును
వనజనాభు డిడియె ♦ దనవిశ్వరూపమ్ము
దేటపాఱజూడ ♦ దివ్యదృష్టి.

తే. గీ. ఆమ్మహాసంకులం బెల్ల ♦ నాంబికేయు
డెఱిగి హరి విశ్వరూప వి ♦ జృంభణం బ
టంచు విశ్వేశు గనుగొన ♦ నభిలషింప
దేవదేవు డాతని కిడె ♦ దివ్యదృష్టి.

వ. అట్లు ధృతరాష్ట్రుండు శ్రీహరిం గని వినుతించి పరమేశ్వరుం జూచిన కన్నులతో నొండెద్దియుం జూడనొల్లక దివ్యదృష్టి నుపసంహరింపు మని కమలాక్షుని వేడ శ్రీకృష్ణుం డట్లొనర్చి తనవిశ్వరూపం బుపసంహరించి నారదాది మహర్షుల నంతర్ధానమ్ము సేయించి యెల్లరికడ సెలవంది సాత్యకిసమేతమ్ముగ బయనమై పోవునెడ నాంబికేయుండు దీనవదనుండై యిట్లనియె.

నాదనామక్రియ - రూపకము.

ప॥ నీసంకల్పమ్ము తెలియ - నేర దెరికైన గాని ॥నీ॥
అ॥ ప॥ వాసుదేవ నాకేగతి - వచ్చునో గదా నీకెఱుక ॥నీ॥

చరణము

సుతులనూర్వురం గాంచితి - సురభోగముల న్మించితి
చితివిధి పాండవులచేత - జేయింతువో నాకు గడకు ॥నీ॥

ఉ. ఓపిన యంతవట్టుగ న ♦ యోక్తుల జెప్పితి నాలకింప రీ
పాపులు, ముందురానగు న ♦ పాయ మెఱుంగరు, పాండవేయులా!
సైపరు పీరి, నీవయిని ♦ సర్వము నీవొగి నిర్వహింపగా
నోపుదు వీవిపద్వనధినుండి ♦ మఱింతుల నొడ్డుజేర్పుమా!

క. అని పలుక నంతనృపు వీ
డ్కొని సర్వంబెఱుకపఱచి ♦ కుంతికి, కర్ణున్
దనయరదంబెక్కించుక
జనుచు రహస్యముగ బలికె ♦ సంప్రీతి మెయిన్.

శ్రీరాగము - ఆది

ప॥ సావధానముగ నాకర్ణింపుము-బావా నీకెఱిగింతురహస్యము ॥సా॥
అ॥ ప॥ యీ వుదయించితి వామార్తాండునికృపచే
గుంతికి కన్నెప్రాయమున ॥సా॥

చ ర ణ ము

1. రాధేయుండవుగావు పాండుభూ - రమణునకీ వగ్రతనూజుండవు
సోదరు లాధర్మజాదు లేవురు - సోదములరా! వారామోదింతురు॥
2. కుంతిచేత రవిచేత సాక్ష్య మి - ప్పింతు నీకు కౌంతేయుడ వీవని
యెంతయేని మేదినీవలయు మే-లింతు సార్వభౌమునిగా నొనర్చి॥సా॥

సీ. అసమాన విత్యస ♦ త్యవ్రతరతుడు ధ
ర్మతనూభవుండు చా ♦ మరములిడగ
బలవిక్రమాతి సం ♦ పన్ను డా వాయునం
దనుడు సితాతప ♦ త్రమ్ము బట్ట
వివిధాస్త్రశస్త్ర మ ♦ ర్మవిదగ్రణి కిరీటి
సారథియై రథా ♦ శ్వముల దోల
పాంచాల యాదవ ♦ పాండ్య మాత్స్యులు నేను
మినుముట్ట జయజయ ♦ ధ్వను లొనర్ప
తే. గీ. నలరి యభిమన్యు డంకమం ♦ దధివసింప
ధౌమ్యు డభిషేచనంపు మం ♦ త్రాలు సదువ
నీకు జరుగును పట్టాభి ♦ షేక మచట
గావునన్ ధర్మజాదుల ♦ కడకు రమ్ము.
క. అన్నలమిన్న, యయోనిజ,
పున్నెమ్ములప్రోవు, ద్రుపద ♦ పుత్రిక యనురా

క. విను ధర్మజుచెంతకు నా
జననరహస్యమ్ము దెలుప ♦ జనకుము, రాధే
యుని పూతజీవితము జెఱ-
చినపాపము దాన నీకు ♦ జెందుగదమ్మా!

చ. జలముల ద్రోయగాబడి వె ♦ సన్ జనయిత్రికిగూడ భారమై
నలువుర జుల్క నౌటకు మ ♦ నంబున గుందను, పెంచి పెద్దగా
సలిపిన రాధ, నంగవిభు ♦ సల్పి సదా మనసిచ్చి మిత్రుడై
యలరు సుయోధనుం బ్రమ ♦ దమ్ముందగ జేయగ గుందుకైవడిన్

వ. అని పల్కి యర్జునుండుదక్క దక్కిన నీకొమరులు యుద్ధమ్మున నాచేజిక్కినను జంపనని పల్కి కుంతికి నమస్కరించి వీడ్కొని నిజ నివాసమ్మున కరిగె నట శ్రీకృష్ణుండును గౌరవసభావిశేషమ్ముల ధర్మజాదులకెఱింగించి రణోత్సాహులం జేసి ధృష్టద్యుమ్నుని సేనానాయకుం బొనర్చి ద్రుపద, విరాట, సాత్యకిప్రముఖుల దండనాథులగా నొనర్చి యుద్ధభేరి మ్రోయించె నంత పాండవులు మంగళతూర్యారావమ్ము లెసగ నాంగికమాంగల్యసూచకంబులు సేకొనుచు సైన్యసమేతమ్ముగ గురుక్షేత్రంబుం దఱియం జొచ్చి హిరణ్వతీనదీతీరమ్మున స్కంధావారంబు లేర్పఱచుకొని యందు విడిసిరి. కౌరవులును సైన్యసమేతమ్ముగ నా కురుక్షేత్రమునకుం జేరి యొక్కరమణీయ ప్రదేశమ్మున విడిసిరి.



శ్రీ

# మహాభారతము

## చక్రధారణము

ఆనందభైరవి - ఖండగతి

ప॥ చక్రధారణకథా - శ్రవణమే సార్థకము
జనసమందినయందుకు... సభాసదులార ॥చ॥

అ॥ ప॥ విక్రమానూను డమ - రాపగాసూనుడు
త్రివిక్రము ప్రతిజ్ఞా వి - భంగుజేసిన మహా ॥చక్ర॥

చరణము

గాంగేయు న్నాధిపత్యమ్మున కౌరవసేన
కదనమ్మేదిని నిల్పెను - యుద్ధసన్నాహమ్మున
సంగరారంభమ్మునే - సైన్యాధిపతిగ పా
ర్థుని గావించెని - శ్రీహరి పాండునందనుల్లు ॥చ॥

సీ. తన్నర్ధరథు జేసె ♦ నన్నుపేక్షించె రా
ధేయుండు భాగీర ♦ థీసుతుండు
దూరమునం బడుదాక ♦ శరశరాసనముల
జేముట్టనని బాసజేసె ♦ గినిసి ;
సమరమం దేయెడం ♦ [illegible]లుంచినం గాని
యస్త్రసంఘాతమ్ము ♦ నందకుండ
సంజయుం గరుణించి ♦ సాత్యవతేయుండు
నిలిపె యుద్ధవిశేష ♦ ములదెలుపగ

తే. గీ. నాంబికేయుని పొంత, న ♦ య్యవసరమున
ధర్మజుం డాయుధము లర ♦ దమున బెట్టి
చేతులు మొగిడ్చి భీష్మునిఁ ♦ జెంత కేగు
చుంట గని సోదరుల్ వెంట ♦ నంటి యనిరి.

బిలహరి - ఆది

ప॥ అన్నా! పోదువిదేమివిపరీతమాగుమాగుమొందేగదలంచితి ॥యన్నా॥
అ॥ ప॥ చెన్నుసూపు బెన్నడు మనకులజమున
నున్నే? రాచరికంపు ధర్మమే ॥యన్నా॥

చరణము

తాతకుభీతిల్లితివో, ధన్వివ - తంసగురుని విఖ్యాతి కోడితివో?
గౌతమునకు వెఱచితివో? ద్రోణిగని -
కంపించితివో కలతెలుంగుచెప్పుమన్నా॥

ఉ. కౌరవసేనగాదు త్రిజ ♦ గమ్ములు పైబడుగాక పోరిలో
శూరతమై జయింపగల ♦ జోదులు నీయనుజన్ములు; లేటికిన్
ధీరత గోలుపోవ? నల ♦ తిం గనరే? నడరే విరోధు లీ
తీర్పు దలంచి, శౌరికిని ♦ దెచ్చెదవే తలవంపు? లగ్రజా!

సీ. పడరానిబన్నము ♦ లపడిన పాంచాలి నిం
తటి దీనురాలిన ♦ దాని జేసి
భువనమ్ము లేలు త ♦ మ్ముల బాహువీర్యసం
పదలతో తుద [illegible] ♦ వమ్ముసర్చి
సాయమై వచ్చిన ♦ సకల దేశాధీశ
పాళి కెంతయు దల ♦ వంపుదూర్చి
కడలెల్ల పేర్వాసి ♦ గాంచిన భరతాన్వ
యపు గౌరవము వమ్ము ♦ [illegible]

తే. గీ. చనెదవా [illegible] ♦ జనముగా [illegible]
పాలుబోతుదనమ్ము సూ ♦ ప మనయింతి.

కుక్కలకు నైన లేదు, ర ♦ మ్మొకుక్కమా ర
థమ్ము; తెగటార్పుమన్న ! శా ♦ త్రవచయమ్ము.

చ. అనవిని మారుపల్కక య ♦ మాత్మజుడేగు నెడన్ మురాంతకుం
డనె గనుగొంటె నీఘనుని ♦ యాశయముల్ గురు వృద్ధ వీరుల
న్నని ప్రణమిల్లి యానతుల ♦ గైకొనఁబోవు నటంచు, ధర్మనం
దనుడును గెలుపొందుచు పి ♦ తామహుపాలికిబోయి యిట్లనున్

శ్రీరాగము - ఆది.

ప॥ తే నమోస్తుగాంగేయాయ, జగ త్త్రితయ గేయాయ పితామహాయ

అ॥ప॥మానితాంఘ్రికమలాయ రిపులోక మర్దనాయ,సత్యవ్రతాయభవతే

చ ర ణ ము

సకలాశ్రిత రక్షణధురీణాయ - సమరవిజిత భార్గవరామాయ
ప్రకట చాపకళావిశారదాయ-భరతాన్వయ దీపాయ భీష్మాయ ॥తే॥

చ. ప్రియమున దండ్రిలేని పసి ♦ బిడ్డల బెంచితి వింతదనక వి
ద్దియ లెటిగించి మంచితివి ♦ తిన్నగ బెద్దలజేసినాడ వ
న్వయమునబుట్టె నేటికి ర ♦ ణం, బటుగావున నీయనుజ్ఞ నే
గయికొన వచ్చినాడ నన ♦ ఘా! నిను మార్కొని పోరొనర్పగన్.

ఉ. తాతవు, మేము మన్మలము, ♦ తప్పకవచ్చె రణమ్ము నేత, నీ
చేతను దీవనల్వడసి ♦ శీఘ్రమ గెల్తు రిపువ్రజమ్ము నీ
వాతెఱ గట్టిదాను, పగ ♦ వారము కాముగదా ? సమాను లీ
జ్ఞాతులు, పోరిలో జయము ♦ గాంచగ దీవనలిచ్చి పంపుమా!

వ. అన విని గాంగేయుండు ధర్మనందనుం గని.

క. వచ్చితివి నీకు మేలగు
నచ్చిన మనుమడవు నాయ ♦ నా ! రాకున్నం
జెచ్చెర శపించిచంపుదు,
నచ్చపు ప్రేముడిని వేడు ♦ మా వరమిత్తున్.

వ. అనినధర్మజుండును.

చ. వలసెడిదేమి? సర్వము భ ♦ వత్కరుణాపరతన్, లభించె, నీ
వలఘు పరాక్రమక్రముఁడ, ♦ వాయువుమాడిన వాఁడెగాక నీ
న్గలన నెదుర్చువాఁ డెవఁడు? ♦ గావున వేఁడున దేమి? పోర ని
న్గెలుచు నుపాయమేమొ యెఱి ♦ గింపుము నాకిపుడో పితామహా!

వ. అనిన విని భీష్ముండు సస్మితాస్యుండగుచు ధర్మజుంగని నాయనా! నాచేత నాయుధం బున్నంతదనుక సురాసురులకేని వధింప సాధ్యంబుగా దిప్పటికేగుము క్రమ్మఱ నేతెంతువుగాక యనుడు ధర్మపుత్రుండు ప్రణమిల్లి వీడ్కొని ద్రోణుని పాలికిం జని.

శ్రీరంజని – రూపకము

ప॥ గురువరేణ్యా! యిదే శిష్య – పరమాణువు ప్రణమిల్లెడు ॥గురు॥

అ॥ ప॥ కరుణన్నాకాజి జయము – గల్గునట్లు దీవింపుడు ॥గురు॥

చరణము

1. మీపై జూపగనాయెను – మీకడ నేర్చిన విద్యల
సైపందగు నీ మా యప – చారము వీరాగ్రగణ్య ॥గురు॥

2. సురలకేని నిన్నెదుర్ప – నుంతయు సాధ్యముగాదన
నరమాత్రుల మేగతి నిలు – వరింపగలమో తెల్పుమ ॥గురు॥

చ. తనయునికన్న నెక్కుడుగ ♦ తద్దయు ప్రేముడి మమ్ముఁజూచి తీ
వనఘ! కృతఘ్నత న్నుఱుపు ♦ మాశయెగాని నినున్ జయింప మే
మన నొకపాటివారమె? ధ ♦ యామతి నాకెఱిగింపు మేగతిం
బనివడి నిన్ను గెల్వగల ♦ వారమొ? లేనెడ గెల్వ నేర్తుమే?

వ. అన విని శరగురుండు కరంబానందించి,

ఉ. మంతిరివై నన్నుఁ బొందియయి ♦ మాయనవ్వుడే పెనుప్రాపు గాఁగ, మ
మ్మింతగ వేడ నేటికి? జ ♦ యింతువు నీవ, సమస్తమేదినీ
కాంతుడవై చెలంగుము వ ♦ ఖండరమావిభవమ్ము మీఱ నీ
వంతున కేర్పడెన్ జయ మ ♦ వశ్యము మేమెవ్వరెంత పోరినన్.

తే. గీ. కాదు నిటలాక్షునకును న ♦ న్గలన గెల్వ
వినుము! వినరానిమాటను ♦ వింటినేని
యస్త్రసన్యాస మొనరింతు ♦ నద్దిపలుకు-
వాడు సత్యవ్రతుండు గా ♦ వలయునయ్యా!

వ. అనవిని కౌంతేయాగ్రజుండు సంతసించి కృపుడు చిరంజీవి యగుట వధ్యుండుగామి యాతనికడ సెలవంది శల్యుని యనుజ్ఞ వడసి, కౌర్రవ సేనం దేటిపాఱజూచి "నాపక్షమ్మున యుద్ధము సేయ నెంచు వారిం దెవరే నుండిన రండు. వారిని నాతమ్ములట్లుం జూచుకొందు" నని పలుక నిజసేనాసమేతమ్ముగ యుయుత్సుండు ధర్మనందను బలమ్ములం గల్సె నంతలో శ్రీకృష్ణుండు కర్ణునికడకు జన్చి.

సరస్వతి – ఆది

ప॥ పార్థసముని నిన్నా గాంగేయుం – డర్థరథు జేసెనా–రాధేయా ॥పా॥

అ॥ప॥ వ్యర్థమనోరథు జేసెనీకు తల-వంపు దెచ్చెనే నిప్పుడు విన్నాడ ॥పా॥

చరణము

దీన నీకు లోటేమియును లేదు-గాని లోకువగుదు మెల్లరకున్
మానధనుడవిదిచాల దానీకు-మార్గ మొండు తెల్పెదనాలింపుము॥పా

చ. అతనికి నీకు గయ్యమగు ♦ టన్న నసంభవ మౌను, జాహ్నవీ
సుతుడు గతించుదాక నిజ ♦ సోదరపక్షమునందు నిల్చి మా
గతిపగ దీర్చుకొన్నదియు ♦ గాక సహాయ మొనర్చిన ట్లగుగ్
హితమతి, పాండవేయుల, కి ♦ దేతటి మాతృఋణమ్ము దీర్చగన్.

వ. అనిన విని కర్ణుండు నెమ్మనంబున,

శా. ఏ నాభీష్ముని చేత గూలుటయొకో ♦ దేనిన్ నదీనందనుం
డే నా చేతను లోపమగు నె ♦ ట్లేనిన్ సమాధానమే
యా [illegible] కృష్ణునకు న న్నవ్యక్తగా నెంచెనో?
కానిమ్మా [illegible] మా [illegible]లో బడుటకుం ♦ గర్ణుండు మూఢుండొకో?

వ. అని తలంచి వాసుదేవున కిట్లనియె.

శా. యావచ్ఛక్తియు ధారవోసితివి న ♦ న్నాపార్థులం జేర్ప నా
భావం బాపని సమ్మతింపదిక బా ♦ వా! కౌరవాధీశుపాల్
గావింపంబడె నా శరీర మునిలో ♦ గాల్వెట్ట కేనున్న నా
కావంతేనియు లేదు కోపము మహా ♦ త్మా! జాహ్నవీపుత్రుపై.

వ. అనినవిని మాధవుండును,

శా. నిన్నీ హాస్తిపురాధినాథు నలుపన్ ♦ నే జేయుయత్నమ్ము లీ
వన్నింటి న్విఫలమ్మొనర్చితివి నా ♦ యందేమియున్ లోటు లే
దెన్నం బార్థుని చేతిలో మడియువా ♦ రీ భీష్ములున్ ద్రోణులున్
మన్నీలుందలపోయుమీ యెవడొ క ♦ ర్ణా! సుంత కృష్ణుండనన్.

వ. అనిపల్కి కృష్ణుండు కౌంతేయులం జేరె నంత స్వపరిపాలితంబగు కౌరవసైన్యంబున భీష్ముండు రథమ్ముపైనిలిచి సింహనాదమొనర్చి శంఖమ్ముపూరింప కృష్ణార్జునులు పాంచజన్య దేవదత్తంబులు పూరించి దెసలు చెవుడు పగచిరి. పిమ్మట యుద్ధప్రారంభసమయంబగుటయు గపిధ్వజుండు గాండీవధారియై గుణంబు సారించి బాణపాణియై యున్నంత హృషీకేశుండు రథం బుభయసేనా మధ్యంబునకు బోనిచ్చి నిలిపి ప్రతివీరులెల్లరంజూప జూచి గుడాకేశుండు స్వజనసంహారంబునకు శంకించుచు మోహావిష్టుండగుచు జగన్నాథున కిట్లనియె.

భూపాల - చతురశ్ర.

ప॥ బంధుజనుల బరిమార్చి దేవేంద్ర-పదవియైన రానిమ్ము నేనొల్ల॥బం॥
అ॥ ప॥ బంధునాశనమునకన్న వేఱొండుపాపమున్నె కృష్ణా లోకేశ్వరా॥

చరణము

తాతతండ్రులన్ మామలన్ సుతుల దమ్ముల నన్నల గూల్చు నావంటి
పాతకునకు పరలోక సుఖమ్ములు వచ్చునెట్లు చెపుమా తమ్మికంటి॥

సీ. ఉభయపక్షమ్ములం ♦ దున్న బాంధవులు స
చ్చుట కీయ్యకొని లావు ♦ జూపి చంపి

యువల దుచ్ఛమగు రా ♦ జ్య సుభోగముల కాస
గోనుకన్న బిచ్చపు ♦ గూడు మేలు
కులనాశనము సేయ ♦ గులధర్మము లడంగు
కులధర్మ హీనులే ♦ గుదురు సేరక
కూపమ్మునకు; నిట్టి ♦ క్రూరకర్మ మొనర్ప
సమ్మతింపదు నామ ♦ నమ్ము కృష్ణ!

తే. గీ. అని విషాదమ్ము గరుణయు ♦ నచ్చుపడగ
బాణబాణాసనమ్ముల ♦ న్వదలి కంటి
నీరుదొరగ రథమ్మునం ♦ గూరుచున్న
వాసవకుమారుతో శౌరి ♦ పలికె నిట్లు.

ఉ. శూరులు నవ్వరొక్కొ—? నిను ♦ జూచి ధనంజయ! సద్వివేకివై
క్షోణిజయమ్ముగాంచి, యశ ♦ మున్ గడియింపుము నిత్యుడాత్ముడ
ప్పూరుషు జావుపుట్టుకలు ♦ బొందవు నీవు నిమిత్తమాత్రమై
వైరులుగూల్చు మిక్కుతన ♦ పాపము నొందదు నిన్ను ఫల్గునా!

వ. అని పల్కుచు దత్త్వజ్ఞానోపదేశంబు సేయం దలంచి యిట్లనియె.

ఆనంద భైరవి — చతురశ్రగతి.

ప॥ వినరా తెలియగవివరించెద నీ — కాత్మబోధపార్థా పార్థా॥వినరా॥
అ॥ప॥ తనువులుబుద్బుదముల పోలిక నిత్యములుగావునిజమాత్మకు నిత్యుడు

చ ర ణ ము

1. చెఱుపదు చెడడీపురుషుడున్న మ—పురుషోత్తముడేనై మెఱపింతును
చెఱుతుపీవు, చెడుదురు శాత్రవులని—చింతింపకుమోయీ ధనంజయా॥
2. రక్షణము త్తమ ధర్మము రాజులకును—గణనీయము మోక్షప్రదమ్మని
అనుమానింపక లెమ్ము సంగ్రామ్ము—మొనరింపుము మేలోవీరాగ్రణీ॥ని॥

సీ. అవ్యక్తరూపుడ ♦ నై పృథ్వులందు దా
రమ్ములో లెనఖిలభూ ♦ తముల నుందు
జగములన్నిటికి బీ ♦ జము మదీయాంశము
నన్నెఱుంగుట యొజ్ఞా ♦ నం బనబడు

నా నిర్మితము కర్మ ♦ గాన తత్ఫలకాంక్ష
నెడసి నాయందె క ♦ ర్తృత్వముంచి
యనహంకృతియు నిస్పృ ♦ హత్వమ్ము గలిగి గె
ల్పోడుల సమబుద్ధి ♦ నుండువాని

తే. గీ. కే విచారమ్ము నంటదో ♦ యీ కిరీటి!
వివిధకర్మఫలమ్ము ల ♦ ర్పించి నాకు,
నను శరణుబొందు, మల్లని ♦ నిను సమస్త
పాపములనుండి తొలగించు ♦ వాడ నెమ్మి.

వ. ఇట్లు పలుకుచు వివిధప్రకారంబుల విజయుం డడిగిన వానికెల్ల సదుత్తరంబు లిడి యింకను మనసు కసటువాయకున్నం గని విశ్వరూప ప్రదర్శనం బొనర్పం దలంచి సవ్యసాచికి దివ్యచక్షూర్జనంబొనర్చి,

సీ. తనయందు దేవగం ♦ ధర్వాది ముఖ్యులన్
సచరాచరంబైన ♦ జగము దోప
మకుట కేయూరాది ♦ మహిత భూషణ రాజి
తనర జక్రాద్యాయు ♦ ధములు వెలుగ
రవి సోము లక్షులై ♦ దివుర దంష్ట్రాకరా
ళంబులై మోరు ము ♦ ఖంబు లలర
నారదాదిమునీంద్ర ♦ వారమ్ము తనుజుట్టి
ప్రస్తుతించుచు బరా ♦ బరులు సేయ

తే. గీ. భూ నభో దిగ్గగంతర ♦ స్ఫూర్తినొప్పి
పావకజ్వాల లొకట వె ♦ ల్వడు నిజాస్య
గహ్వరమ్ముల భీష్మాది ♦ ఘనులు సొఱగ
[illegible] విశ్వరూపమ్ము సూపె నా ♦ విజయునకును.

వ. అట్లు సూపి వెఱగంది ప్రస్తుతించుచు నిలిచిన బలారికుమారుం గని,

శా. నే నాలోకక్షయకర్త నా యముడ గుం ♦ తీనందనా! యెల్లరన్
జెన్నారం జెరుపంగ రండు భీష్మముఖు లీ ♦ నాచేతనే చత్తు రి

లీలన్నీవు నిమిత్తమాత్రుడవునై ♦ లె మ్మాజిగావింపు మిం
కేలా జాలము? గెల్పునీ కిదుటయే ♦ యీనాతలం బర్జునా!

వ. అనిపల్కి హృదయసంచలత షూన్ని వివిధరీతుల జ్ఞానోపదేశం బొనర్చి విశ్వరూపం బుపసంహరించి, విజయుని సమరోత్సాహుం గావించె నంత యుద్ధప్రారంభమగుటయు సింహనాదంబులకు దోడు శంఖరావమ్ములు సెలంగ నుభయసైన్యంబులు వివిధవ్యూహంబులం బన్నుకొని యురవడించి పోరాడునెడ సముద్దండవేదండతుండ శీకరతురగలాలాజాల రక్తధారాపరిషిక్తంబై సంగ్రామధరణీరజం బడంగ ... బాణపాతంబున సూర్యబింబంబు మఱుగై చీకట్లు గ్రమ్మ, ధర్మభీమార్జున నకుల సహదేవ ధృష్టద్యుమ్నఘటోత్కచాభిమన్యు ద్రౌపదేయాదులును భీష్మద్రోణకృపాశ్వత్థామదుర్యోధన దుశ్శాసనాదులును తమతమ బలంబులం బురికొల్పుకొనుచు ఘోరమ్ముగ బోరాడుచుండ నుత్తరుండు మున్నగువా రెందఱో లెక్కకు మిగిలి వీరస్వర్గ మలంకరించుచుండ నడుమ నడుమ భీష్ముండు విజృంభించి పాండవసైన్యాటవి కగ్గిబడి కాల్చిచ్చు మచ్చునం దగ్గులం బెట్టుచు నెదిరిం దేఱిచూడరాక చిత్రగతుల యుద్ధంబు సేయుచు మూడవనాటి యుద్ధంబున గోటిసూర్యప్రభాభాసమానుండై ప్రళయరుద్రుండన నరివీరుల జిందరవందర సేయుచు కృష్ణార్జునులపై బెడిదమ్ములగు వాలమ్ములం గురియించుచు బిట్టలయించుచున్నంత దనుజాంతకుండు తలంచినంత మాత్రమ్మున సన్నిహితంబైన సుదర్శనచక్రమ్మును దక్షిణకరంబున నమర్చి పగ్గంబుల నొగల ముడిచి,

కళ్యాణి – ఆది

ప॥ నగధరుండు స్యందనమ్ము పైనుండి యుఱికి భీష్మునకు గుప్పించి దుమికెం జూ॥

అ॥ గగన ... కుండల కాంతిపుంజ ... ॥

1\. అవని ... లలిత పీతాంబరంబు ... 
నవిరళ ... సుదర్శన ... ॥

ఉ. పులిగన్న లేళ్ళగమిపోలె శత్రుభూమీశులు నిశ్చేష్టులై చూడ
వెలవెలబడవిజయుండుభీష్మకుంభీంద్రుపైనుఱుకుయదుసింహుండై॥
మ. నను వృద్ధుండగు జామదగ్నియనుకొ ♦ న్నావేమొ? చాలింపుమొ
కనిమేషమ్మున చక్రఘాతమున జ ♦ క్కంతేతునన్నున్ సుయో
ధను ద్రోణాదుల నెల్ల సైనికుల నా ♦ ద్ధత్యమ్మునన్, ధర్మనం
దను నేడే యభిషిక్తు జేయుదు మహేం ♦ ద్ర ప్రాభవంబేర్పడన్.
తే. గీ. జనకు డొకవేళనీకు స్వే ♦ చ్ఛామరణ మొ
సంగెనుగదా యటంచు లో ♦ బొంగెదేమొ
సంతసింపకుమీ సుద ♦ ర్శన రథాంగ
మిపుడ నీపని దీర్చు మి ♦ న్నేటికొడుక !
వ. అనిన విని శాంతనవుండు చేతుల్జోడించి దేవా! లీలామానువ
విగ్రహా!

శుద్ధసావేరి – ఆది.

ప॥ అంతకన్నవలసినదేమున్నది-యచ్యుతాననుగ్రృతార్థునింజేయు ॥మం॥
అ॥ప॥ యెంతవారికి లభించు నిట్లునీ-యంతవాని నెదిరించికడ తేరు॥టం॥

చ ర ణ ము

పీరమాతయను యశమందెను భా - గీరథీదేవి నాతల్లి నేను
నారాయణ! శంతనుభూపతి యెంత-యు బుత్రవంతుడయ్యెనీనాడు॥అ॥

గీ త మా లి క.

అట్లుజమదగ్ని నందను - నాశ్రయించి
నేర్చినట్టి నా యీ ధను - ర్నిగమమెల్ల
భువన విఖ్యాతమయ్యె, నా - భవము పావ
నత గనెన్, సద్యశమ్ము మి - న్నంటె కృష్ణ
ధర్మమార్గాలకమైన వే - ద ప్రపంచ
మందు తెలియందగిన వాడ - వౌదు నీవు
విజయునకు విజయమ్ము గ - ల్పింప దలచి
సమరమొనరింపనని ప్రతి - జ్ఞం బొనర్చి

నాడ వేగాని, యుద్ధ మొ్మ - నర్చు తలపు
చరలించో నీకు విశ్వరూ - ప్రదర్శ
నమ్మెతోడ భారతసంగ - రమ్ము ముగియ
వలసినది; యుని సేత కం - ప్రమించు
చెంత యు మదీయశౌర్య వి - క్రాంతి కొకట
నోన్మాటించు, ధనంజయుఁ - గాహుబలము
బలియు బుర్రికొల్పుటకు బన్ను - పన్నుగడయొ?
వనజనాభుండుదక్క - శాం - తనవు గెలువ
జాలు విలుకాఁడు లేడు ము - జ్జగములందు
టన్న సద్యశమ్ముం గూర్చు - నభిమతంబొ?
శిష్టరక్షణమును దుష్ట - శిక్షణమ్ము
నీపనులు గాన నే నవి - నీతుడైన
కౌరవేంద్రుడు పక్షమ్మున - గయ్యమాడు
కారణమ్మున దుష్టుని - గా దలంచి
చంప నుంకించితో సుద - ర్శనమువిడిచి
రిత్తగాకుండ నాకంత - ముత్తరించి
నెమ్మి నన్ను నీలో గల్పు - కొమ్మనంత!
అవ్యయానంద! గోవింద! - హరి! ముకుంద!

వ. అట్లు పలుకుచున్నంతలో నర్జునుండు రథంబు డిగ్గనుఱికి దీర్ఘబాహువుల నాచివిశ్వంభరుం గుచ్చిపట్టి రణావేశంబున ముందునకుంబోవ నుంకించు గోపాలు నీడిగిల్లంబడి నిలువంబెట్టి యిట్లనియె.

యమునాకళ్యాణి - ఆది.

ప॥ కరుణానిధి శాంతింపగదే - యీకయ్యమాడు సంరంభముడిగివడి॥
అ॥ప॥ హరినీ వేరణమొనరించినచో - నాగునెయీపదునాల్గులోకములు॥

చరణము

గీతల్చెప్పితి విందులకా - భూనేతల్నష్టగ బాలు సేయుటకా ॥గీ॥
చేతులొగ్గి నమస్కరించెదు నా - ఖ్యాతిన్నిల్పుము పోల్చు సేయకుము॥

ఉ. తాతయు మన్మడున్ సమర ♦ ధారుణి బోరెడుతీరు నీవయే
చూతువుగాక లెమ్ము మధు ♦ సూదన! నీవిటు విక్రమించుటల్
నీతియె? కాక నల్వురను ♦ నే దలయెత్తగ నేర్తునే? యప
ఖ్యాతిగడించి యీవిజయు ♦ డన్న మొగంబెటుజూచు నచ్యుతా!

చ. అరివిజయమ్ము పట్టున నొ ♦ కప్పుడు కొండొక హెచ్చుతగ్గు లీ
వరుసఘటించు టేరికి స్వ ♦ భావముగాదొకొ? యంతమాత్ర నే
దురమొనరింప బూనితివి ♦ తోయజనాభ! యిదేటినాయమో
యరయుము, సాత్యకిం దునిమి ♦ నట్లికె ముందున కేగితేనియున్.

వ. అని పల్కు సవ్యసాచి సమయజ్ఞతా పరిజ్ఞానమునకు శౌరి సంత
సించి యతనికి బ్రియమ్ముగా నిట్లనియె

ఉ. ఆతడు నీవునున్ సములె ♦ యందుల కేనెపు డొప్పుకొందు, నీ
తాతగదాయటన్న దయ ♦ దాల్చెద, వంతగ, నొవ్వగొట్ట వీ,
వాతడు నీపయిన్నెఱుప ♦ డక్కటికె, మ్మటుగాన జక్రముం
జేతధరింపగా వలసె ♦ నేడయున దేమిక నూరకున్నచో?

వ. అన విని యర్జునుండు,

శా. ఈయుత్ప్రేక్షలు నే నెఱుంగనివి కా ♦ వీబాంధవ శ్రేణితో
నేయుద్ధం బొనరింప గొంకుటయు నెం ♦ తే గీత బోధించి నీ
వా యజ్ఞానము బాపుటల్ గడచెనా ♦ కాలాటి కారుణ్యమే
పోయెం దావక విక్రమస్ఫురణమే ♦ పోల్కిన్ సమర్థింతువో.

ఉ. చిన్నతనంబునందు చెయి ♦ జేతుల నెత్తి యితండసుమ్ము మా
యన్నలదమ్ములన్ బెనిచె ♦ నందర గావున నొక్కవేళ మా
యున్నతి గోరు నీతనికి ♦ నుండిన నుండగవచ్చు బేర్మి, నా
కెన్నగ లేదు భీష్మునిప ♦ యిన్ దయ నిక్కము దావ నేటికిన్ హరీ

వ. అనిపల్కి గోపాలు నొగలెక్కించి దేవదత్తంబూ త్తి భీష్మాదులగ్గింప
సవ్యసాచి సమరనెపుణిం జూపెను.



# మహాభారతము

## భీష్మపతనము

హంసధ్వని - రూపకము.

ప॥ వినుడు భీష్మపతనకథా - విశేష మెఱిగింతు మీకు ॥విను॥

అ॥ ప॥ వినవిన భారత మ్మొంను - వీనులకుం జేయు విందు ॥విను॥

చరణము

జనకునకై యతడు బ్రహ్మ - చర్యవ్రత మూనె
తనునమ్మిన దుర్యోధను - తరపు కయ్యమాడబూనె॥

సీ. తనదు తాటిసిడంబు ♦ తళతళ మెఱయ నా
లవనాటి రణమున ♦ గంగకొడుకు
ద్రోణశారద్వతా ♦ దుల గూడుకొని పార్థు
పై బడునంత సౌ ♦ భద్రు డలిగి
తన్నడ్డి పోరుచో ♦ దెన్నుగానక కొంత
వడికి వాసవపౌత్రు ♦ గడచి సవ్య
సాచితో ఢీకొని ♦ సమరం బొనర్ప ని
వ్వెఱపడి సూచి రె ♦ ల్లరు నిరుదెస

తే. గీ. ద్రౌణి భూరిశ్రవులు శల్య ♦ తనయ చిత్ర
సేను లోకపెట్ట నభిమన్యు ♦ పైని బడగ,
నగుచు గురుపుత్రు నురమేసి, ♦ నటికి చిత్ర
సేనుధనువు, భూరిశ్రవు ♦ సిడము ద్రుంచె.

వ. అట్లు పెక్కండ్రతో బోరాడు కుమారుం గని విజయుం డార్చి వారిపై జటుకుటమ్ములం గురియుచో గురు కృప శల్య కృతవర్మాదులును కేకయులును ముప్పదేమ వేల రథమ్ములతో ద్రిగర్తులును గవిసి సౌభద్రుం బొదువ నయ్యది గని ధృష్టద్యుమ్నుండు శౌర్యోద్రేకమ్ము దీపింప సనుదెంచి వారిం దాకి పోరుచు శల్యతనయుం దూల్చి శల్యునితో యుద్ధము సేయుచుండ నంతలో దనకు తోడువచ్చిన పిన్నతండ్రులం గలసి సౌభద్రుం డెందదెక్కన్నిరూపులై శాత్రవులం గూల్చుచుండె నట్టియెడ గదసారించుచు భీమక్రోధుండై భీమసేనుండు కురుసైన్యంబుపై బడి నురుమాడుచు కదనోర్విం భీమంగుపెంట గావించుచు, ధార్తరాష్ట్రుల బెక్కండ్రం గూల్ప కురుసైన్యంబు చెల్లాచెదరై పాఱుచుండ దుర్యోధనుం డొక్కండ భీముం దాకి మూర్ఛిల్లె నంతలో నరకాసుర కుమారుండగు భగదత్తుండు తన మత్తగజమ్ము పాండవ సైన్యముపై బఱపు నయ్యది పెక్కండ్ర యోధులం జదిపె నంతలో ఘటోత్కచుం డంతకాకారుండై యుద్దామగమన దుర్వారంబగు నొక్క వారణం బెక్కి భగదత్తుపైబడి పొదివి యాతనిం బలాయితుం జేసి యాచార్య ప్రభృతులపై బడి నొప్పించుచో భీష్ముండు వెఱచి నాటికి పోరు చాలింప నాజ్ఞాపించె నిట్లు సమరం బతిఘోరంబై చూపట్టగ్రమమ్మగ దొమ్మిదవనాటి యుద్ధమ్మున భీష్ముండు ప్రళయరుద్రుని భంగి మూర్తీభవించి వివ్వచ్చు నొప్పించి పాండవసైనికుల గ్గాటి యాలమందలం బోలె దోలుచుండ.

చ. పుడమి వడంక, దిక్కరులు ♦ ప్రెుగ్గతిలంబడ, జచ్చె జచ్చె భీ
ష్ముడనెడి పేరెలుంగు దివి ♦ ముట్టగ, చక్రము చే ధరించి కృ
ష్ణుడుఱికి తేరినుండి రిపు ♦ సూదనతాభరమూని భీష్ముపై
బడునెడ సవ్యసాచి వడి ♦ వచ్చి జనార్దనుతో డనిట్లనున్.

కాఫీ - చతురశ్రగతి

ప॥ యదుకుంజర! కోపము నుపసంహరింపు-మార్తావనలోలా యిదిచాలా॥

అ॥ప॥ రథమెక్కుము శౌరీ మదీయశర-లాఘవంబు కన్నారజూడుమిక॥

చ ర ణ ము

నీవండగ నైనుండినం జాలు - నిఖిలజగము లవలీల జయింతును
దేవదేవ! తలవంపు గూర్తువే-నీ వీ విజయునకోదయానిధే ॥యదు॥

చ. అనవిని తేరిపై నిలిచె ♦ నద్దనుజాంతకు డంత నింద్రనం
దనుడు సురాపగాతనయు ♦ దాకి రణంబొనరించె నంతలో
నిను డపరాబ్ధి మాటువడె ♦ నెంతయు జింతిలి ధర్మసూతి తా
ననుజులం దోడరా సని ము ♦ రాంతకుపాలికి, మ్రొక్కి-యుట్లనెన్.

ఉ. ఎచ్చట దానయై మనల ♦ నెల్లర గాల్చ దొడంగె నిట్లు కా
ర్చిచ్చువిధాన భీష్ముడిక ♦ సేయునదేమి? ముకుంద! యందఱుం
జచ్చిన వెన్క- రాజ్యము వ ♦ శంబగుగాక, ప్రమె దమిచ్చునే?
కచ్చిరుమాని పోవుదము ♦ కానలకుం దపమాచరింపగన్.

తే. గీ॥ మున్ను నాకారణమున నె ♦ న్నెన్నొయిడుమ
లనుభవించిరి నాతమ్ము ♦ లట్టి వీరి
గనులజూచి యే మోదంబు ♦ గందుగాని
చంపుమని తాత కే నప్ప ♦ గింపజాల.

వ. అనవిని వసుదేవనందనుం డిట్లనియె.

చ. మనము రహస్యవర్తనము ♦ నైజని యెల్లర మా సురాపగా
తనయుని గాంచి మ్రొక్కి "నినుదాకి రణమ్మున నిల్వనోప మే
యనువున నిన్ను గొల్వనగు ♦ నయ్యది మాకెఱిగింపు" మర్చు వే
డిన నెఱిగించు నాతడు క ♦ డిర్లది యనుగ్రహమ్మని ధర్మజా!

వ. అనవిని ధర్మజుం డనుజుల న్వెంటనిడుకొని నాటిరేయి నిగూఢమ్ముగ గాంగేయుమందిరమ్మున కరిగి తత్పాదములకుం బ్రణమిల్లి నతండును బేరుపేర నెల్లరిక్షేమంబు లడిగి వచ్చినపని యే మనిన దీనాననుం డగుచు ధర్మసూనుం డిట్లనియె.

ధన్యాసి - రూపకము.

ప॥ క్షేమము మేమిపుడైన గలుగు - నీ మహాకెల్లఋడకు తాత ॥క్షేమ॥
అ॥ప॥ నీమమతల మార్తింబడి - నేటికి బ్రమందుచుచుంటిమి ॥క్షేమ॥

1. సైనికులకు నీపేరొక -సారి విన్న బెదురరాదు
గాననైతి ముక్తిగతి - కయ్యము గావింతు వంచు ॥నేమ॥
2. చచ్చిన క్రనుమ్మాసి యొకట - జేతిత్రిశూలమ్ము నడాచి
వచ్చిన రుద్రుడ వోర్వగ - వచ్చునె నిన్నేరికైన ॥నేమ॥

చ. అనవిని జాహ్నవీతనయు ♦ డయ్యమనందను గాంచి పల్కె, చే
ధనువుగలంతదనుక నను ♦ దాకి రణమ్మున నిల్వజాల రా
యనిమిషులేని, కావున ద ♦ యామతి మీకు కెలిగించువాడ గె
ల్పునకగు మార్గమున్, సుకృత ♦ ముం గయికొందు మదీయసంగతిన్

తే. గీ. అంగనను, నంగనాపూర్వ, ♦ సంగనాభి
ధాను, దలచీర వీడిన ♦ వాని, భ్రాతృ
హీను, జనపత్యు మారొకన ♦ నెన్నుదేని.
జ్ఞుదె మదీయవధోపాయ ♦ మిద్ధచరిత!

క. తనర శిఖండిని మున్నిడు
కొని వాసవసూతి నన్ను ♦ కూల్పగలడనిన్
నను గెల్చినచో గౌరవు
లను కూల్పగ మీకికన్ సు ♦ లభమ్మగుగాదే?

వ. అని పల్కిన దేవవ్రతుచే ధర్మజాదు లనుజ్ఞాతులై నమస్కరించి
వీడ్కొని విడిదులకుం జోవు నెడ విజయుం డచ్యుతున కిట్లనియె.

భూపాల — ఆది

ప॥ పెంచి పెద్దజేసిన తాతను వరి - చించి కూల్ప నాచేతు లెట్లాడు॥
అ॥ప॥ కొంచెపుమానిసు లీపాండవులని - కోపించు లీ[illegible] దూషించరె

చరణము

లోకమాన్యుడు దయాళుడున్ ధర్మ-లోలుడు కులవృద్ధుడు గాంగేయుడు
యీకిరాతకృత్యమ్ము గావించి-యిహపరమ్ములకు దూరమగుదునే॥పెం॥

సీ. స్వార్థపరిత్యాగి ♦ [illegible] తండ్రి కై సత్య
వతి నాలిజేసిన ♦ బ్రహ్మచారి

మము దండ్రి లేని లో ♦ పము దీర్చి యెుతయో
కాపాడినట్టి ద ♦ యాపయోధి
పలుమారు సభలలో ♦ బాండునందనులు ధ
ర్మాత్ములం చాడు య ♦ థార్థవాది
శాస్త్రవిద్యారహ ♦ స్యము లన్నియు నాకు
దెలియ బోధించిన ♦ దేశికుండు

తే. గీ. తనవధోపాయ మిట్లు శా ♦ త్రవులమైన
మాకు జెప్పినట్టి యా ♦ మాయకురడు
గాంగు సురనదీసూను డట్టి ధ ♦ ర్మరతు భీష్ము
మోసగించి కూల్చుటకన్న ♦ దోషమున్నె?

వ. అనిన విని కృష్ణుండ్దనియె,

ఉ. పున్నము బాప మంచు దలి ♦ పోయక వైరుల నెట్లు గూల్పగా
నెన్నగు నట్లు గూల్చి జగ ♦ తీవలయ మ్మఖిలమ్ము నేలుటే
యన్నని రాజధర్మమగు ♦ దీనికి నీమది సంశయింపగా
జన్నె? బలారినందన! వి ♦ షాదమ్ము వీడి జయమ్ము గాంచుమా.

వ. అనవిని ఫల్గునుండు

తే. గీ. ఆపగేయవధార్థమై ♦ యా శిఖండి
జననమందెగదా ఫా నదీ ♦ తనయు నతడె
గూల్చుగాక్క నే నమ్యలం ♦ గూల్చువాడ
చేతులార దారుణ మిట్లు ♦ సేతుజాల.

వ. అనినవిని కృష్ణుడిట్లు దమలనాభుం డిట్లని యెంచె

చ. అనితరవధ్యడగాయుడను ♦ మా! తలపోసితు డీవుదక్క యి
య్యనఘుని జావ నేయగల ♦ యంతటి వీరుడు లేడు కావున
న్మనమున సంశయింపకను ♦ మాత్రమున భీష్ముని గూల్చుమా శిఖం
డిని వడిముందునిల్పుకొని ♦ విర్భయమనా మన స్సేన గవ్వలన్.

వ. అనవిని పార్థుం డియ్యకొనియె నా నాటి రేయి గడచెనంత ప్రభాతోదయంబగుడు నుభయసైన్యంబులుం గదిసె పాండునేడ శిఖండిం

బురస్కరించుకొని యాఖండలనందనుండు మందాకినీనందను నెదిరి
పోరాడుచో నేయుటమాని భీష్ముండు కురుపతింగని.

దర్బారు - రూపకము.

ప॥ బడలితి నిన్నాశ్రితదనుక - పవర మొనర్చనకితమున ॥బ॥

అ॥ ప॥ ఒడయడ! నీమనిచ్చినబుణ - మొగిదీర్చితిలావుకొలది ॥బడ॥

1. పదివేవుర జంపుదునని - బాసజేసితిని నీకడ
నదయత శాత్రవుల దునిమి - యట్టు కృతకృత్యుడనైతిని ॥బ॥

2. మానవుండ పాండవుల న - మానుష విక్రముల గూల్ప
కానిపనిగదా యైనను - కనుగొనుమా నేటికలను ॥బడ॥

క. అనిమిషలుం చు నిర్ధూమద
హనుమపోలిక పాండవేయ ♦ యాదవబల కా
ననముల దహించుచు మా
రొకటయు నపు డాహవమ్ము ♦ ఘోరంబయ్యెన్.

సీ. అన్యోన్య శరసమూ ♦ హ నికృత్త బాహ్వంఘ్రి
పీనకంధరు లగు ♦ వీరభటులు
విగతహస్తంబు లౌ ♦ వే దండములును, హ
తాంగమ్ములైన శ ♦ తాంగములును
పరలోకనీతులై ♦ పరగు స్సూతులు సము
ద్ధూతపుచ్ఛమ్ములౌ ♦ తురగములును,
జర్జరీభూతమౌ ♦ శస్త్రాస్త్రనిచయమ్ము ల్
సంఖండిత పతాక ♦ సంచయములు

తే. గీ. గల్గి కదనోర్వి కడుభయం ♦ కరముగాక
తుములమయ్యె; బాకారి సు ♦ తుడు శిఖండి
ముందునిడుకొని భీష్మపై ♦ ములుకు లేయు
సమయమున నడ్డుదగి లెదు ♦ శ్శాసనుండు.

తే. గీ. అడ్డువడిన దుశ్శాసను ♦ నంతలోగి
రీటి బాణపాతమున మూ ♦ ర్ఛిల్ల జేసి

తనకు భీమాభిమన్యు సా ♦ త్యకులు తోడు
గాగ గాంగేయుపై నంప ♦ గములు నించె.

వ. అట్టియెడ భీష్ముండు నవ్వుచు శిఖండి నుద్దేశించి యిట్లనియె.

భైరవి - ఆది

ప॥ తగుగునీవు మగవాడవై యిట్లు - మరల జన్మించినా వాపగ దీర్చుకొనగ॥
అ॥ప॥ నగరే నను నీతో బోరాడిన - నానాటి రాచవారు శిఖండీ॥మ॥

చ ర ణ ము

పరశురాము ప్రాపున మోసపోయి - పాండుతనూభవుల నాశ్రయించితివా॥
శరము లేసి కసి వాపుకొమ్మదే - చాలింపదలంచితి నా మేనిక ॥మ॥

చ. అనుచు రణమ్ము సేయునటు ♦ లల్లన ధర్మజు డాసి "మాన్యుడా!
పనివడి మీరలెల్ల రొక ♦ పెట్టున పైబడి యేయు డాతసిం
చిన జెడుగార్యమం' చనగ ♦ సేనలకరం బురికొల్పె ధర్మనం
దను డట్టుపై జెలంగె కద ♦ నంబు భయానకమై యొకంతలో.

ఉ. తమ్ముల దక్కజోదులను ♦ దా బురిగొల్పి సుయోధనుండు ద
ర్పమ్మున నాపగేయునకు ♦ బాసటయై నిలుపన్ వృకోదరుం
డమ్మున బాణదోలి ప్రళ ♦ యాంతకురీతి దురమ్మునన్ విహా
రమ్మొనరించె దన్నొగి సు ♦ రప్రకరమ్ము నుతింప పెంపునన్.

వ. అట్టిచో నర్జునుండు శిఖండిం దఱిమి తెటపీసూపి దేవవ్రతు నేయు
మనుచు నిట్లు పురికొల్పె.

శా. ఏమన్నాడ భయమ్ములే దిక శిఖం ♦ డీ! యేయుమా భీష్ము నీ
పై నెప్పట్టున నీగనైనను సరే ♦ ప్రాలంగనీ నెట్టులో
నీవాడే పగదీర్చుకొమ్ము తెటి య ♦ య్యే నీదు ప్రాణాలకే
ప్రాణంబొడ్డుద సంశయింపకుము నా ♦ రాచమ్ము సంధింపుమా.

వ. అనునెడ శిఖండి గాంగేయుపై వాడిములుకులం గురియించు
చుండ శల్య కృపాశ్వత్థామ కుంభసంభవకృతవర్మాది యోధు
లొక్కపెట్ట ధనంజయురిబొదువ ♦ నప్పార్థుండు వాయవ్యాస్త్ర
ప్రయోగమ్మున వారెల్లరను దూరస్థులం జేసి శిఖండిమాటునుండి

భీష్మునిచేతివిల్లుం దునిమి యతినిష్ఠురమ్ములగు వారస్త్రమ్ములందనువు పార్థనేయ దెఱపిగొనక దివిషన్నదీసూనుం డిట్లని వితర్కించె.

నీలాంబరి - చతురశ్ర.

ప॥ ఇవి శిఖండిబాణములే యగుచో నింతగా నొప్పిదెచ్చునా ॥యివి॥

అ॥ప॥ అవశమగుచు కర్కటిగర్భమువలె దవిలి నను బ్రతుకనిచ్చునా॥

చరణము

మఱియు బ్రహ్మదండములపాటిదై చుర్మము లిటు వోనాటునే
పురుషకారమున గమలభవుగీటు - నరుడెన్నడైన దాటునే ॥యివి॥

సీ. జననమందితిని బ్ర ♦ శస్తమకా భరతవం
శమున భాగీరథీ ♦ శంతనులకు
చివరంట నభ్యసిం ♦ చితి ధనుర్నిగమంబు
రవితేజు భార్గవ ♦ రాముగొలిచి
పాలించుకొంటి యా ♦ వజ్జీవపర్యంత
మటు బ్రహ్మచర్య స ♦ త్య వ్రతముల
నేలించితి ధరిత్రి ♦ నెల్ల సక్రమముగా
సాత్యవతేయ వం ♦ శజులచేత

తే. గీ. కడకు సమరమ్ము గావించి ♦ కౌరవేంద్రు
ఋణము సైతముదీర్చుకొం ♦ టిని, మఱేమి
గావలయు నాకు, నిశ్చింత ♦ గా శరీర
మింకజాలింతు, గలియుదు ♦ నిందిరేశు.

క. అని వాలుంబలకయు చే
గొని యరదము డిగ్గ చుఱుక ♦ గొబ్బున నవి తు
త్తునియలొనర్ప నరుడు, శాం
తనవుడు బడె నంత మూర్ఛ ♦ తలగాగ వడిన్

తే. గీ. తల్పముంబలె శరములూ ♦ తగ నిలువగ
తనువు ధారుణి సోల ద ♦ య్యెను కిరీటి
తాతకు దలాడిగా శర ♦ వ్రాత మునిచె.
నట్లు శరతల్పగతుడయ్యె ♦ న య్యనఘుడు.

వ. అంత మునివరులు హంసరూపంబులం జనుదెంచి గాంగేయునకు దక్షిణాయనం బగుటెఱింగించి చనిరి. ఉభయసైనికులును యుద్ధమ్ము మాని గన్నీరుగార్చుచు నమ్మహానీయుం జుట్టునిలువ నొకంతకు శాంతనవుం డిట్లనియె.

నాటకురంజి - ఆది

ప॥ మనుమలార నాకొఱకువిచారము-మాను డింక దేహముపాలించెద॥

అ॥ప॥చనునింకిటనైనను మీరెల్లరు-సమరమున్మానిసంధింపదుటయే॥మ॥

చ ర ణ ము

జనకు డొసంగిన వరబలమునస్వ-చ్ఛందమరణంబునాకు లభ్యమగు
నినుగొల్చుచును త్తరాయనమువఱ-కిల్లనుండుదునంపపాన్పుపై॥మ॥

క. నాకంతదనుక రక్షం
జేకూర్పగ వలయుననగ ♦ శీఘ్రము వారుం
బ్రాకారము గట్టింపగ
నాకనదీనందనుం డ ♦ నంతర మనియెన్.

సీ. శర వేదనమున నా ♦ సర్వాంగ మెరియగ
దప్పిక బుట్టె పా ♦ తాళగంగ
గావలె శరతల్ప ♦ గతుడనై యునికి న
న్యజలమ్ము సేవింప ♦ నన, మనుమలు
వెఱగంది పరికించు ♦ తఱి కవ్వడింజూచి
తేనేర్తువీవు వే ♦ తెమ్మనంగ
క్రీడి తాతకు బ్రద ♦ క్షిణము గావించి ప
ర్జన్యాస్త్రనామక ♦ సాయకమున

తే. గీ. ధరణి గాడంగ నేసిన ♦ తక్షణమున
నెగయువారిధారల గ్రోలి ♦ తృప్తినంది
శాంతనవు డెల్లవారు వి ♦ స్మయులుగాగ
నంతలో ౘకబాంధవు ♦ డ స్తమించె.

వ. అట్లు సూర్యాస్తమయుం బగుడు నెల్లరు శిబిరంబులకు కరిగిరి. తద నంతరంబ కర్ణుండు గాంగేయునికడకుంజని ప్రణమిల్ల భాగీరథీ సుతుడు కౌగిలించుకొని రక్షకాదిజనంబుల నవలకుఁ బొవ బనిచి కానీనున కిట్లనియె.

తోడి – రూపకము

ప॥ నీయెడ గోపమ్మునాకు – నిజముగ లేదిది నమ్మయ ॥నీ॥

అ॥ప॥ దాయలకుం బగగొల్పుట – దగదని పలికితిని గాని ॥నీ॥

చరణము

1. కౌంతేయుడ వీవుగాని – కావుజుమా రాధేయుడ వెంతయు సాత్యవతేయుం – డియ్యది నాకెఱిగించెను ॥నీయెడ॥

ఉ. పాండుకుమారు లా హరికి ♦ ప్రాణసఖుల్; విజయుం డజేయు డా ఖండల ముఖ్య ♦ నిర్జరులకైనను; నికు నీ వొండుతలంపుదక్కి సమ ♦ యోచితరీతి సుయోధనాదులం బాండవులన్ రణంబుడిగి ♦ భద్రగతిం జరియింప జేయుమా!

వ. అదివిని కర్ణుండిట్లనియె.

ఉ. కన్నియయైనాడు కొంతికి వి ♦ కర్తను సత్కరుణ న్జనించుటే మున్నెఱుంగుదున్ గడచి ♦ పోయినదానికి నేడు ల్యాభమే మున్నది చింతసేయ, నెటు ♦ లో యిక యుద్ధముగాక తప్పదీ యన్నప్రాణ మా కురుధ ♦ రాధిపుబా లొనరించితింగదా!

చ. అరయుదు పాండవేయులు మ ♦ హాబలులంచు, మురారి ప్రాపుగా వరలునటంచు, వారిగెలు ♦ వం దర మేరికి గాదటంచు, నీ కురుపతి సేయుమన్ననల ♦ కుం దలయొగ్గిన వాడనెల్లు నే? పరమవిరోధులై పరగు ♦ పాండుకుమారులతోడి పొందికన్.

ఉ. మాటల జేతలన్ దురభి ♦ మానము పెంపున బాండవేయులం జాటి పరాభవించితిని ♦ సంగర మిట్లు పొసంగునంత యా

వాటికి సాటివాడనని ♦ నమ్మినసామిని మోసగించి నే
నూటికి గుడ్డనై బ్రతికి ♦ కుంతికుమారుల జేరు టొప్పునే?

చ. సకల జనక్షయంబగుట ♦ సత్యము, సంగర మందుకేర్పడెం,
దికమక లెల్లవాపి జగ ♦ తీభరమెల్ల నడంప బుట్టె దే
వకికొడు కింతనికుఁవము, ♦ వచ్చునొకో విధిసేత మాన్పగా?
యిక గరుణించి యాజ్ఞయిడు ♦ మే జని నాపని నిర్వహించెదన్.

వ. అని పలుక- కర్ణుని మనోనిశ్చయంబున కలరి దేవవ్రతుం డిట్లనియె.

శంకరాభరణము - రూపకము

ప॥ నీతిమంతు డీయుగమున - నీవొకండ వేకర్ణా ॥నీతి॥

అ॥ ప॥ జాతితోబనేమి? తలప - నీతిగదా వన్నె దెచ్చు ॥నీతి॥

చరణము

స్వామికార్యభారవహన - సామర్థ్య విశేషమందు
రామభక్తుడా హనుమడె - రాధేయా నీకు సాటి ॥నీతి॥

ఉ. శూరు లజేయులున్ వలయు ♦ సోదరులంచు పృథాకుమారు లీ
వారసియున్ సుయోధనుని ♦ యందలి నేస్తమునే గణించి నీ
పోరువిధంబు సర్వమును ♦ పూజ్యతగాంచు; ననుజ్ఞ నిచ్చితిన్
వీరవరేణ్య! పోమ్మనికి ♦ విశ్రుతకీర్తి వహింపు మెల్లెడన్.

వ. అనిపలుక- గాంగేయునకుం బ్రణమిల్లి కర్ణుండు నిజశిబిరంబునకుం
జనియె.





# మహాభారతము

## పద్మవ్యూహము

బిలహరి - రూపకము

ప॥ అభిమన్యుఁడు పద్మవ్యూ - హము సొచ్చిన కథవినుఁడీ ॥యభి॥

అ॥ ప॥ అభవాదులకును వెన్నిఁడ - నట్టిజోదు కిరీటికొడుకు ॥కభి॥

చరణము

శరగురుండు పన్నిన మొ - గ్గరము నట్టిసించినాఁడు

అరిమర్దనత హరికి మే - నల్లుం డనిపించుకొన్నా ॥డభి॥

సీ. శరతల్పగతుఁడైన ♦ సురనదీ నందను
కొలఁకు విచారించి ♦ కురువిభుండు
కర్ణాదియోధులం ♦ గలసి పాండవసైన్య
మునకు మార్కొన దల ♦ పోయునంత
తనసేన నడుపగా ♦ దగిన నాయకుఁడు ద్రో
ణుండని పల్క ♦ ర్ణుఁడు, సుయోధ
నుఁడు కుంభజుండున్న ♦ యెడేకుంజని మహాత్మ!
యఖిలసేనాధిప ♦ త్యమ్ము నిర్వ

తే. గీ. హింపు మీవే యటంచు బ్రా ♦ ర్థించి పావ
నోదకమ్ముల దెప్పించి ♦ యుచితరీతి
నపుడె యభిషిక్తుఁ జేసె కప ♦ నస్త్రగురుఁడు
గోరు మదియే వరం బన ♦ గురుపతియును.

దర్బారు - రూపకము

ప॥ పట్టితెమ్ము ధర్మపుత్రు - బ్రాణమ్ములతో నాకడకు ॥ప॥
అ॥ ప॥ ఇట్టియెడ న్నాకీవర - మిచ్చెదేని గురువర్యా ॥ప॥

చరణము

నీకారుణ్య విశేషమె - నిఖిలాభీష్టము లగూర్చు
నీకౌరవ సైనికులను - జేకూరు శుభము లింకిట ॥పట్టి॥

వ. అనవిని ద్రోణుండు రారాజున కిట్లనియె.

చ. శమనతనూజు డెంతయు న ♦ జాతరిపుండను మాటలెల్ల ని
క్కములగు, నతని ♦ గయ్యమునం దెగజూడ గోర కీ
క్రమ్మున బట్టితెమ్మని తి ♦ రమ్ముగ గోరెదవే నృపాల! స్ప
ష్ట మిపుడ నన్ను నీవిటుల ♦ గోరినకారణ మేమొ సుయోధనా!

వ. అనిన దుర్యోధనుండు,

ఉ. అన్ననుజన్ముచో విజయు ♦ డగ్గి మమున్ సమయించు, వారినే
తెన్నునన్ వధించినను ♦ దేవకిపట్టి మమున్వధించి కుం
తిన్నిలబెట్టు రాణిగ, యు ♦ ధిష్ఠిరు జూదమున న్జయించి భా
గ్యోన్నతి నేలుకొందు భువి, ♦ నుగ్రవనమ్ముల కంపి వారలన్.

వ. అనిపలుకు దుర్యోధను కౌటిల్యమునకు ధనురాచార్యుం డేవగించుకొనుచు నిట్లనియె.

చ. సురలకుసైతమున్ గెలుపు ♦ సున్న కిరీటియె నిల్చియున్నసం
గరమున న్నాకుమాత్ర మెటు ♦ కవ్వడి నోర్వగనా? ధనంజయుం
డుగువడి నిల్చి యడ్డపడ ♦ కున్నను, దా వెనుసూపకున్నచో
స్థిరమిది, బట్టితెచ్చెద యు ♦ ధిష్ఠిరు, నీకడకున్ సుయోధనా!

తే. గీ. అనినవిని కౌరవాగ్రజుం ♦ డలరె, గురుని
ప్రతిన చారులచే విని ♦ పాండవాగ్ర
జుండు వెఱగంది "నాయున్న ♦ చోటనిలిచి
సమర మొనరింపు" మన ధనం ♦ జయుడు పలికె.

ఉ. నవ్వులచేటుగాక ప్రతి ♦ నల్ నెఱవేర్చుకొనంగ శక్యమే?
కవ్వడిమేన ప్రాణములు ♦ గల్గిన ద్రోణుడెగాడు స్థాణువున్,
దవ్వుల నిల్చితీఱవలె ♦ ధర్మ తనూజునకున్ బరాభవం
బెవ్విధిగల్గు? గల్గునెడ ♦ నేకముగావొకొ? సప్తవార్ధుల్.

వ. అనిపల్కి నిజబలంబు న్వెంటనిడుకొని రణభూమిం జొచ్చి శత్రు బలంబుం దాకునంత ద్రోణుడు నెలరేగి పాండవసైన్యంబుపై దివ్యాస్త్రమ్ములం గురియించుచు మధ్యందిన మార్తాండుబలె నెరికిం దేఱిచూడరాక మందుకండయ్యును కుమారమూర్తి కొప్పుచు ధనంజయ ధృష్టద్యుమ్నులతో పెద్దపెట్టుగ యుద్ధం బొనర్చునెడ నభిమన్యుండు కౌరవసైన్యంబుపైబడి నురుమాడుచు సైంధవప్రముఖులం బాఱదోలుచున్నంత రోషించి గదాధరుండై శల్యుం డభిమన్యు నెదుర్కొనును నంతలో భీమసేనుండు మద్రపతి నెదుర్కొని బలద్వయమ్ము వెఱగంద మోహరించె నట్టియెడ ధమరాచార్యుండు తెఱపిగొని ధర్మసూనుపైబడి శరవర్షంబుం గురియింప విజయుం డడ్డుపడి ధర్మజుం గాచికొని సమరతలంబెల్ల మేదోమాంసపంకంబును శోణితనదీప్రకరమ్మును గావించె నమ్మఱు నాడు సుశర్మాదులగు సంశప్తకు లనేకరథికముఖ్యు లర్జునుం దలపడి పోరుచున్నంత ద్రోణుండును పాంచాలురపైబడి నుఱు మాడుచు పాండవసైనికుల కందఱకు నన్నిరూపులై యేట్లాడునెడ నొకవంక భగదత్తుండు సుప్రతీకం బను తనయేన్గును పాండవ సైన్యంబుపై గవియంజేసిన నయ్యది దూరమునుండి కని తేరటు పోనిచ్చి భగదత్తు నెదుర్కొనునంత నా ప్రాగ్జ్యోతిషాధీశ్వరుం డింద్ర నందనుపై వైష్ణవాస్త్రంబుం బ్రయోగింప వాసుదేవుం డయ్యది తన యురంబున ధరించె నంతట క్రీడియు దంతిని భగదత్తునిం బరిమార్చె, మూడవనాడు ద్రోణుండు పద్మవ్యూహమ్ము సంఘ టింప నర్జునుండు ధర్మరాజరక్షణార్థమై భీమాదులనుంచి తాను త్రిగర్తులతో యుద్ధమ్ము సేయుచున్నంత నిట ధర్మజుండు తత్పద్మ వ్యూహమును భేదింపనేరక సౌభద్రుం బిలిపించి యిట్లనియె.

తోడి - ఆది.

ప॥ కయ్యమాడ జనుదెంచె త్రిగర్తుల-గవిసి నీతండ్రి నేడు నాతండ్రి॥క॥

అ॥ప॥ అయ్యవారు నన్బట్టియిత్తునని-యభయమొసగి రాజుర్యోధనునకు

చ ర ణ ము

గురుడు నేడు ప్రళయోగ్రుడై వెలుగు-తెరువేమియు మాకీయెడ దోచదు

పరువునిల్పు మీపాండుకుమారులు-బవరమన్న వెనుదీయరంచు వడి॥క॥

చ. హరియును క్రీడి లేనితఱి ♦ నస్త్రగురుండు రచించె తమ్మిమొ
గ్గర మదిమాకభేద్యమగు ♦ గావున నిచ్చలిపించినాడ నే
వెరవున నోడ్డుసించి రిపు ♦ వీరుల గర్వముమాపి పాండుభూ
వరుని యశమ్మునిల్పెదవొ? ♦ భారము నీయదిసుమ్మి నాయనా!

ఉ. అయ్యకు దీసిపోవు రణ ♦ మందు రవంతయు నీవు, గాని "మీ
రెయ్యెడ బోరి కంపవల ♦ దేనుసమీపమునందు లేనిచో
నియ్యభిమన్యు" నంచు వచి ♦ యించె ధనంజయుడొక్క-నాడుమా
కయ్యది నెమ్మనమ్మునకు ♦ నారటమున్ గలిగించు నాయనా!

వ. అని పల్కు-నంతలో బకనైరి బాలుంగని,

ఉ. "సొచ్చు టెగాని వెల్వడుట ♦ సుంత యెఱుంగనికుఱ్ఱడంచు" వా
క్రుచ్చెసుభద్ర; "కూల్చెద వి ♦ రోధుల నాపెదతమ్ము డింతలో
వచ్చునటంచు" జెప్పి గాని ♦ వచ్చితి నిన్నిట దారిసూపి సం
దిచ్చినజాలు శాత్రవుల ♦ నేబడ గూల్తు గదాధరుండనై.

వ. అనిన విని యభిమన్యుండును.

చక్రవాకము - ఆది.

ప॥ నన్నింతగ బతిమాలగా వలదు-నాచేమి మీర లోతండ్రులార॥

అ॥ప॥ అన్నన్నా! యని సేతకీకరణి-యానందమానంద మంగీకృతిపలుకుము॥

చ ర ణ ము

కలనైనన్ గలనన్న వెఱతునే-పలుకాడగు నాక్రీడికొడుకునై

పులికడుపున లేడికూన పొడమునె-పుట్టినయది రాచపుట్టువేకద॥న॥

చ. చవిగొనిరేకదా? విజయ ♦ సంగరముం గృపకర్ణకుంభస
భవు లపుడప్డు; వార లిటు ♦ పై జనిజూతుగు నుంత నేటినా
బవరము, తారతమ్య మగు ♦ పట్టిన నయ్యది వెల్లడింతు రా
హావమన పండువేయగుగ ♦ దా! పరువందిన రాచబిడ్డకున్.

వ. అనిపలుక- సౌభద్రుడుశిరంబు మూర్కొని ధర్మజుండును,

ఉ. బాలుడవీవు, శాత్రవులు ♦ భండనపండితు, లందు ద్రోణుతో
నాలముగాకతీఱదు, ము ♦ రారియు క్రీడియు జెంత లేరు, చూ
లాలువిరాటుకూతురు కు ♦ లాంగన, తల్లికొకండ వాదుచే
జాలగ గుండె బెండువడె ♦ సంగరభూమికి నిన్ను బంపగన్.

వ. అనవిని సౌభద్రుండును.

సీ. కనువెట్టజేసి చూ ♦ చిన లోకవితతి భ
స్మీకరించుమగండు ♦ మేనమామ
పిడికిటం గొండల ♦ బిండిసేయుగజాలు
విక్రమాట్టోపుండు ♦ పెద్దతండ్రి
యిందుశేఖరుని మె ♦ ప్పించి పాశుపతమ్ము
గైకొన్నలావరి ♦ కన్నతండ్రి
యరివీరసమితి బా ♦ దాక్రాంతులనొనర్చు
వీరాగ్రగణ్యులు ♦ పిన్నతండ్రు

తే. గీ. లిట్టి నాకేమిట్టి కి ♦ భీతి? యింతయేల?
క్షాత్రవరమ్ముగాగ జ ♦ క్రధర విజయు
లరుగుదెంతురుగాక, క ♦ య్యమునవిలిచి
పడయుదు జయమ్ము సెలవిడి ♦ పంపుమయ్య!

మంజరులు.

అనిపల్క- ధర్మజాజ్ఞనంది భీ - మార్జునులు తనువెన్నంట
చనుదెంచునంత దనకు బార్వతీ - జానివరంబాకడుంట
నడ్డపడియె పాండుకుమారులకు జ - యద్రథుం డంతలోన
యొద్దుభేదించి సౌభద్రుడు గుడు - నొంచి సొచ్చెను బిరాన.

సీ. శరనిధిం దిరుగు మం ♦ దరనగమ్మువిధాన
కాననమ్మున రేగు ♦ కారుచిచ్చు
కైవడిం గాల ప ♦ క్వజనసమాజ సం
హారణవిక్రీడనం ♦ బాచరించు
శూలిపోలిక బహు ♦ కేలీగతుల నొప్పి
కురుసేనపైబడి ♦ యురవడించి
కేతువులం గూల్చి ♦ యాతపత్రమ్ముల
నుఱుమాడి తేరుల ♦ నుగ్గుజేసి

తే. గీ. గడపిహయముల, సూతుల ♦ గీటడంచి
కాల్బలమ్ముల జదుపగ ♦ కౌరవాగ్ర
జుండు సౌభద్రునిం దాక ♦ జూచి ద్రోణు
డెల్లసైనికవరుల కె ♦ లుగెత్తి పలికె.

మోహన - రూపకము

ప॥ చూతు రేమి? యభిమన్యుకు-సుయోధనున్ దాకుచుండ ॥చూతు॥
అ॥ ప॥ ఆతడర్జునాత్మజుడగు - నర్భకు డనుకొంటి రేమొ ॥చూ॥

చ ర ణ ము

పరజనదుర్భేద్యంబగు - పద్మవ్యూహంబీగతి
నరనిముసములో సించుట - యైనజూడరా! యూరక ॥చూ॥

చ. అని పురికొల్పుచుం గవిసె ♦ నయ్యభిమన్యుని ద్రోణు, డంతలో
మునుకొని కర్ణశల్యకృప ♦ ముఖ్యులు పల్వురు చుట్టుముట్టి, రా
యనిమిషరాజపౌత్రుడు ర ♦ ణావని నందరి, కన్నిరూపులై
తనరుచు నీరసంబుఱచె ♦ తత్కురుసైనిక వీరవారమున్.

సీ. కవచమ్ముదూటి యం ♦ గముగాడిపో నేయ
తొలగె సూతసుతుండు ♦ నిలువలేక
వాడితూపులతాకు ♦ వడి బిట్టలసి యట్టె
మూర్ఛిల్లె నామద్ర ♦ భూవరుండు
విల్లుద్రుంచి మేనికండలు ♦ సెక్కనాడున్న
సేనుండు పడె సొమ్మ ♦ సిలి రథమున

శిరము కుండలకాంతి ♦ జెలఁగ లక్ష్మణకుమా
రుండు నేల్గంబడి ♦ నూపుమాసె

తే. గీ. పేర్వడిన యోధులెల్లరు ♦ విరథులైరి
కదనమేదిని నెత్తుటి ♦ కాల్వలయ్యె
నంత నపరాహ్ణమగుడు తే ♦ రస్త్రగురుని
పైకి దోలించి నరసూతి ♦ పల్కె-నిట్లు.

ఉ. పట్టియొసంగుదుం గలన ♦ పార్థుడు లేనెడ ధర్మపుత్రుఁ నం
చొట్టిడుకొంటివేగద! స్మ ♦ యోధనుత్తోద్ధత గాచికొండు నే
పట్టియొసంగుదుం గుడున్న ♦ పాల్గుని నా పెద్దతండ్రినిప్డు నీ
యట్టి ధనుర్విదగ్రణుల ♦ నందఱగెల్చి మహీసురోత్తమా!

వ. అని పలికి రారాజుకోపయుం గవియు గురు కృప కర్ణాశ్వత్థామ శల్య దుశ్శాసనాదులెల్ల రొక్కపెట్టున సౌభద్రుపై బడి నతం డెల్లరం గాందిశీకులం గావించునంత దుర్యోధనుండు ధనురాచార్యుని పొలికింజని,

కేదార - ఆది.

ప॥ కప్పకూతభుజగంబవై యిట్లు - కౌరవపక్షమునందు జేరితివి ॥కప్ప॥
అ॥ప॥ ఎప్పుడు పాండవపక్షపాతివే-యెఱిగి మోసపోయితినీ బోపడా॥

చ ర ణ ము

బాలుడెట్లు మొగ్గరము భేదింప - జాలు నీ వుపేక్షించితివిగ్రాక
నీలావు న్నెరనమ్మి లక్ష్మణుని-గోల్పుపోతి కులవర్ధనుడగు సుతు ॥క॥

వ. అని పలుకు దుర్యోధను నేవగించుకొమ్మను కర్ణాద్యులంగని ద్రోణుం డిట్లనియె,

చ. అలతులబోవఁడీ బుడుత ♦ డర్జునతుల్యుడు, చేత గార్ముకం
బలరిన యంతదనక నిట ♦ లాత్మునకైన నజేయు డెట్టులో
విలు దునుమాడి వెన్దరిమి ♦ వే విరథుంబొనరింపు డందఱుం
దలపడి యొక్క-పెట్టున ప ♦ దంపడి గూల్పగవచ్చు నీతనిన్.

చ. అఘవిని కర్ణుడు న్వెనుక • కల్లన వచ్చి మహాశుగమ్ము నర్జ
ధనువును ద్రుంచె, వాజులబ ♦ దంపడి గూల్చె గురుండు, సారథిం
దునిమె గృపుండు, సౌబలుడు ♦ ద్రోణసుతుండును శల్యు డాదిగా
దనరు మహారథుల్ శరవి ♦ తానమునం గడు నొంచి రొయ్యనన్

వ. అంత నాక్రీడికొడుకు వాలుంబలకయుం గొని వైనతేయునిమాడ్కి
నింగికెగయ దత్సాధనమ్ముల ద్రోణరాధేయులు తుత్తునియలు
గావింప సౌభద్రుండు తన తేరిపైగల చక్రముంగొని యుపేంద్రు
ననుకరించుచు సమరావేశుండై,

సీ. కలయబూచిన కింశు ♦ కములీల నెమ్మేని
రక్తారుణప్రభల్ ♦ రచ్చకెక్క
చక్రరోచులు మణి ♦ స్థగితకంకణకాంతు
లంబరవీథి మే ♦ లంబులాడ
సింహనాదమువైరి ♦ సేనాపయోనిధి
నల మందరాచల ♦ మై మథింప
ప్రథితవిక్రమ విహా ♦ రము రత్నహారమై
భరతమాతకు వన్నె ♦ బాదుకొల్ప

తే. గీ. ద్రోణుపైబడి తన్నడ్డు ♦ సైనికులను
చింద్చి చెండాడుచున్ దుస్స ♦ సేనతనయు
తోడ బోరాడి పోరాడి ♦ క్రీడికొడుకు
కడకు దాశ్శాసనిం గూల్చి ♦ పుడమి బడియె.

క. అదివిని ధర్మతనూజుడు
హృదయము పగులంగ చేష్ట ♦ లెడసి యొకంతన్
గుదురువడి సుతవియోగము
నెద సైపగలేక యేడ్చె ♦ నీవిధి నంతన్

ముఖారి — జంపె.

ప॥ నినుచేతులార నే - ననికంపి జంపించుకొన నాయెనా
నేటికి - నేకిరాతుడను నాయన ॥నిను॥

అ॥ ప॥ నినువంటి కొమరు నె - న్నేజన్మములనెత్తి
గనజాలుదుమె నీకు - నూరేండ్లు నిండెనా ॥నిను॥

చరణము.

ఎదురురాదేమి యభిమన్యు డేడియటంచు
గదిసి యగుడుకిరీటికి - నే నేమనినుడువుదు ॥నె॥
కదనమున ద్రోణాది - ఘనుల వెనుజూచు నీ
వదన మీనాటితో - గన నోచమైతిమా ॥నిను॥

చ. కులమును నిల్పగాదగిన ♦ కుఱ్ఱడె వండనినమ్మి క్రీడి యీ
కల నొనరించునట్టి సిను ♦ గయ్యమునం దెగజూచి తొల్తనే
బలము జలంబు జూపి పగ ♦ వారివధించి యికేమి బ్రాముకొ
దలచి రణమ్మునేత కిక ♦ దాము గడంగుదు రయ్య పాండవుల్?

చ. కొనకు సుభద్రకుం గడుపు ♦ కోత, మురారికి జింత, యుత్తరా
వనితకు దీఱరాని పెను ♦ వంత, కిరీటికి పుత్రశోకముం
బొనరిచినట్టి యీచెనటి ♦ బొందియ బ్రాణము వాయదేల? పా
పునకు చిరాయువన్న నుడి ♦ పొల్లగునే? విధినేత దప్పునే?

వ. అని పలవించు ధర్మసూనునికడకు పారాశర్యుండు సనుదెంచి దుఃఖోపశమనం బొనర్చి సనునంత సాయంసమయమ్మునగుడు పోరు సాలించి కృష్ణార్జునులు శిబిరమ్మునదెసకు వచ్చుచో నర్జునుండు గోపాలుంగని,

ధన్యాసి - ఆది

ప॥ కలగుమానసముద్దుర్నిమిత్తములె-గన్పట్టెడు నా మేనుభ్రమాన్పడిమె
అ॥ ప॥ తలపనిద్దాని కేమి హేతువో- తెలియజాలఖ్లానాలోకేశ్వర ॥కల॥

చరణము

అన్న లేమైరో? తమ్ములెట్టిరియా-పన్నులైరో యాచార్యునికతమున
కన్నుగవకు గానంబడు వెలివెల్లనున్న యట్లు శిబిరమా గోపాలా ॥క॥

తే. గీ॥ రణము సాలించి నే శిబి ♦ రమ్ము జేర
వచ్చునపుడెల్ల నేత్రప ♦ ర్వమ్మునగాగ

నెదురుసనుడెంచి నను గౌగి ♦ లించు కొడుకు
నేడు గృహతోరణమ్మున ♦ లేడు, కృష్ణ!

వ. అనిపలుకుచు నడుగులు తొట్రువడ ధర్మజు విడిదల కరిగి వారిలో నభిమన్యుడు లేమిం జూచి యిట్లనియె.

క. గురుడు రచించిన మొగ్గర
మొరులకు జొరరా దటంచు ♦ నూహించి యిటన్
ద్వరపడి సౌభద్రుని పం
పరుగాదే తెలివిమాలి ♦ బవరము సేయన్?

క అనిపల్కి నిరుత్తరుడై
తనయా! యను చేద్పు ధర్మ ♦ తనయుని యాక్రం
దన హూంకరించియు ని
ల్వన గూలంబడి కిరీటి ♦ పొగులదొడంగెన్.

సింహేంద్రమధ్యమము - త్రిపుట

ప॥ పుడమియంతయు నేలుదీవని - పుట్టెడాస వహించి యుంటిని ॥పు॥
అ॥ప॥ కొడుక? న్నిట్టు గూలినాడవ-కుత్తుక మాఱడి బుచ్చినాడవ॥పు॥

చ ర ణ ము

వరలు పున్నమచందురున కెన - వచ్చు నీ వదనమ్ము జూడక
ధరసుభద్రార్జునుల కేగతి-తనువులం బ్రాణములు నిలుచును ॥పు॥

ఉ. దైవతకోటికిం బ్రభుడు ♦ తాత బిడౌజుడు, కన్నతండ్రి గాం
డీవి, జగన్నియామకుడు ♦ నీ జనాభుడు మేనమామ, నీ
వా వివిధాస్త్రసంచయ వి ♦ దగ్రణి. యీగతి దిక్కుమాలి యు
ద్ధావని గూలినావె విష ♦ దంబుధి ముంచి మముం గుమారకా!

వ. ఇట్లు విలపించి సేయునది లేక యయ్యెడం బొడమిన కోపావేశ మ్మున సచటి వారింగని.

ఉ. నందను గాచియుండరని ♦ నమ్మితి తోడిగర్తల గెల్వబోవ మీ
రందరు నాతం వారొద్రవహి ♦ పర్భకు నొంటిగనంపి యిరాగతిన్
బ్రమందగ జేసి రిట్టి యన ♦ మర్థులు మైతురుపురుల్ కృపాణముల్
అందము లోటుగాంచునని ♦ య్యా! తగువారమటంచు ద్రిష్టాల్వట్టుల్

ఉ. అందరుగూడి సంపిరికదా ♦ నా! యభిమన్యు బలారిసూతి న
న్నొందగజేతు నంచు బ్రతి ♦ నం బొనరించె నిదేమిపాపమో?
బందుగు లస్త్రకోవిదులు ♦ పలుకడు నన్నెటకేని పాఱిపో
మ్మందురో? రక్షసేయగల♦మందురో? మీరెదియేని ముందుగన్.

వ. అని వెఱచు సైంధవుని భుజముతట్టుచు సుయోధనుం డిట్లనియె.

సీ. విలుకాండ్రకున్ మేటి ♦ తలమానికంబన్న
ఖ్యాతిగాంచిన యట్టి ♦ కర్ణుడుండ
బహుళాస్త్రశస్త్రసం ♦ పన్ను లీగురుకృపా
శ్వత్థామముఖ్యులా ♦ చార్యులుండ
నలఘువిక్రమధురీ ♦ ణులు శల్య సుబలరా
జాత్మజ సోమద ♦ త్తాదులుండ
బాంధవమ్మునకు నీ ♦ బావమఱందులై
నుతిగన్న యోధులు ♦ నూఱ్వురుండ

తే. గీ. పేర్వడిన వీరవరుడవై ♦ విజయు ప్రతిన
దలచి నీవింత గుందగా ♦ దగునె? చెపుమ,
మా మఱుపుసొచ్చు నిను సుర ♦ సోమముం గ
డంగి కనువిచ్చి తేఱిచూ ♦ డంగ వశమె?

వ. అనిపలికి ద్రోణుచే నభయమిప్పించి యాతనిదైన్యమ్ముమాపె నట
నర్జునుడును మాధవోపదేశమ్మున నిజసదనమ్మున కరిగి పాద
ప్రక్షాళనమ్ముగావించుకొని దర్భశయ్యగావించి గంధపుష్పాక్ష
తమ్ముల నలంకరించి యాయుధమ్ము లర్చించి నాటిరేయి స్వప్నం
బున శంకరుధ్యానించి కృష్ణసహితమ్ముగ గగనమ్మున కెగసి
యుత్తరాభిముఖుండై సని కైలాసమ్ముజేరి పరమేశ్వరు నభినుతించి
పాశుపతం బర్థించి దానిం బ్రస్ఫుటమ్ముగా బడసి మరల నిజశిబి
రంబు సొత్తెంచి నట్లుగని కొంతవడికి మేల్కని సూర్యోదయమ్ము
నకు వేచియుండె.

శ్రీ

# మహాభారతము

## సైంధవవధ

మోహన - రూపకము.

ప॥ వినుడు సభాసదులారా - వినిపించెద సైంధవవధ ॥వి॥

అ॥ ప॥ వినవిన జవులూరు భరత - వీరుల సచ్చారిత్రము ॥విను॥

చరణము

తేరుదోలుకొని హరిరా - నారోహించెను కిరీటి
మేరు శిఖరమున దినమణి - తీరున దాశోభిల్లుచు ॥విను॥

సీ. ధర్మజరక్షణా ♦ ర్థము సాత్యకి న్నిల్పి
కడల కపిధ్వజ ♦ కాంతులీన
సంగరోత్సాహుడై ♦ శంఖమ్ము పూరించి
ప్రకటగాండీవ గుణ ♦ ధ్వని యొనర్చి
పైబడు యోధులం ♦ బడనేయుచు గజాశ్వ
వితతి గూల్చుచు మహా ♦ వీరమూర్తి
యై కురుసైనికుల్ ♦ హరిగన్న లేళ్ళపో
లిక భీతి నల్దిక్కు ♦ లకును బాఱ

తే. గీ. శరగురుండు రచించిన ♦ శకటనామ
కోజ్వలవ్యూహమ్ముం జింప ♦ నొడ్డుసేరి
ద్రోణు గన్గొని నిలిచి చే ♦ తులు మొగిడ్చి
యనిరె భయభక్తులెసగ జం ♦ భారిసుతుడు.

శ్రీరాగము - ఆది.

ప॥ మొగ్గరమ్ము భేదింతు నాజ్ఞయిడు - మగ్గలంపు ప్రేముడి గురువర్యా॥
అ॥ప॥ అగ్గిచూలి కెనవచ్చు సేనాని - వంతేవాసిని నీకు, గాన నీ ॥మొ॥

చ ర ణ ము

పెనిచితీవు సరిపూర్మి నీతనయు - ననుకరింప న న్నన్నివిధమ్ముల
కనుక నాప్రతిన నెఱపు మీవేళ-కరుణింపుము మన్నింపుముశిష్యుని

ఉ॰ పాండువిభుండు, ధర్మజుడు, ♦ పంకజనాభుడు, నీవుగాక యీ
ఖండలసూతి కెన్నడును ♦ గాడు మఱెవ్వడు మేలు గోరు నా
డొండుదలంప కీవు సమ ♦ యోచితరీతి నను గ్రహింపు మె
వ్వండు భవన్ని శాతశరి ♦ వారము నోర్వగలాడు? కుంభజా!

చ॰ అనవుడు పిన్ననవ్వొలయ ♦ నస్త్రగురుండను, నన్ను గెల్వ కే
యనువునసైంధవుం గదిసె ♦ దంచు మురారిని గ్రీడి నమ్ములన్
మునుగగ సేయగా నడుము ♦ నగ్గొనరించి యతిక్రమించి మా
ర్వని వికలమ్మొనర్చి పర వీర ♦ బలమ్ములనేర్చి, క్రీడియున్.

చ॰ కరుల నడంచి సైనికుల ♦ గ్రన్నన గూల్చుచు ద్రోణుతోడిసం
గరము నిరాకరించి యెడి ♦ కమ్మగ మొగ్గర మట్టిసొచ్చి వే
సరక శ్రుతాయుధప్రముఖ ♦ సైనికులం దెగటార్చి, నాపయిం
గురుపతి తేరు దోలుకొని ♦ కుంభజుపాలికి బోయి యిట్లనెన్.

భైరవి - రూపకము

ప॥ తేనియపూసిన కత్తివి - తెల్లమయ్యె నీనడత ॥తేని॥
అ॥ ప॥ మాన వెన్నిభంగుల నీ - మత మా పాండవపక్షము ॥తేని॥

చ ర ణ ము

బలరిపునందనున కోడి - ప్రాణభీతి సైంధవుండు
తలదాచుకొనె న్మనకడ - తన్నే మోగాతుమంచు ॥తే॥

చ॰ వెలవెలబాఱజొచ్చె నృప ♦ వీరగణమ్ము కిరీటిరాక కీ
వలుగకుమయ్య నానుడుల ♦ కార్తిమెయిం బలుమాట లాడితిం
గలన పురారికేని యతడు ♦ గానుగదా నిను మార్కొనంగ కే
వలము దయాపయిండవయి ♦ పాలనసేయగదే జయద్రథున్.

వ. అనవిని భారద్వాజుండును.

మ. కవచంబొండు ధరింపు మిచ్చెద కురుక్ష్మానాథ! యద్దాన శా
స్త్రవనిర్ముక్తకరాళి నీతనువునన్ దథ్యమ్ముగా దాకదీ
యవకాశమ్మున కవ్వడిం గెలుతువ య్యా! యిందు నేనుండి పాం
డవసేనం గలగింతు భద్రమగు దీనన్ సింధుభూజానికిన్.

వ. అనిపల్కి తత్కవచమ్ము సమంత్రకమ్ముగ సుయోధనునకుం దొడిగి దీవనలిచ్చి యంపి వికర్ణ వివింశతి చిత్రసేన బాహ్లీక దుశ్శాసన శల్య శకుని సోమదత్తాదులం గలసి భీమ నకుల సహదేవ ఘటోత్కచ ధృష్టద్యుమ్న సాత్యకి ప్రముఖులతో బ్రచండభంగిం బోరాడుచున్నంత నక్కడ గాండీవి సైంధవుం డున్న దెసకుం బోవుచు విందానువిందులను మహావీరుల మ్రందించి యసంఖ్యాక రథగజతురగపదాతిబలంబులం గూల్చుచు గురుసేనం గనుపుకొట్టి నవ్వు కవ్వడిం గని గోపాలుండు రథాశ్వమ్ములు డప్పిగొని డస్సి యున్నవననా సవ్యసాచియు,

తే. గీ. దివ్యశరసంహతుల ధరి త్రిం బగిల్చి
కొలనుగల్పించి యిలుగట్టి ములుకులగమి
హయముల న్నీరు ద్రావించి యరదమెక్కి
వచ్చె రిపువీరవరులు దే వతలు బొగడ

చ. కలరు కృపాదియోధు లట గాని యొకండును జేరబోవఁగా
బలరిపుసూను నబ్బురము చైకొన జూచెద రంతెగాని కే
వలము గతాసులైరి కురు వర్యులు సైంధవుపట్లు నంతలో
నిలిచి రణావనిం బలికె నేరుపుమై కురురాజు క్రీడికిన్.

బాగు - ఖండగతి

ప॥ వేటవిలుకాడవను - మాట లీనాటితో
బూటకము గావింతురా - వేల్పు తేనికొడుకా ॥వే॥

అ॥ ప॥ నేటిపోరాటమున - నీపస గనంబడెడు
నే తేనిచోట మును - నీకు బిరుదము సెల్లె ॥నే॥

చరణము

సరిలేరు నాకన్న - దురభిమానము వీడి
సమరమొనరింప రారా - మగటిమినీకున్నెడ
పరువుగల పాండు - భూవరునకు జనించుచో
శరధాటికోర్చి మీ - శౌర్యమగుపింపర్రా ॥మే॥

సీ. అనిపల్కిన గిరీటి ♦ కినిసి పెక్కమ్ములం
బరగించునంత ని ♦ ష్ఫలములౌట
గని విస్మయంబంది ♦ కవచధారణమున
నట్లౌట గుర్తించి ♦ యమరవిభుడు
తనకు మున్నిచ్చిన ♦ ఘనతరాస్త్రమ్మున
దాసిభేదింప య ♦ త్నపడునంత
ద్రోణి యద్దాని జి ♦ త్రముగ ద్రుంచియు వమ్ము
గావింపగా క్రీడి ♦ కనలి తేని

తే. గీ. విరథుగావించి తఱచుగ ♦ గరతలముల
నారసము లెన్నియో నాటి ♦ గౌరవపతి
కటకటంబడి లేదు కం ♦ కటమువలన
లాభమని పారవైచి తో ♦ లంగిపోయె.

వ. అంత వృషసేన కర్ణ భూరిశ్రవ సైంధవ కృపాశ్వత్థామాది యోధులు పెక్కండ్రు క్రీడిపై దలపడి పోరాడుచుండి రిటధర్మజాదులు ద్రోణాదులం గలిసి పోరుచో బకునితమ్ముండగు నలంబసుడు పాండవసేనపైబడి మాయాయుద్ధం బొనర్చుచు భీమాదుల జిక్కుపఱచు చున్నంత ఘటోత్కచుం డాతనితో బెద్దతడవు పోరాడి వానిం బోకార్చునంత పాంచజన్యధ్వనులు మిక్కుటమ్ముగ వినవచ్చుటచే మనంబు గలంగి పాండవాగ్రజుండు సాత్యకింగని యిట్లనియె.

ఉ. ఎచ్చట పాంచజన్యరవ ♦ మే వినవచ్చెను, క్రీడి యోరిచే
నొచ్చెనొ, యొక్కడయ్యెనొ క ♦ నుంగొనుమా ధరణీరజ మ్మదే

నచ్చెలియు న్గురుండుగద ♦ నీకు గిరీటి, బిరాన నేగి వి
వ్వచ్చుని గాచికొమ్ము బక ♦ వైరియు తోడగు నీకు నవ్వలన్.

క. అని పల్కిన విని సాత్యకి
చని కౌరవబలములనెల్ల ♦ సమయించుచు ద్రో
ణుని దాకి పోరి కడకొ
య్యన లోనికి నేరె నొగి మ ♦ హావీరుండై.

సీ. కృతవర్మ సత్యక ♦ సుతునితో బోరాడి
వారింపగాలేక ♦ పాఱిపోయె
జలసంధు డను ధరా ♦ జాని శైనేయుతో
సమరమ్ము గావించి ♦ సమసిపోయె
నడరి సుదర్శనుం ♦ డను ఱేడు సాత్యకి
తో యుద్ధమొనరించి ♦ పోయె దివికి
శినివరుతో దుస్స ♦ సేను డాలమొనర్చి
చేవసాలక కాంది ♦ శీకుడయ్యె.

తే. గీ. విజయుపోల్కి మురాంతకా ♦ న్నుజుడు పెక్కు
యోధులం గెల్చి పోరాడు ♦ చుండునంత
ధర్మజుండంప బకవైరి ♦ దర్పమెసగ
తరలి సేనాముఖమ్మున ♦ గురుని గవిసె.

క. కవిసిన భారద్వాజుం
డవురా! నీ వెట్లుపోదు ♦ వనుమతి గొనకే
భవదీయానుజు డెటు సనె
నవలోకింపవా? యటన్న ♦ ననిలజు డనియెన్.

మోహన - ఆది.

ప॥ ఎన్నడి యెచ్చ విందు జేయించు ♦ కొన్న రీతి మాటాడ నేర్చితి ॥ఎ॥
అ॥ప॥ పున్నమునకు బోసిత్తు వేనన్ను పన్నిన మొగ్గర మందు కేర్పడనే ॥ఎ॥

చరణము

కాదు వీడు జేజే రా కొమరుడు - కదనభీముండు భీముండుగాని
చూడమిచటగురుడని దైవంబని - పాడి యెఱుంగక పల్కెదవాడ ॥ఎ॥

క. అని పల్కుచు గదచేకొని
ఘనివడి సారించినైవ ♦ బాలుడు పఱచెన్
ఘనరథ్యమ్ములు గూలెను
వనరుచు సారథియు ద్రెళ్ళె ♦ వైరులు వడకన్.

ఉ. బెబ్బులిగన్న లేళ్ళగమి ♦ పోలిక జిందర వాదరై బలం
బుబ్బ సెడన్ బకారిసన ♦ నొం డరదమ్మున ద్రోణుడెక్కి తా
దెబ్బన నమ్ములం గురియ ♦ తెంపున వాయుసుతుండు చేసొగ
ల్దబ్బున బట్టిపీచెను ర ♦ థమ్ము విరోధులు విస్మయంపడన్.

ఉ. అంతకసన్నిభుం డగు బ ♦ కారి ధనంజయుగాంచి యెంతయున్
సంతసమంది సూతసుతు ♦ జయ్యన దాకి తొలంగజేసి తా
నంతనబోక కౌరవుల ♦ నయ్యెడ బెకుర గూల్చికర్ణు న
త్యంతము గాసిపెట్టునెడ ♦ నర్కసుతుండును రక్తనేత్రుడై.

తే. గీ. అనిలజు నిరాయుధుం జేసి ♦ యంపవాన
గురిసి కుంతి కొసంగిన ♦ వరము దలచి
గెడపు టుడిగి నవ్వుచు వింట ♦ గడుపు బొడిచి
పలికె నీవిధి నవమాన ♦ పడ వడముడి.

౭౭

కన్నడ - ఆది

ప॥ కడవలాదిగా గాంక్షతీఅతిని-మిడుకకీ మునికి నడభివచ్చితిప ॥క॥

అ॥ప॥ బడుగ! నీ కేలభండనంబింటి-కడనయుం మమాయడచిపడెత యిటు॥

చరణము

వనమునం గందమూలమ్ములు దిని-మునివై యుండక నీ కేలకలను?
చెనయురాను ననుబోటితో నెపుగు-చేయలతిం గని సేయుమాహాఫము॥

తే. గీ. భుదశినాడవు కాబోలు ♦ పాప మీరావు?
కలరుగా నరనారాయ ♦ ణులు సని యట
స్వేద్దద్దీక్షుకొ మిన్నంక ♦ చేతగాని
భండవమున్నను రాకుమ్మో ♦ తిండిపోతు!

వ. అనిపల్కి వృకోదరుండు విన్నని మొగంబుతో, సవ్యసాచి కడకుం జనియె. సాత్యకియు కురుబలంబుల నేట్లాడుచు గడకు భూరిశ్రవునితో బెనంగి పోరు నెడ నయ్యిరువురు గొంతవడికి పాదచారులై మల్లయుద్ధంబొనర్చుచో భూరిశ్రవుండు పెద్దయుం బ్రొద్దుపోరి డస్సియున్న కృష్ణానుజు నేలంబడవైచి యెగసి యురంబు నిరుగాలం ద్రొక్కి కృపాణమ్మున కంఠమ్ముం దునియ నేయుచున్నంత గోపాలుండది కని వేగిరపడి యర్జునుంగాంచి,

శా. నీకుం దోడ్పడవచ్చి నాయనుజు డిం ♦ తేడస్సి భూరిశ్రవుం
దాకంజాలక సెందరాని దురవ ♦ స్థంబొందుచో జూతువే
లా? కంఠం బిపుడుత్తరింప గరివా ♦ లంబెత్తె, వే ద్రుంచు మో
యూకౌంతేయా! కరం, బన న్విజయు డ♦ ట్లుగ్రుండు చెలద్బాహువుల్.

తే. గీ. తునిసిపడి బాహువు భుజంగ ♦ మనగ జెలంగె;
నతడు గాండీవికను తగు ♦ నయ్యా! నీకు
జలజనాభుని దురుపదే ♦ శమున శిష్టి
పరునితో బోరు నన్యాయ ♦ మతయ, పార్థ!

వ. అనవిని విజయుండును,

ఉ. దూఱెద వేలనన్నిటుల? ♦ దోడ్పడవచ్చి బిగాన గాంచికో
నేరని మీబలాధిపుల ♦ నీవొగి దూఱుము, ధర్మమున్నచో
మారసమాను నట్టియభి ♦ మన్యుకుమారుని గూల్తురో? కా
ర్మారగు ధర్మమూర్తి దురభి ♦ మాని సుయోధను కారణమ్మునన్.

మంజరి

అనిన నిరుత్తరుడై భూరిశ్రవు - డపసవ్యకరమ్మున
రణభూమి శరమ్ములు పఱచుకొనుచు - బ్రాయోపవేశముసరు
ప్రాణాయామపరుండై యుండగ - బరికించి శినిపౌత్రుండు
చేనున్న కత్తితో శిర - స్ఛేద మొనర్చె కోపుండై
[illegible] డ ♦ [illegible]
య్యదనున శైనేయు దాక ♦ నత డాకర్ణం

బదునగు నారసములఁ జే
టొందవగ గొట్టంగ బాతె ♦ నొందువలనికిన్.

వ. అట్లు పలాయనుండైన కొంతవడికి కవ్వడినెదుర్కొన నలిగి కిరీటి రాధేయున కిట్లనియె.

కాంభోజి - రూపకము.

ప॥ ఏటికి భీముండూటితి - పిప్పుడు సాత్యకి గెలువడె ॥ఏ॥

అ॥ ప॥ ఓటమియు న్గెంపు గలుగు - యుద్ధములో నెట్టిఘనుల్ల ॥కే॥

చ ర ణ ము

అలతిపై బకాంతకు నీ - వాక్షేపించితివి గాని
తులువా నీకులము గుణము - దోచెం బ్రజ కెల్లరకును ॥యే॥

ఉ. పాడిదొఱంగి చేతివిలు ♦ భగ్నము సేసి మదాత్మజాతు దు
న్మాడిరి నేను లేనిసమ ♦ యమ్మున; దానికి శ్రీవుసూడగా
పాడెనెయిన్ ద్వదాత్మభవు ♦ భవ్యశిర మ్మొకపాడికోలఁ దు
న్మాడుదు, నిన్ను ఖండనము ♦ నన్ బలి వెట్టుదు భారతాంబకున్.

వ. అనిపల్కి కర్ణుందరిమి తక్కుంగల సైనికులపైబడి యేట్లాడు చున్నంత సుయోధనుండు రాధేయున కిట్లనియె.

చ. చలమున భీమసాత్యకులు ♦ సాయము రా విజయుండు సింధుభూ
తలపతి యున్న వంకకటు ♦ దర్పమునం జనుచున్న వాఁడదే
జల్లజహోతుండు క్రొంకుతటి ♦ సన్నిహితం బగునంతదాక
యలవు బలమ్ముఁజూపి మఘు ♦ వాత్మజు నెట్టులో నిల్వరింపుమా.

వ అనిన విని కర్ణుండును,

చ. వడమునడిచి వాడితూపులకు ♦ బొల్పడి దేహము చాలనొచ్చెనీ
య్యెడ, నగుఁగాక! సూతను వ ♦ దీనము జేసితిరికు గాన క
వ్వడి నెటులో వికర్తనుడు ♦ పశ్చిమశైలము జేరునంతకుం
గడిమిదలిర్ప నిల్పుదును ♦ కయ్యమునం దిటుపై సుయోధనా!

వ అని పల్కి,

చ. జలరుహమిత్రనందనుడు ♦ సైనికులం బురికొల్పి కవ్వడిం
దలపడి విక్రమంబెసగ ♦ దారుణభంగి రణమ్ము సేయుచో
బలరిపునందనానలుడు ♦ నైరికులాటవి గాల్చుచుండ నా
జలరుహనాభుడిట్లనియె ♦ సంగడికానికి కర్మి క్రీడికిన్.

ఆరభి - ఆది.

ప॥ కనుగొంటివె పార్థా! సేరబోదొ - దినకరు డీ
యస్తాచలసీమకు ॥కను॥
అ॥ ప॥ పెనగులాడ జన - దింక వీరితో
దునుమాడందగు - సైంధవుశిరమును ॥కను॥

చరణము.

పాశుపతము వింటసంధింపుము - పార్వతీరమణు నెద ధ్యానింపుము
నేనదుపాయం బొందుగల్పింతు - నీనల్పిన ప్రతినం జెల్లింతును ॥కను॥

చ. మఱుగుపడంబొనర్తు రవి ♦ మండల మేన్ యోగమాయ జేసి చూ
పఱకును తమ్ముంబగుం బ్రతిన ♦ భంగము నెందెనటంచు సింధు భూ
వరుడును కౌరవుల్దురము ♦ వాసి యథేచ్ఛగ సంచరింతు రీ
వెఱవున సైంధవుం దునిమి ♦ వేగ కృతార్థుడ వౌదు నర్జునా!

వ. అనిపల్కి మాధవుండు మాయాతిమిరంబున తిమిరారిం గప్పిన,

తే. గీ. తరణి గ్రుంకె నటంచు సైం ♦ ధవుడు తేరి
పైని నిలుచుండి తలయెత్తి ♦ పడమటిదెస
జూచుచున్నంత సురరాజ ♦ సూను డొక్క
సాయకమ్మున వాసి మ ♦ స్తకము దునిమెం.

వ. అప్పుడు సత్వరుండై శ్రీహరి పార్థుంగని,

చ. ఇలబడరాదు వాని శిర ♦ మింపుగ నేనటు లాకసమ్మునన్
నిలువు మటన్న క్రీడియును ♦ నేర్పున బంతివిధాన దివ్యమార్గమున్
ములుకుల మోపున న్నభమ్ము ♦ ముట్టగ గొట్టుచు నెంతకాల మీ
నిలుపుట పల్కవే? యనిన ♦ నీరజనాభుడు క్రీడికిట్లనెన్.

తే. గీ. ఏమఱగ వీని శిరము ఖం ♦ డింపబడు న
టంచు నశరీరవాణియు ♦ న్నానతీయు
ధరణి బడనేయు వీని మ ♦ స్తక మెవండు
వానిశిర మప్పుడే నూరు ♦ పఱియలగు న
టంచు సైంధవుతండ్రి శ ♦ పించె తపసి.

వ. కావున నావృద్ధక్షత్త్రుం డీశమంతపంచక సమీపమున జపంబొనర్చు చుండు నీశిరం బాతపసితొడపై బడునట్లు గొట్టుమన నతండట్లు సేయ తచ్ఛిరం బాతని తొడమీద బడిన దిగ్గున లేచి త్రోచిన నది భూమిపయిం బడుటయు నత్తపస్వి శిరమ్ము సహస్రఖండము లయ్యె నచ్యుతుండును మాయాతిమిరంబు హరింప వృద్ధారుకుండు లోచన గోచరుండయ్యె నంత క్రీడి సవిస్మయుండై గోవిందునకు సాష్టాంగపడి,

కాఫీ - ఆది

ప॥ పరమపురుష గోవింద రమాధన-పద్మనాభ శౌరీ దయానిధీ ॥ప॥
అ॥ప॥ గరుడగమనక్షీరాంబుధిశయన-దురితదమనసరసీరుహనయనా॥ప

చరణము

హరిముకుంద గోపాల పరాత్పర - ఆదిదేవ శరణాగతరక్షణ
కరివరదా విశ్వేశ మురారీ - నరసింహా కేశవ నారాయణ ॥ప॥

చ. కలశభవాదియోధు లటు ♦ గావలియున్న బురారికేనియు
న్నలుపగ జెల్లునే ప్రతిన ♦ సైంధవుగూల్ప? మహానుభావ! నీ
యలఘుకృపావిశేషమున ♦ నట్లు కృతార్థుడ నైతిగాక భూ
తలమున గడ్డిపోచయు గ ♦ దల్పగ శక్తుడనే? పరాత్పరా.

వ. అనిపల్కి క్రీడిభుజము దట్టుచు జగన్నాధు డిట్లనియె.

వ. అనిపల్కి క్రీడిభుజము దట్టుచు జగన్నాధుం డిట్లనియె.

సీ. అతిమానుషమ్మున ♦ నర్ధరాత్రమున నం
గారపర్ణు జయింప ♦ బోరు నాడు
మాయాకిరాతుని ♦ మాడ్కి నేతెంచిన

త్రిపురారితో మొహా ♦ రించునాడు
వసధిమధ్యమున డా ♦ గివ కాలకేయాది
దనుజావళిం గూడి ♦ పెనగునాడు
గోవులకై భీష్మ ♦ కుంభసంభూత క
ర్ణాదులం గూడి పో ♦ రాడునాడు

తే. గీ. నీకెవరు సాయమైరి లో ♦ కైకవీర!
భవ్యభవదీయశౌర్య సం ♦ పదయెగాక,
మనకొఱకు వేచియుండు ధ ♦ ర్మజుడు సైంధ
వుని వధించుట దెలుపబో ♦ వుదము రమ్మ.

క. అనిపలికి క్రీడి దోడ్కొని
వనజాక్షుడు ధర్మజునకు ♦ బ్రవరమ్మున న
ర్జునుడు జయద్రథునిం గూ
ల్చినవిధ మెఱిగింప ముదము ♦ జెందె నతండున్.

శ్రీ.

# మహాభారతము

## ప్రచండపార్షతము

కమాచి – ఆది

ప॥ వినిపింతు ప్రచండపార్షతం బిదె వినుడు సభికులారా – ధర్మమ్మైన ॥వి॥

అ॥ప॥ పనివడి పార్షతు డాకలశభవుని బవరమ్మున దునుమాడిన చరితము॥

చ ర ణ ము

కురువిభు డా సైంధవుని చావునకు - బరితపించి మిగుల - రయమ్మున
గురునికడకు సని నిందింపగనా - కుంభసంభవుం డతనికిట్లనియె ॥వి॥

మ. నను నిందించెద వేల? దేవతలకై ♦ నస్త్రైల్వగాబోల ద
ర్జును, గాంగేయునివంటి వీరవరు డా ♦ స్తుడుద్యోగి, మీ కౌరవు
ల్మనరంచు న్మది దోచె; గయ్యమున కే ♦ లావచ్చితీ వంచనన్
ధనురాచార్యుడనన్న పెన్దురభిమా ♦ నం బిట్టు లేడ్పించెడున్.

సీ. సమవర్తి నందను ♦ శకునితో దబ్బిబ్బు
పాచికలాడించు ♦ ఫలితమిదియె
ద్రౌపది నేక వ ♦ స్త్రను రచ్చకీడ్పించి
పరిభవించినయట్టి ♦ ఫలితమిదియె
కూడుగుడ్డకు దూర ♦ గుల జేసి దాయల
వనుల క్రింపించిన ♦ ఫలితమిదియె
సంధిపొసంగింప జనుదెంచిన మురారి
పలుకు లాలింపని ♦ ఫలితమిదియె

తే. గీ. చేతనగు నేని బవరమ్ము ♦ సేయు మట్లు
చాలకున్నెడ ధర్మజు ♦ శరణు జొరుము

క. మృతుడైన హిడింబాసుతు
గతిగని పాండవులు వగవ ♦ గమలదళాక్షుం
డతిమోదమంది వలమురి
లతిరావంబెసగ నూద ♦ నర్జును డనియెన్.

శా. బావా, దేవ, మహానుభావ, బలసం ♦ పన్నుండు హైడింబుడే
జీవమ్ముల్దొలగ న్విచారపడక ♦ సింహారవం బేటికో
గావింప న్మణిపాంచజన్యమిటు లు ♦ ద్ఘాటించి పూరించితే
లా? విన్నింపుము మావిచార మెటు నీ ♦ కానందమై తోచెనో?

వ. అనిన వాసుదేవుం డిట్లనియె.

చ. కవచము కుండలమ్ములును ♦ గైకొని కర్ణునకిచ్చె శక్తి నా
సవ్వ డది యన్నచో గెలువ ♦ సాధ్యముగాదతనిం బురారియున్,
దివిజనిభుండు కర్ణుడు, గ ♦ తించెను వానికి శక్తి, నీకు మృ
త్యువుతొలగెంగదాయని కు ♦ తూహలమందితి, శంఖ మొత్తితిన్.

తే. గీ. నాకు నాప్రాణములకన్న ♦ లోకపాల
నమునకన్న నెక్కుడు నీవ ♦ సమరమందు
నిన్ను రాధేయు డిక జంప ♦ నేర డంచు
హాయిగా నిద్రబోదు నీ ♦ రేయి, పార్థ!

వ. అని సమాధానమ్ము సెప్పి హిడింబానందనుని చావునకై శోకించు నెల్లవారిని వారించె; నంతదమోమ్మల్యుం బగుడు కొంతదడవ్వు యుద్ధమ్ము సాలించి చంద్రోదయం బగునంత నుభయబలంబులుం దాకి పోరుచో శరగురుం డేరికిం దేటిచూడరాక పాంచాల బలంబుం గూల్చుచు విరాటద్రుపదులం జంపె. ధృష్టద్యుమ్నుండు మరిడీవడుచు ద్రోణుం గూల్తునని బాస జేసె కురుబలంబు ప్రబడి సైనికుల నుటుమాడుచు సూర్యోదయంబగునంతకు నేకవీరుండై యరివీరులం దెగటార్చుచు ద్రోణు డత్తరిం గని పోరాడుచున్నంత కవ్వడితో ధృష్టద్యుమ్నుం డాచార్యునితో బెనగుచున్నెడ కమలనాభుండు పార్థున కిట్లనియె.

మంజరులు

అనిపల్కి సమ్మతించి ద్రోణుకడ - కాధర్మజు డేతెంచి
తనకుంగృష్ణుడు చెప్పినవిధమున - ననగుంభజు డాలించి
తనయునికై శోకించి బ్రహ్మరం - ధ్రమున బ్రాణమ్మువాసె.
గని పార్షతుండు గురునికంఠమ్ము - ఖండింపగ వడి డాసె.

వ. అట్లుడాసి ధర్మజాదులు వారించినను వినక కరవాలమ్మున ధనురాచార్యు కంఠమ్ము దెగగోయ సహింపక సాత్యకి ధృష్టద్యుమ్నుంగని.

సారంగ - రూపకము

ప॥ క్షత్రియ చండాలుడవై - శవకంఠము గోసినావ ॥క్షత్రి॥
అ-ప॥ పాత్రాపాత్రము లరయక - పాంచాలకుల కళంకా ॥క్షత్రి॥

చరణము

ద్రోవది తలవంపవలసె - తోడబుట్టు వీవగుటను
బావమఱది వై పాండవ - భవ్యయశము జెఱచినావు ॥క్షత్రి॥

తే. గీ. కౌరవులు పాండవులు మించి ♦ గారవించు
దేశికునకిట్లు ద్రోహమ్ము ♦ జేసి యెవడు
బ్రతుక నేర్చును వామురా ♦ పసులుగలిగి?
పాండవ శ్యాలకుడ వౌట ♦ బ్రతికినాడవు.

వ. అనిన ధృష్టద్యుమ్నుండు సాత్యకింగని,

చ. పరులకు దెల్ప నెల్లరును ♦ ప్రాజ్ఞులెపో! తమతప్పు లెవ్వరో
యెఱుగరు సామదత్తిని వ ♦ ధించితి వీవెటు? భీష్మ నేగతి
స్సరుడు జయించె? నేడు ఘట ♦ నందను గూల్పగ ధర్మసంభవుం
డరిగిన మార్గమెట్టిదియొ? ♦ యందరికి న్విశదమ్ము గాదొకో?

వ. అని సమాధానముంజెప్పి పార్షతుని చుఱచుఱం జూచుచు నర్జునుం డిట్లనియె.

ఉ. కల్లలువల్కి నేడు కుల ♦ గౌరవముం జెడగొట్టుకొంటచే
నెల్లరిలోన మేముతల ♦ లెత్తక సిగ్గిలుచుండ నయ్యయో!
చెల్లని సాహసమ్మునని ♦ సీ! శవకంఠముగోసి నేటికీ
వల్లన వచ్చుమేన ద్రుహ ♦ దాన్వయము న్మలినం బొనర్చితే?

వ. అనవిని కటకటంబడుచు ద్రుపదసూనుం డర్జునునకిట్లనియె.

చ. ద్రుపదకులమ్ము నల్పవడె ♦ ద్రోవదినిచ్చిననాడె మీకు మా
కిపుడది క్రొత్తగాగలుగ ♦ దేమనుకొన్నను లాభమేమి? చు
ట్టపు మరియాద నెంచి జగ ♦ దమ్మును సాయము సేయ వచ్చుట
న్నెపమిడి బుద్ధిచెప్పితివి ♦ విన్ననగా బనిలేదు, వాసవీ!

చ. కలశభవు న్వధించుటకు ♦ గా జనియించితి జన్నమందు కే
వల, మటుగాన గుంభజుని ♦ ప్రాణము వాపితి, దోసమెట్లగున్?
తలపుము, సీతనూభవు న ♦ ధర్మముగా విలుద్రుంచి పోరిలో
బలువురు చుట్టుముట్టి యటు ♦ ప్రాణము దీయగ హేతు వీతడే.

వ. అనిపల్కినం గోపించి సాత్యకి,

అఠాణా - ఆది

ప॥ సిగ్గుమాలి నోరు మూసికొన కిట్లు - చేసిన చేత సమర్థింతువేల॥సిగ్గు॥

అ॥ప॥ తగ్గశాస్త్రినికియ్యేతజరుగవిట్రిగాగుబాతువలెవదరుచున్నావు॥సిగ్గు॥

చరణము

శిరమింకను పగులదేల నాలుక - చీలికలై చనదేల? పాపాత్మ!
గురుపరాభవ మహాపాతకమున-కొడిగట్టిన చండాలుడ విసీ ॥సి॥

తే. గీ. అనుచు బల్క రోషారుణి ♦ తాత్ముడగుచు
ధరకు లంఘింప దనయుర ♦ దమ్మునుండి
కేశవప్రేరితుండైన ♦ కీచకారి
రయమునం బట్టినిలుప బా ♦ రతుడు పల్కె.

శా. రాని మ్మాతని నిల్వరింపకుము భీ ♦ రమ్మొల్ల జూపింప్ నీ
మ్మెనుంజూతు, వివాదమేమిటికి ♦ పోనిమ్మంచు శాంతించుట
దానేమో ప్రకటించుకోదొడగె వా ♦ గ్దర్పమ్ము భూరిశ్రవుం
గా నన్నుం దలపోసెనో? విడువు మ ♦ జ్ఞానమ్ము వారించెదన్.

చ. అనవిని పాండవాగ్రజుడు ♦ నంబుజనాభుడు వారినిర్వుర
న్బనివడి శాంతచిత్తుల నొ ♦ నర్చిరి, ద్రోణసుతుండు నయ్యెడం
గనుగవ నెఱ్ఱదామరల ♦ కైవడి కెంపుజనింప నుగ్రకో
పనుడయి రోజుచుం బ్రళయ ♦ భైరవుపోలిక బల్కె నీవిధిన్.

పూర్వకళ్యాణి - ఖండగతి

ప॥ ఖండనము తొలగిపో - కుండు డీనాటితో
బనిదీర్ప వహ్నులారా - పాండునందనులారా! ॥పని॥

అ॥ ప॥ దండనాథ్యుల రీ ర - పాండవముఖ? గావించి
తండ్రిఋణ మీవాడు - తప్పకే దీర్చెదన్ ॥ఖం॥

చ ర ణ ము.

జనకుజంపిన కోప - మున కుఠారముబూని
జనపిభుల దెగటార్చిన - భృగురాముని పోలిక
జనకవధ సంజాత క్రోధ - మున నీద్రౌణి
సాయకాగ్నికి మిమ్మ - శలభముల గావించు ॥ఖం॥

వ. ఇట్లుపలికి,

సీ. బ్రహ్మాండభాండంబు ♦ బ్రద్దలై పేడెత్తి
భోరున పిడుగులు ♦ మ్రోతలెత్త
జవ్వాడి ధారుణీ ♦ చక్రమ్ము దిర్దిరం
దిరుగ, మార్తాండుండు ♦ తేజమెడల,
దిశాసామజమ్ములు ♦ త్రెళ్ళ, చుకలురాల,
గ్రహాసమూహమ్ము ఛీ ♦ కాకువడగ,
కులశైలములు గ్రక్క ♦ దల, నేడు వారాశు
లేకమై భూభాగ ? ముల్ల పొరల

తే. గీ. నస్త్రగురు తనయుండు నా ♦ రాయణాస్త్ర
మేయుగా నది పెనుమంట ♦ లెగయ వచ్చు
టరసి సైనికులెల్లరుం ♦ బఱువ దొడగ
వడి జనార్దను డనె నెల్ల ♦ వారు వినగ.

క. నారాయణాస్త్ర మయ్యెడి
మీరాయుధములను విడచి ♦ మీ వాహనముల్
జేరముడిగి డిగ్గి నమ
స్కారము గావింతురేని ♦ కాల్పదు మిమ్మున్.

వ. అనుటయు సకలజనంబు లట్లుగావించునెడ వాయునందనుడు సైని
కుల కిట్లనియె.

చ. వణకి నమస్కరింపకుడు ♦ వాహనము ల్దిగి శత్రుసాయక
మ్ముగన కదిశాత్రవున్ శరణు ♦ బొందుటయే యగు భీతిమాను డే
నణచెద ద్రోణిసాయకద ♦ వానలకీలల రాచపుట్టువం
దిన మగవానికిం దగునె ♦ తేజము మాపుకొనంగ జూచుటల్.

మ. అని కుంతీసుతమధ్యముం డపుడు శం ♦ ఖారావముం జేసి ని
ల్చిన ప్రత్యర్థిశరానలంబు వెసగా ♦ ర్చిచ్చుంబలెం జుట్టు ము
ట్టిన గృష్ణార్జును లాయుధమ్ము గొని య ♦ ట్లే తేరిపైనుండి చ
య్యన నాభీముని డిగ్గద్రోసి కిలాక ♦ య్యస్త్రంబు శాంతింగనెన్.

వ. అంత నశ్వత్థామయు గోపావేశంబున ధృష్టద్యుమ్న సాత్యకుల మూర్ఛనుమ్మించి కవ్వడిం దలపడి,

శంకరాభరణం - త్రిశ్రగతి

ప॥ మాకడ విలువిద్య నేర్చి - మాపై దలపడెదవా ॥మా॥
అ॥ ప॥ పోకార్తు న్నేడు పార్థ - పోక నిల్వు మో క్రీడీ ॥మాక॥

చరణము

కల్లలు బల్కించి ద్రోణు - గడతేర్పించితివి చెనటి
యిల్లటికిన బంధువయ్యె - నే ద్రోణాయని లేడే ॥మా॥

తే. గీ. అనుచు పావకబాణమే ♦ యం గిరీటి
సరగ బ్రహ్మాస్త్రమున దాని ♦ నిమయము జేసె
ద్రోణి విలుపాఱవైచి ర ♦ థమ్ము డిగ్గి
యేగు నెడ వ్యాసుడెదురై వ ♦ చించె నిట్లు.

మ. నరనారాయణు లాదిమానులు జగ ♦ న్మాన్యుల్ మహాత్మావనీ
భరముం బాపగ ధర్మమెల్లెడల ♦ నిల్పన్ జన్మముం బొంది ఇ
ద్ధర గృష్ణార్జుననామము ల్వడసి స ♦ త్యప్రజ్ఞ లపారవి
ర్జరులైనం బరిమార్పజాలరు యథా ♦ ర్థంబిద్ది ద్రోణాయనీ!

వ. అనిపల్కి వ్యాసభగవానుం డంతర్ధానంబు నందె. ద్రోణియు కురుపతి పాలికింబోవ పాండవులును సంతోషసమున్నత నిజశిబిరంబులకుం జనిరి.



శ్రీ

# మహాభారతము

## కర్ణప్రతాపము

భైరవి - ఖండగతి

ప॥ వినిపింతు కర్ణప్ర - తాపసత్కథ నేడు
వినుడు పుణ్యాత్ములారా - సభాసదులార ॥వి॥

అ॥ ప॥ ధనువు చేతంగొన్న - ఘనులలో మొనగాడు
ననిమిషాదులకే - న జేయుండు కర్ణుండు ॥వి॥

చరణము

శరగురుండు గతింప - కురువిభుడు రాధేయు
సైన్యాధిపతిగ జేసె - తూర్యారావమ్ములు మ్రోయగ
నిరుపమ పరాక్రమము - నెఱపి రిపుసైనికుల
నుఱుమాడె తొలినాటి - బవరమున నంగపతి ॥వి॥

సీ. తగిన సారథిలేమి ♦ తలచి దుర్యోధనుం
డంగరాజునకు మ ♦ ద్రావనీశు
సారథ్యమొనరింప ♦ సంప్రార్థనము సేయ
విడక తోచినరీతి ♦ విచ్చలవిడి
నేమేమి పలికిన ♦ నిచ్చగించు నిబంధ
నముననా శల్యుండు సమ్మతించె,
నుభయసైనికులు ర ♦ ణోర్వి కేతెంచిరి
సంగరప్రారంభ ♦ సమయమునను

తే. గీ. అశ్వహృదయజ్ఞుడగు శల్యు ♦ డట్లు తనను
సూతుడయ్యెనటంచు మె ♦ చ్చుచు దినేశ

నందనుం డెంతయు న్మహా ♦ నంద మంది
పలికె నీవిధి మద్రభూ ♦ పాలుతోడ.

ఉ. సూతకులుండు పీడనుచు ♦ సుంతయు రోయకు మాత్మలో, బురా
రాతికి నల్వపోలిక, బ ♦ లారికి మాతలి కైవడిన్, మురా
రాతికిరీటికింబలె, దు ♦ రమ్మున మద్రథ చోదకుండవై
ఖ్యాతిగడించి నాకు విజ ♦ యం బొడగూర్పుము మద్రభూవరా!

ఉ. కవ్వడిగాడు నేడు కలి ♦ కంఠుడె నిల్చిన నిల్చుగాక దా
దవ్వుల బాఅదోలి భుజ ♦ దర్పము సూపి విరోధివర్గముం
గ్రొవ్వడగించి శక్రసుతు ♦ గూల్చి సుయోధను నప్పుదీర్చెద
న్నవ్వులుగావు నానుడులు ♦ నమ్ముము సేయుము సూతకృత్యమున్

వ. అనిన శల్యుండును,

కేదారగౌళ - రూపకము

ప॥ కుంతీతనయుల రణమున - గూల్తుననకు జగమునవ్వ ॥కుం॥
అ॥ ప॥ చింతింపుము మాటలకుం - జేతలకుం జాలదవ్వ ॥కుం॥

చరణము

కవ్వడితో నీకు పోల్కి - కలదా? సూతకులీనా,
యెవ్వరెఱుంగనిది నక్కి - యేడ? నాకలోక మేడ ॥కవ్వ॥

సీ. కులమూ, ప్రసిద్ధ వీ ♦ రుల కాలవాలమై
యలరారు నల భార ♦ తాన్వయమ్ము
బాహువిక్రమమూ, భ ♦ వానీకళత్ర బి
డౌజాది సన్నుతి ♦ భాజనమ్మొ
సాధన ప్రకరమూ, ♦ సర్వసుపర్వ ప్ర
సాదిత దివ్యాస్త్ర ♦ సంచయమ్మొ
సారథియూ, సమ ♦ స్త జగన్ని యామక
స్తవనీయదేవతా ♦ చక్రవర్తి

తే. గీ. నిరుపమాన ప్రభావుడ ♦ న్నిట గిరీటి
యాతనికి నీకు బోల్కిలే ♦ దరసిచూడ

గడ్డిపోచయు గదలింప ♦ గా నశక్తు
లకు భవాదృశులకు బ్రగ ♦ ల్భములు మెండు.

చ. భువనములెల్ల భస్మమగు ♦ బూజ్యుఁ డజాతరిపుండె యల్గుచో,
బవనసుతుండు చేతగద ♦ బట్టి రణంబున నిల్చెనేని వా
సవ వరుణాదిదిక్పతులె ♦ ప్రాణభయమ్ము నఁ బాఱజూతు, రా
కవలుఁ నిరంకుశు ల్సమర ♦ కర్కశు; లెవ్వనిగూల్తు వీరిలో?

వ. అనవిని రాధేయుం డిట్లనియె.

మ. సరిలే! సారథి చేయుచున్నెన యుపదే ♦ శంబిద్దియా? క్రీడిమా
దిరి నేపోరఁగలేనా? శౌరికరణిం ♦ దే రీవు తోలంగ లే
వా? రణోత్సాహము వాపె దేమిటికి? చా♦వు ల్మర్మముల్జెప్పి పా
మరులై యట్లు తమంతనేపడిన భీ ♦ ష్మద్రోణు లన్గాంచితివో?

వ. అనిన శల్యుండును,

తే. గీ. దేవకీతనుజాతు మా ♦ దిరి రథమ్ము
నడుప నేర్తు నేమో కాని ♦ నరునివోలె
నీవు యుద్ధమ్ముగావింప ♦ లేవు; నిజము;
నీకుజయమనుమాట కుం ♦ దేటికొమ్ము.

వ. అనినవిని కనలి రాధేయుండిట్లనియె.

నాట - ఆది

ప॥ నోరుమూసికొని- తేరు తోలనిమ్ము కాఱులాడి ప్రాణములకు జెడకుము॥
అ॥ప॥ మేరమీరి పరుషోక్తులాడెదవు- సారాస్త్రావళి వేమొ ఱాలనాడు॥

చరణము

వరుసవావులుదలంపక పురుషులు వనితలుం గవయబుట్టితురుగాదే
పరువుమాలి పలువురకుంబుట్టిన- పాపాత్ములు మీరెవ్వ రెఱుంగరు॥

తే. గీ. సర్పసాయకభార్గవా ♦ స్త్రములుగలవు
మాధవధనంజయులబరి ♦ మార్పనెట్టు
లూరకేపోవు నయ్యావి? ♦ తేలనడపు
మీ నిరుత్సాహవచనంబు ♦ లింకమాని.

వ. అనవిని శల్యుండును,

ఉ. పాయుదు రా ప్తబంధువుల ♦ భార్యల నమ్మగజూతు రంగదే
శీయులు, వారికేలిక వి ♦ సీ కలుద్రావితినన్నమాత్ర నా
కీయెడ బన్నవోవునె? మ ♦ హీసురశాపముననర్క గణావని
స్నీయరదమ్ము గ్రుంగదొకో? ♦నిష్ఫలమేగద భార్గవాస్త్రమున్?

శా. లేవో ద్రోవది పెండ్లినాడు సమరో ♦ ర్వి జిత్రసేనుండు గొం
పోవం గౌరవనాథు నీవచటలే ♦ వో? లేవొకో శూరతల్
గోవుల్లోలుకపోవునాడు? కుమతీ! ♦ గుర్తింపగా నేరకు
న్నావో పార్థునిలావు? క్రిందవడియు ♦ న్నావందెమే యందువే?

క. అనిన న్విని రాధేయుడు
వినినియటు నటించి కృష్ణ ♦ విజయుల జూపిం
చినవారలకు ధన ముపా
యనముగ నిచ్చెదనటన్న ♦ నని శల్యుండున్.

శ్రీరాగము - రూపకము

ప॥ ఎవరుంజూపగ బనిలే - దీ యపాత్రదానమేల ॥యె॥
అ॥ ప॥ వివరించుగదా గాండివ - విముక్తశరపరంపరయె ॥యె॥

చరణము

దేవదత్త పాంచజన్య - దివ్యారవములె సూపును
కావలసిన కపికేతన - కాంతిపుంజమే సూపును ॥యె॥

సీ. వైశ్యపుత్రకులొక్క ♦ వాయసంబున కెంగి
ళులువెట్టి మేపగా ♦ గ్రొవ్వుపట్టి
రత్నాకరతమూపాంత ♦ రాయంచ నొకదాని
గాంచి నాతో బర్వ ♦ గా దొడంగు
మని మింటికెగసి తా ♦ అ, నొకంత కాయాస
పడి యీలగఁజచి యా ♦ వ్వనధిమున్గ
నంతలో గరుణించి ♦ హంసయు వీపున
నుంచుక కాకమ్ము ♦ నొడ్డుసేర్చె

తే. గీ. కురుకుమారులమెంగిళుల్ ♦ గుడుచు క్రొవ్వి
కొలదియెఱుగక కాకమ్ము ♦ వలెను రాజ
హంసయగు పార్థునెదిరించె ♦ దక్కతమున
చేటువాటిల్లు నీకు ము ♦ మ్మాటి కిపుడె.

చ. హరిణము కేసరిన్, శశము ♦ హస్తిని, సర్పము గృధ్రరాజముం
గరమెదిరించు చందమున ♦ గవ్వడితో బెనగందలంతు వీ
కరణి, పురారికి న్వశముగాదు ♦ కిరీటి నెదుర్కొనంగ, నీ
గరువతనం బెఱుంగనిది ♦ గాదుగదా మముబోటివారికిన్?

వ. అనిన కర్ణుండు కటకటంబడుచు గార్యభరంబున గోపమాపుకొని,

చ. అడిగితినే ధనంజయు బ ♦ లాతిశయ మ్మొగి జెప్పుమంచు ని
న్నుడుగక శాత్రవుం బొగడు ♦ టొప్పునె? మద్రధ చోదకుండవై
చెడుగవు మిత్రవంచనము ♦ సేయదలంచితి వింతమాత్రనే
జడియుదునే? సుయోధనుని ♦ సఖ్యమెదం దలపోసి సైచితిన్.

వ. అని పలుకనంతలో యుద్ధ ప్రారంభమగుడు సంశప్తకులు సవ్యసాచిం దలపడిరి. అశ్వత్థామయు ధృష్టద్యుమ్నాదులజంపి కాని కవచమూడ్పనని పలుకుచు ఘోరమ్ముగ బోరుచుండె. భీమదుర్యోధనుండ్రారుం దాకిరి. కర్ణుండు పాంచాల కుమారులం బెక్కండ్ర జంపుచు బాండవసేనం గలంచునెడ సాత్యకి ప్రముఖులు భీమసేన పురస్సరమ్ముగా సనుదెంచి రాధేయుం దాకునంత, కృపకృతవర్మాదులు భీమాదులం దలపడి పోరుచున్నంత భీమసేనుం డంతకాకారుండై కర్ణనందనుండగు సత్యసేనుం దునుమ రాధేయుండును గనలి పాండవసైనికులం గూల్చుచు సాత్యకి ప్రముఖుల విరథుల గావించి ధర్మజుందాకి బిట్టలయించి సారథిం జంపి కాందిశీకుం డగుచున్న యుధిష్ఠిరు దవిలి నిలువరించి యిట్లనియె.

దేవగాంధారి – రూపకము

ప॥ ఇంత చేతగానివాని - కేమిటి కీయని సేత ॥ఇం॥
అ॥ కాంతలకుందీసిపోవు - గదా! నీనొసటివ్రాత ॥యిం॥

చరణము

ఆచారపరుడవు నీకు - యాగాధ్యయనములు నెల్లు
రాచరికపు ధర్మమెంచి - రణమొనరుపరాకుము షా ॥మ్మి॥

ఉ. వచ్చినవాడ వేయలతి ♦ వారలతోడనొ కయ్యమాడ కీ
మచ్చున నన్ను బోటులను ♦ మార్కొన జూచెద, వింతనెల్లునే
పిచ్చితనంబు? తల్లికగు ♦ పింతువె కావలెనన్న గాని? వి
వ్వచ్చుని చెంత కేని సని ♦ ప్రాణములుండగ జూచుకొమ్మిర్కన్.

మ. అన లజ్జించి యుధిష్ఠిరుండరిగె న ♦ య్యంగాధినాథుండు కో
పనుడై పాండవసేనపైబడియె దు ♦ ర్వారక్షతాపుండు పా
వని రాధేయునిదాకి తూపులగమి ♦ న్వర్షింప గర్ణుండు నా
తనివక్షుంబు నిశాతసాయకములం ♦ దాటించి నొప్పించివన్.

చ. కనుగవ కెంపుదోప నల్గు ♦ కం బవమానసుతుండు వజ్రమో
యనదగు ఘోరభల్లమున ♦ నంగనృపాలునురమ్ము నింప మూ
ర్ఛనుగనె సూతసూతి, పెలు ♦ చం జనిభీముడు వానినాలుకం
దునియలు సేయగా దివుర ♦ తోడనె శల్యుడు వానికెల్లనెన్.

సారంగ - ఖండగతి

ప॥ శాంతింపుమా భీమ - సమదశాత్రవభీమ ॥శా॥

అ॥ ప॥ సుంతకరుణించి తెగ - జూడ కీతని నాల్క ॥శా॥

చరణము

ప్రతినజేసె కిరీటి - రాధేయు గూల్తునని
శతమఖాత్మజు ప్రతి - జ్ఞాభంగ మగుగాన ॥శా॥

చ. అనవిని భీముడున్విడిచి ♦ యుంగవిభున్, శ్రుతవర్మముఖ్యులం
బనివడి పెక్కురంగెడపు ♦ పట్టున గర్ణుడుమూర్ఛదేటి పా
వనిపయి నమ్ములం గుఱియ ♦ వాయుసుతుండును తీవ్రకోపుడై
ధనువును ద్రుంచి నాశనము ♦ తక్షణమేనె సురమ్ము గాడగన్ ప

చ. శకుని సుయోధను ల్దివిరి ♦ చయ్యన కోపనులై మదద్విపా
ప్రకరము నావృకోదరుని ♦ పై బురికొల్పిన గూలనేసి ఘో

టకముల మూఁడు వేగ్గడపి ♦ ధాకమెయిన్ బలివెట్టె నుత్తమా
శ్వికుల రణోర్వికి న్భరత ♦ సింహుఁడు భీము డుదగ్రకోపుడై.

సీ. రాధేయుఁ డా సౌబ ♦ లప్రముఖుల గూడి
పాండవోద్రేకమ్ము ♦ బాపఁదొడఁగ
సంశప్తకులు ధనం ♦ జయు జుట్టుముట్టి బి
ట్టలయించి రవ్వీరు ♦ నస్త్రవితతి
శారద్వతుండు పాం ♦ చాలకుమారులం
జక్కడె మారిమ ♦ సంగినిట్లు
ద్రోణతనూజుండు ♦ ద్రుపదతనూజాతి
శినివరులం దాకి ♦ చికుకవఱచె

తే. గీ. శరవితతి భానుబింబంబు ♦ మఱుఁగు వడియె
భండనరబలిదారుణ ♦ భంగి నొప్పె
గొంతివడికి వాసవి నెదు ♦ రొక్కసదలంచి
యస్త్రగురుతనయుం డిట్టు ♦ లనియె నిల్చి.

పూర్వకళ్యాణ - త్రిశ్రగతి

ప॥ బీరమున్న నయ్యెడ నిలు - మోరి రాచవాడా ॥బీ॥
అ॥ ప॥ పోరుమా నాతోడ నేను - పేరందిన విలుకాడా ॥బీ॥

చ ర ణ ము

అయ్యవారిగూడ కల్ల - లాడి గూల్చినాడవా
కయ్యమాడుద్రోణ తనయు - గనులువిప్పి చూడవా ॥బీ॥

చ. అని శరవృష్టిముంచె దను ♦ జారిని బార్థుని ద్రోణి, దాన న
య్యనిమిషరాజసూతి చటు ♦ లాంబకము ల్గురుపుత్త్రుపైన నిం
చిన బొడిజేసివాని బృథి ♦ వీసుఁడు దుబ్బగ, గ్రీడి ద్రోణనం
దను విరథుం బొనర్చి రణ ♦ ధారుణినుండి తొలంగఁజేసినన్

తే. గీ. ధర్మనందనుండు తన్నురా ♦ ధాసుతుండు
తలచెడిపోట్లఁగ శిబిరమ్ము ♦ దారిపట్టె

హారియట, సూతనందనున ♦ కాహవమం దిటులోడివచ్చితీ
వరయవా లోకులెల్ల పరి ♦ హాసమొనర్తురటంచు గొంచెముల్?

మ. మునుముం దేనును భీముడున్ సుతులమై ♦ పుట్టంగ, పైమాత్రగా
వనకాంతాకుతారమై నిలిచెగ ♦ ర్భం బేల మాయమ్మ కం
తనె విచ్ఛిన్నముగాక యీడుదిగనై ♦ నన్ బుట్టగాబోక యే
మనిజన్మించె నపుంసకుం డితడు? క ♦ ర్మాధీనుడై పుట్టెబో!
మొనగానింబలె బట్టనేటికనిశం ♦ బున్ జేత గాండీవమున్?

క. కరమున ధరియించుటచే
వమణాగ్ని లొసంగు గాండి ♦ వం పుంబరువున్.
దురమున సారథియగుటన్
హరిమర్యాదయు నశించె ♦ నారా! తుదకున్.

వ. అని పలుక ధర్మజుంగని వాసుదేవుం డిట్లనియె.

శ్రీరంజని – రూపకము

ప॥ కోపమేటికింగని నీకీ – కోపమేల తమ్మునిపై
అ॥ప॥ నీపడినపరాభవమున – నీవిటు లాడితివిగాక ॥కో॥

చ ర ణ ము

తలచినకార్యము సాధ్యమె – తత్క్షణమ్మ నెఱవేర్పగ ॥కో॥
తలపవలదె పరులకష్ట – ములు నైతెమును ప్రాజ్ఞుడవై ॥కో॥

చ. తలచుగ దాకుచుండు మము ♦ దగ్గడినిజింపిన కోపతీవ్రత
న్గురుసుతు, డా త్రిగర్తరథి ♦ కుల్ బయిపచ్చు టెటుంగుదేకదా?
యరయగ సూతసూతి బహు ♦ శాస్త్రధురంధరు, డట్టుగాన
పిరివిడువంగ దీరిక ల ♦ భింపని మ మ్మిటులాడ బాడియే

వ. అని పలుక గోపాలువచనంబులు బాటింపక

ఉ. చంపగ లేడితం డతడు ♦ చావడు కేమిటికోరుదు నీసమ
ర్థింపులు? నేటితాకమున ♦ దే నభిమన్యు ఘటోత్కచుల్ కటా!
తెంపునకయ్యువారై తృణ ♦ పన్ని భుసీతని జేసి? నన్నుగా
ర్షింపగలారెసూతసుతు ♦ డేరినతంబనిలేదు మాధవా!

ఉ. అమ్ముల విద్య నేర్పిన మ ♦ హామహు ద్రోణుని కీర్తి సైతము
న్నమ్మొనరించె, గాండివ మ ♦ శక్యము నీకిడి తా రథ మ్మునా
యమ్ముగ దోలు నేని తెగ ♦ టార్పుదు నేకద కర్ణు, కృష్ణ! క
య్యమ్మున కట్లు నీవు గల ♦ వాచుగదా ధృతిబూని వచ్చితిన్?

వ. అనిన న్విని కనలి విజయుండు వాలు బెఱికి గోవిందుం గని,

చ. ఎవడు శరాసనం బొరులు ♦ కిమ్మను వాని శిరమ్ము గూల్ప ని
శ్చయముగ జేసితిం బ్రతిన ♦ కోపము ద్రింగితి నింతదనక - పే
లవముగ నెన్నిదిట్టిన ది ♦ రమ్మగు తాలిమిబూని, ధర్మ సం
భవుడగుగాక నాకిపు డ ♦ వశ్యము చంపక తీర దీతనిన్.

వ. అనుచు ధర్మజుమీది కుఱుకబోవు ధనంజయుని వారించి వాసు
దేవుం డిట్లనియె.

తోడి - త్రిపుట

ప॥ చాలునిక శాంతింపు మర్జున - చనదు నీకిది పాపవర్జన ॥చా॥

అ॥ప॥ వాలు దూసెద వితడు కర్ణుడె - ప్రభుడు పితృసము డగ్రజన్ముడె॥

చరణము

అరిపరాభవఖిన్నుడై ని - న్నన్నయువి పాటింపదగునే
దొరికెరే నీకన్న దమ్ములు - తుదకు బ్రతినలు దీర్చుకొనగా ॥చా॥

మ. సకలజ్ఞు ల్వచియింపగా వినవొ? హింసాపూర్వకంబౌ ప్రతి
జ్ఞకు భంగమ్ము ఘటింప దెన్నడటులం ♦ గావింపకున్నన్, మహా
త్మకులన్ దూఱుటయు న్వధించుటయుగున్ ♦ మారాడ కీధర్మపు
త్రకు నిందింపు ముఖ్ఖు నేడు నీ ప్రతినదీ ♦ అన్ దరుక నీయన్నయున్.

వ. అనవిని క్రీడియు ధర్మపుత్రు వీక్షించి,

ఉ. ఆయుధపాణులై బవర ♦ మ్ముం దరివీరుల నొంచు భీమమా
ద్రేయుల కొక్కవేళ నను ♦ దిట్టగ జెల్లిన జెల్లుగాక రా
ధేయుని కోడి దృష్టి మరల్చి ♦ తిన్ శిబిరమ్మున నాడ్డుతా యా
ట్లీమొడ పాఱిపోతవగు ♦ నీవును నన్నిటులాడ జెల్లునే?

గీ త మా లి క

సుబలతనయునితో నట్లు ♦ జూదమాడి
ధార్తరాష్ట్రులతో విరో - ధమ్ము, రాజ్య
నాశనమ్ము, మహారణ్య - వాస దాస్య
దైన్యము లెచ్చిపెట్టి యుం - తయును సిగ్గు
పడ; వయోనిజయైన ద్రో - వది కొలువున
బన్నమందుట, వేల్పుట - న్వారు బతియగు
కుంతి పగవారికొంపల - గుడుచుటయును
నిరుపమాన మహాధను - ర్నిగమ వేది
భరత కులదీపకుడు గుణా - కరుడు వేలి
కెదిగివచ్చిన ప్రదిపదా - తేడ్లకొడుకు
నేలపాలౌట యిన్ని నీ - మూలముననె
మూడె నని సేయజాలని - వాడ నిట్లు
త్తాల్మిగని యుండ కేల్రపల్ల - దములువలుక
నేల? ఈ మన్నెము చేసితి - వింకనైన
చెడుగు పోకడలుడిగి సూ - చెప్పినట్లు
మెదలుకొనదగు నోకమూల - నొదిగియుండి.

వ. ఇట్లు ధర్మరాజు ధూలనాడి కొంతవడికి పశ్చాత్తాపమంది కటకటం బడుచు వాసుదేవున కిట్లనియె.

శా. రాధానందనుగూల్పనైతి, వరధ ♦ ర్మాధర్మ నిష్ణాతు నీ
యోధాగ్రేసరు ధర్మజాతునిటు లే ♦ మోవ్రేలి ఘోరాఘపా
థోధింగూలితి నెంతయున్నగతికిన్ ♦ దూరుండనైతిన్ జగ
న్నాథా! నాశిరము త్తరించుకొనెదం ♦ దత్పాప నిర్ముక్తికై.

మ ం జ రు లు

అనినన్విని వసుదేవతనూజుం - డను పార్థా! యిదియేమి?
కొనకాత్మహత్య జేసికొనగ నీ - కు మతిపోకునాయేమి? ఓ
[illegible] గర్జుగెల్వజాలు కీ - కరణి యూహించినావా ధ
నికి [illegible] - డవధరించవు గావాడ [illegible]

వ. అనవిని కిరీటియు,

సీ. రాజసూయమహాధ్వ ♦ రమ్ము సేయించితి
నితనిచే రాజుల ♦ నెల్ల గెలిచి
ఖాండవారణ్యంబు ♦ గాల్పించితిని హవ్య
వహుచే మహేంద్రుని ♦ బ్రతిఘటించి
యుష్ణీషముల దెచ్చి ♦ యుత్తర కొసగితి
ద్రోణభీష్మాదియో ♦ ధులజయించి
ముజ్జగమ్ములను స ♦ మ్మోదింప జేసితి
గాలకేయాదిరా ♦ క్షసులగూల్చి

తే. గీ. చించిచెండాడినాడ గిం ♦ చిదవశిష్ట
ముగ ద్రిగర్తుల నీరణ ♦ మ్మున నెపచ్చి,
వెఱువ నొక్కరుంతయుం బుర ♦ హరునకేని
వెఱతునే సూతజునకు గో ♦ విందా! నేడు.

వ. అని పలికిన నందాపమి గని వాసుదేవుండును.

మ. అన్నిల్లో గర్ణుని గెల్తువో గెలువవో ♦ యామాట యట్లుండనీ
నిను నీవే నుతియించుకొంటి నిది ని ♦ ల్నే చంపుకొన్నట్టు లౌ
ననుమానింపకు మగ్రజాజ్ఞగొని తె ♦ మ్మా వేగమే సంగరా
వనికిం బోదము భీమసేనున కటన్ ♦ భారంబగున్ ఫల్గునా!

వ. అనిన సవ్యసాచియుం బ్రదాను ధర్మజు నొవ్వనాడినందులకు గటకటం బడుచు నన్నకుం బ్రణమిల్లి నొవ్వనాడినందులకు క్షమించి కర్ణుం జంప సెలవీయవే యనిన ధర్మజుం డిట్లనియె.

చ. కలిగిన సిల్గులన్నిటికి ♦ గారణ మేనని యెంతువే వనం
బులకొ తపమ్మొనర్చుకొన ♦ బోదు సుఖమ్మనుముండు డెల్లరుం
గలసజయమ్ము గాంచెదవొ ♦ కర్ణుని గూల్చి క్షితి సంగరావనిం
దొలగెదొ? వానిచే మడియు ♦ దో? కురునాథు సమాశ్రయింతువో?

వ. అని పలికి శయ్య డిగ్గి మహారణ్య గమనోన్ముఖుం డగు ధర్మరాజు మాధవుండు వారించి ప్రసన్నుం జేయ నతండును కృష్ణార్జునుల నాశీర్వదించి యనుప వారలు నరదం బెక్కి యుద్ధావనికిం జనిరి.

శ్రీ

# మహాభారతము

## కర్ణవధ

కల్యాణి - ఆది

ప॥ వినుడీ కర్ణవధ వినిపించెద - ననఘులార వివరమ్ముగా నేడు ॥వి॥

అ॥ప॥ అనుపమానదివ్యాస్త్రసంపన్ను - డాభృగురామునిశిష్యుఁడు కర్ణుడు॥

చరణము

యమతనయుని సెలవందివేగకృ-ష్ణార్జును లాహవరంగమునకు సని
సమరమొనరించు భీమసేనునకు-సాయమైరి భూభారమడంగఁగ॥వి॥

సీ. హరిమేనికాంతి వా ♦ నరకేతనప్రభ
లగ్గవ్వడిరాక దె ♦ ల్పగ బకారి
హర్షించి శత్రుసం ♦ హారమ్మొనర్చుచు
సౌబలుందాకి మూ ♦ర్ఛవడజేసి
సైనికులం గూడి ♦ చయ్యన రాధేయు
దాకి గర్జుండు నం ♦ దఱకు సన్ని
రూపులై తనరి శ ♦ త్రువుల నొంచుట గాంచి
దివిజేంద్రతనయుఁ డా ♦ దిక్కు గవిసి

తే. గీ. ద్రోణతనయాదుల న్వీర ♦ ఘులనొనర్చి
కురుకుమారుల బదుగురం ♦ గూలనేసి
యంగరాజు నెదుర్కొనె ♦ నంతలోన
దుస్ససేనుండు వాయుపు ♦ త్రుని దలపడె.

చ. సమరమువూని తాముభయ ♦ సైనికులు న్వెఱగంది చూడ ను
గ్రముగ బెనంగుచో బ్రళయ ♦ కాలునిలీల గదన్ధరించి రో
సమున సుయోధనానుజుని ♦ చయ్యన నేసె బకాంతకుండు బీ
రముసెడి నేలగూలె రుధి ♦ రమ్మును గ్రక్కుచు దుస్ససేనుడున్.

వ. అట్లు నేలంగూలిన దుశ్శాసనునంగదిసి మెడద్రొక్కి భీముండిట్లనియె.

అఠాణా - ఖండగతి

ప॥ చిక్కితివి రోరినా చేతికిన్నాళ్ళకిదె
చెల్లించుకొందు ప్రతిన కౌరవకులపాంసన ॥చి॥

అ॥ ప॥ యెక్కడికిబోయె దీవెవ్వాడు దిక్కునీ
కీభీమసేనుడే నీపాలి యముడురా ॥చిక్కి॥

చరణము

కడిమిసెడి అగ్రజా - జ్ఞాపాశముల చేత
కట్టువడి యున్నాడరా - బోనువడిన సింగమువలె ॥కడి॥
చెడుగ నీపనిదీర్ప చేకూరె - సమయమ్ము
కడముట్టదీర్తు నీ - కండకావర మెల్ల ॥చిక్కి॥

సీ. నడురేయి కాశికా ♦ నగరమ్మునన్ లక్క
యిల్లు గాల్పించిన ♦ ట్లిపుడు లేదె
నిద్రితుం ద్రాటబం ♦ ధించి యగాధంపు
టేట ద్రోయించిన ♦ ట్లిపుడు లేదె
నమ్మించి యట్టుల ♦ న్నమున విసమ్ము గ
ల్పించి పెట్టించిన ♦ ట్లిపుడు లేదె
సతి నేకవస్త్రను ♦ సభకు ముందలపట్టి
యీడిచి తెచ్చిన ♦ ట్లిపుడు లేదె

గీ. అన్న గాచునో? సౌబలు - డడ్డపడునొ?
కర్ణుడేవచ్చి తప్పింప ♦ గలడొ? నేఁడి
పిలువు మొకపరి గొంతెత్తి ♦ పిలుకుమార్తు
నుండగాపచ్చు మీసల్వు ♦ రొక్కచోట.

వ. అని పలికి.

సీ. ఆవేశమున బొంగు ♦ చున్ కఠారము దూసి
జళిపించి విపులవ ♦ క్షమ్ము జీరి
యుబికిన శోణితం ♦ బొగి దోయిటం గొని
ప్రతిన లోదలచి యేవమ్ము గొనక
తల్లి చన్బాల చం ♦ దమున దేనియవోలె
చవికి మెచ్చుచు సంత ♦ సమున ద్రావి
మొగమున నెల్ల ♦ మొగి జల్లికొని భయం
కరమూర్తి నరసింహు ♦ కరణి నొప్పి

తే. గీ. గెడపి దుశ్శాసనుం బిట్టు ♦ కేకలిడుచు
నాడుచుం ద్రుళ్ళుచు భుజమ్ము ♦ లప్పళించి
గొఱియలంబలె గురుసేన ♦ దఱిమితఱిమి
యొక్కచో నిల్చి పల్కెన ♦ త్యుగ్రలీల.

శా. రండీ! మూతుల మీసముల్ గలుగు శూ ♦ రమ్మన్యులీసేన ను
ద్దండు ల్లావుగలట్టి యోధులు బలో ♦ ద్దర్పమ్మున న్నన్నెదు
ర్కొండీ పాఱగనేటి కీకరణి పా ♦ ఱుంబోతులై, సంతతా
ఖండోత్తుంగ బలాతిధీరత మిమున్ ♦ గాఱింపకే పోదు నే?

తే. గీ. అనిన రోషించి కవచిషం ♦ డాదికురుకు
మారదశకమ్ము దాకన ♦ మీర తనయు,
భల్లదశకమ్మునన్ మహా ♦ బలసుతుండు
ధారుణిన్ ద్రొల్లనేసెన ♦ వ్వారితలలు.

వ. అట్టియెడ కర్ణాది కౌరవసైనికు లెల్లరును సమరవిముఖులై వెలవెల
బాఱియుండ శల్యుండు రాధేయున కిట్లనియె.

భైరవి - ఆది.

ప॥ తెల్లవోయి చూచెద వేటికి నీ - వల్లగాక నా? సూతనందనా ॥తె॥
అ॥ ప॥ యిల్లుదూఱియుండక వీరుడనని పొల్లుబీరమ్ము-లాడిరణమ్మున ॥

చ ర ణ ము

నమ్మికొన్నాడు కురునాధుడు పాం - డవులేవుర దెగటార్తు వీవనుచు
సొమ్ముదిన్నవిశ్వాసము జూపుము - శూరాగ్రణివై నీవిటులూరక ॥ తె॥

తే. గీ. అనిన సమరోన్ముఖుండయ్యె ♦ నంగనృపతి
యంతలో వృషసేను డ ♦ య్యనిలతనయు
పైనుఱవడింప గోపించి ♦ ఫల్గునుండు
వాని మస్తకమున్ ద్రుంచె ♦ బటుశరమున.

మ. తనయుం గూల్చుట సూచి కర్ణుడును క్రో♦ధస్ఫూర్తియై యింద్రనం
దను నుద్వేగమిూఱ దాకి నిఖిలా ♦ స్త్రప్రాభవం బేర్పడం
బెనగం గ్రీడియు వాడితూపులగమిం ♦ బెల్లేసి రాధాతనూ
జుని నొప్పించి యొకంత కిట్టులనియెన్ ♦ శూరత్వ మేపారగన్.

ఉ. బాలకుచేతివి ల్వెనుక ♦ పాటున ద్రుంచి వధింపజేసి తీ
వాలమునం దధర్మముగ ♦ నందులకీ వృషసేనుమూర్ధము
న్నేలకు ద్రొల్లనేసితిని ♦ నీవాగి సూడ ప్రతిజ్ఞ దీర్చుకో
జాలితి నాకికన్ మిగిలె ♦ సంగరమందు నిను న్వధించుటల్.

క. అనిపల్కి ఖచరతండము
తనువినుతింపగ సురేంద్ర ♦ తనయుడు రాధే
యుని దాకునంత ద్రోణా
యని దుర్యోధనుని చెంత ♦ కరిగి యనెనిటుల్.

మోహన - ఆది

ప॥ నరనారాయణు లాకృష్ణార్జును - లరయు
మెందే నవధ్యు లజేయులు ॥నర॥

అ॥ ప॥ గురుభీష్మాదుల - కన్న నధికుడే
పరికింపుము నీనమ్మిన కర్ణుడు ॥నర॥

చ ర ణ ము

సమ్మతింపు మిపుడేని సుయోధన - సంధి గావింతు కురుపాండవులకు
కమ్మగా ననుభవింపు డెరి భా-గమ్ము లవ్వారు పోరాట ముడిగి॥నర॥

చ. నిలుపుము కర్ణునిఁ విజయు ♦ నిల్పుగ, శౌరియు ధర్మజుండు నా
పలుకులు విశ్వసింతురు, క ♦ వల్బక నైరియు ధర్మజాజ్ఞలో
మెలగుదు, రిట్లు మాన్యము స ♦ మీకము, దాన సమ స్తభూజను
ల్గలహామునకిఁ శ్రేయములు ♦ గాంతురు, నీజనకుండు ప్రీతుఁడౌ.

చ. అరయకుమీ యవధ్యుల మ ♦ టంచు గృపు న్నను నాధనంజయు
న్దురమున గూల్ప నేర్తుమని, ♦ ద్రోణుడు భీష్ము డవధ్యు లేగదా!
హరికరుణాకటాక్షమున ♦ నా రధికు ల్నరుచే నడంగరే?
కర మడిబీరపుందులువ ♦ కర్ణుడు గూల్పగలాడె కవ్వడిన్?

ఉ. మాధవు డట్లురా వెడగు ♦ మాటల్లు పల్కితి మింకసంధి యే
మాదిరియౌ నటన్న యను ♦ మానము వీడగదోయి! మించిపో
లే దిపుడేని యూకొనుము ♦ లెస్సయగున్ బ్రతుకంగ నేర్తు రెం
తేధృతి చీకుటాల్మగలు ♦ నీతలిదండ్రులు కౌరవేశ్వరా!

వ. అనవిని దుర్యోధనుం డిట్లనియె.

చ. అనుజులు చుట్టముల్గొడుకు ♦ లందఱు జచ్చినవెనఁ యేమొగం
బున పగవారితో నిపుడు ♦ పొందొనగూరుచుకొందు? నవ్వదే
నను జగమెల్ల కర్ణుని ధ ♦ నంజయు డొంచు రణంబునందటం
చనెదవు సింగమోటువడు ♦ నా యెపుడేనియు నక్కకూనకున్?

వ. అనిపల్కి సైనికులం బురికొల్పి సమరోన్ముఖుండయ్యె నయ్యెడ కర్ణార్జునుల దంద్వయుద్ధం బవలోకింప సుర పితృ విద్యాధర సంఘంబులును శచీపతిప్రముఖ దిక్పాలకులును నభోభాగమ్మున నిలిచియుండ నయ్యతిరథు లిద్దఱుం దాకి పోరుచో గవ్వడి యేసిన బాణమ్ము లన్నియుం గర్ణుండు వారించుచు దివ్యాస్త్రములన్నిటి నుపసంహరించుచు గృష్ణార్జునులం జికాకుపరచుచున్నంత గనలి కమలాక్షుండు కౌంతేయున కిట్లనియె.

కాఫీ – ఆది

ప॥ ఏమిటింతపార్థా దివ్యాస్త్రము-లెల్లరాధేయుచే వమ్మొచనె ॥ఏమి॥
అ॥ప॥ నీమనంబిచట లేదో, భయమందితివో?బడలితివో?యుపేక్షింతు॥

చరణము

కావలసిన చక్రమ్మునీకిడును-కంఠమిూత్ఘణమ్మున దునుమాడును॥
దేవదానవుల గెల్చిననీకుం - దృణసముండుగాడా యీకర్ణుం ॥దే॥

మ. అనరోషించి కిరీటి కర్ణుఁపయి బ్ర ♦ హ్మాస్త్రప్రయోగ మ్మొన
ర్చిన గర్ణుండు తదస్త్రముం జెఱచి వా ♦ ర్వొంద్రుంచి, నొప్పించె గృ
ష్ణుని, వివ్వచ్చుఁడు నారిఁగూర్చుకొని య ♦ చ్చో శల్యరాధేయులం
దనువు ల్గాడఁగ నేసె బాణవితతిం ♦ దన్నెల్ల రగ్గింపగన్.

సీ. అశ్వసేనసమాఖ్య ♦ డగు నాగపుత్రుండు
నాగముఖాస్త్రంబు ♦ నాతదనదు
చెంగటనుండఁ బ ♦ సిండి యొఱం బెట్టి
యనుదినమ్మును దాని ♦ నర్చసేయు
చుండు గర్ణుండు, పా ♦ ర్థుండు నూపెడు థాటి
కాగలే కంగేసు ♦ డా శరమ్ము
వడి వింటసంధించి ♦ కడకంటికి న్గుఱి
వెట్ట శల్యుం డంగ ♦ విభున కపుడు

తే. గీ. చిత్తవైకల్యముం గల్గ ♦ జేయఁదలచి
"సూటిచెడె, నేమిసంధాన ♦ పాటవమ్ము?
సరిగ సంధింపు"మన గోష ♦ సంభ్రమమున
సూతసుతు డంత మద్రభూ ♦ నేత కనియె.

చ. అనవసర ప్రసంగము ర ♦ వంతయు సేయక తేరుదోలు, మీా
వునుననుబోటిజోదునకు ♦ బోరున వంకలుపెట్టు వాడవే?
విను మినుమాఱు బాణమును ♦ వింటను గూర్పడు కర్ణుడెన్నడున్
జనములునవ్వగా, తెలియ ♦ జాల వొకింతయు మద్రభావమున్.

వ. అని పల్కి భుజగాస్త్రం బేసిన

తే. గీ. నష్టదెసల మంటలెగయ బ. ♦ న్నగశరమ్ము
రా, మురారియు పంచాంగు ♦ ళప్రమాణ
మరద ముర్వీస్థలిం గ్రుంగ ♦ నదుము నంత
పార్థుని కిరీటము హరించె ♦ బాపతూపు.

వ॰ అంత జంభాతకసూతి శిఖరరహితంబగు నీలగిరి చెల్వున నొప్పి తెల్లనిపాగంజుట్టి క్రమ్మఱం దనపై గవియు సర్పంబు నాఱు బాణమ్ముల దునిమి కోపతీవ్రంబుగ కర్ణుందాకి చండకాండముల నొవ్వ నేయుచు కంకటమ్ముసించి మకుటకుండలమ్ములు డులిచి పెద్దపెట్టున పోరాడుచు దివ్యాస్త్రమ్ము లుపసంహరించుచున్నంత రాధేయుండు భార్గవాస్త్రంబు ప్రతిభాసింపక చిత్తవైకల్యంబాది కుందుచో భూసురశాపమ్మున నాతని యరదంపు డాపటికల్లు క్రుంగిన నేటున కనువుసెట గర్ణుండు రోషవిషాదమ్ముల గన్నీరొలుక రథమ్ముడిగ్గి కవ్వడి కిట్లనియె.

ధన్యాసి - రూపకము

ప॥ ఆగుమా మహారథకాల - మర్జున నారథము క్రుంగె ॥వా॥

అ॥ ప॥ రాగధర్మ్మడ వాకించుక - రథచక్రము నెత్తుకొందు ॥వా॥

చ ర ణ ము

వీతరథునితో బోరుట - నీతిగాదు నినుబోటికి। పూతాన్వయ సంజాతుడ - వాతతరణధర్మ్మవిదుడ ॥వా॥

క॰ విరిదలవాని నిరాయుధు
విరథుని నీబోటి ప్రబల ♦ వీరు లెచుఁరొక్కం
దురె ? యేమయిన, నాపలుకుట
హరికిన్ మఱి నీకు వెఱచి ♦ యని దలపకుమా.

వ॰ అన విని కృష్ణుం డిట్లనియె.

చ॰ చదివిన ధర్మ్మశాస్త్రముల ♦ సారము నేటికెఱుంగవచ్చె నే ?
మదమున గర్వము న్దురభి ♦ మానము నేమయిపోయె ? నీతికో
విదుడు బిడౌజసూతి యొక ♦ వేళ నినుంగరుణించుగాక, చూ
పదుగద మృత్యుదేవతయు ♦ వశ్యము నీపయిప్రేమ కర్ణుడా !

ఉ॰ వంచకులై యమాయకుల ♦ బాండుకుమారుల లక్కయింట గా
ల్పించుటధర్మ్మమా ? సభకు ♦ నీడిచి ద్రోవది కట్టుచీర లా

ల్పించుటధర్మమా? విరథు ♦ నెల్లరు దాకి కిరీటిపుత్రు గూ
ల్పించుటధర్మమా? తగవు ♦ లెన్నెద వియ్యెడ సూతనందనా!

వ. అనిపలుక కర్ణుండు లజ్జించుచు నరదంబు పిఱిందికొమ్ము క్రిందికి భుజమ్మునొడ్డి యెత్తినం బుడమి కులశైలకాననసముద్రసహితం బారంగుళములెగసె గాని రథచక్రంబులు కదలకుంటం జూచి రాధేయుం డిట్లు నిర్వేదపడె.

గీతమాలిక

అకట! కాల మాసన్న - మైనయట్లు
దోచు నాకింక దైవమా! - తుదకు నన్ను
పౌరుషవిహీనునటు జావ - వ్రాసినావె?
చినతనంబున లక్ష్యవే - ధనపు విద్య
నభ్యసించుచు జన్నపు - టావు జంపి
నట్టి సాధుహింసాఫలం - బనపహార్య
మగుచు కుత్తుకపై గత్తి - యైనటించె,
పుండు వ్రేల్పెట్టి కలగించు - పోలికయయ్యె
శల్యసారథ్య, మాశచీ - జాని కవచ
కుండలమ్ములు గొనిచనె, - గురుడు భార్గ
వాస్త్రము స్ఫురింపకుండ న - న్నలు శపించె,
మడియుచున్నాడ కొనకిట్లు - మానవప్ర
యత్నమునగాక దుర్విధి - ప్రాతికూల్య
మున రణావని నాసురయో - ధనునికొఱకు;
కన్నతల్లికి భారమై - గంగగలసి
గండముందప్పి వర్ణ[illegible] - కరత గాంచి
సోదరుల బాధపఱచు నీ - చునకు, కడగి
యన్నదమ్ముల కట్లు క - య్యములువెట్టి
పార్థు దెగటార్తునని ప్రగ - ల్భములు వలిక
తమ్మిపూవుల కొలను చం - దమున నలరు

కురుకులం బెల్ల మాయించు - క్రూరకర్ము
సకు, దురాత్మునకు, న్నాకు - నలువుర నగు
బాటుగా నెట్లు విజయమ్ము - బడయనగును?
మిగుల నల్లాడు చీకుటా - ల్మగల యుసురు
దగుల నెట్లుండును? సాధ్వి మ - తల్లి ద్రుపద
రాజసుతకు గల్పించు ప - రాభవాగ్ని
నను దహింపక చల్లారు - నా తనంత?
పెంచి పెద్దగజేసి నా - మంచిచెడ్డ
లరసి మోదించు రాధకు, - నంగరాజ్య
మొసగి మన్నించినట్టి దు - ర్యోధనునకు
ప్రియముగా సంచరించి జీ - వితము ధార
బోసితిని; దానకర్ణు డన్ - వాసి గంటి;
నిర్విచారమ్ముగా మర - ణింతు నింక.

వ. అనితలంచి గాండీవనిర్ముక్త శరపరంపరకు మేనొగ్గుచు శల్యుంగని యరదంబునంగల గదాదండం బిమ్మన నమ్మద్రేశ్వరుం డెకసక్కె ముగ నిట్లనియె.

శంకరాభరణము - రూపకము

ప॥ సిగ్గువిడి గదాదండము - చేకొని పోరాడెదవా ॥సి॥
అ॥ ప॥ బిగ్గఱగా పలుకకు మిక - భీముం డిది వినునేమో ॥సి॥

చ ర ణ ము

శ్రమపడి నీనేర్చుకొన్న - శరవిద్యయె యిట్టులుండ
సమరమున గదం బట్టుట - సరిసరి! నగుబాటుగాదె ॥సి॥

క. గుఱిచెడియెం గాకోదర
శరమని చెప్పినను వినవు ♦ సమరమున నికే
కరణి న్విజయుని గూల్చెద?
వరయుము, గదబట్టుటింక ♦ హాస్యాస్పదమా.

వ. అనవిని కర్ణుండు కటకటంబడుచు శల్యున కిట్లనియె.

తే. గీ. మణియుని తలంచి చేసగ్ని ♦ కణము దాల్చు
నాకు దగుశాస్తి జేయుచు ♦ న్నాడ వీవు
వికటముగ బల్కుచున్, వ్యాధి ♦ పీడితునకు
పెదవి విఱిచిన వైద్యుని ♦ విధము దోప॥

క. అనిపల్కుచు గదకేలం
గొనె కర్ణుం డంతలోన ♦ కురువిభు డంపం
జని ద్రోణతనూజాతుం
డనియెన్ రాధేయుతోడ ♦ నాటోపమునన్.

బాగు - ఖండగతి

ప॥ విశ్రాంతిగొనుము కురు - విభు డంప వచ్చితిని
వెఱవ నేమిటి కింక - విజయునకు రాధేయ ॥వి॥

అ॥ ప॥ అశ్రమంబున మాధ - వార్జునుల బడగూల్తు
నస్త్రవిద్యాపాట - వము సూపి నిన్గాతు ॥వి॥

చరణము

సావకాశముగ రథ - చక్రముల నెత్తుకొని
సమరమొనరుప రమ్ము - సగర వీరాగ్రణీ!
భూవిభుడు నీమీద - భార మంతయు మోపి
భూమీవలయమెల్ల - నేలగా నున్నాడు ॥వి॥

ఉ. ఎక్కటిపోరు పోరుటయె ♦ యియ్యెడ నీ తలపోట నూర కే
నొక్కెడ జూచుచుంటిని, సు ♦ యోధనుపిల్పున వచ్చినాడ నీ
యక్కఱదీర్ప, నింకజను ♦ మయ్యెడ నించుక విశ్రమింపుమా
పెక్కులు వల్కనేమిటికి ♦ పీచమడంచెద పార్థ కృష్ణులన్.

వ. అనిన గర్ణుండు,

ఉ. ఏలితి నీ ధరావలయు ♦ మెల్ల సుయోధను పేరిమీద, నీ
జాలితి యాచకప్రతతి ♦ సమ్ముదమందగ వాంఛితమ్ములన్,
వ్రాలితి సంగరావని న ♦ భంగుర వీరరసైకమూర్తినై
కూలుదుగాక సాయపడ ♦ గోరుదునే యిక బాపనయ్యలన్?

చ. అనవిని ద్రౌణియుం జనియె ♦ నంగవిభుండు గదాఘనుండునై
కినుకదలిర్ప గా విజయ ♦ కృష్ణుల గూల్పదలంచి యెంతయుం
బెనగదొడంగె నర్జునుండు ♦ వేగ మహాస్త్ర మొకండుదండిమై
ధనువున గూర్చి వాకొనియె ♦ తామరసాక్షుని ప్రేరణంబునన్.

మోహన - ఖండగతి

ప॥ ఈమహాదివ్యాస్త్ర - మిపుడ రాధేయు శిర
మిల డొల్లగా జేయు - నేవీరుడనయేని ॥యీ॥

అ॥ ప॥ కామాది విషయవాంఛా - రహితుడనయేని
సోమశేఖర పాద - సేవా రతుడనేని ॥యీ॥

చ ర ణ ము

మాతల్లి కుంతి సా - ధ్వీతిలక మగునేని
మాయన్న ధర్మజుడు - సత్యవ్రతుండేని
నాతమ్ము లనవరత - నుత నీతియుతులేని
నారాయణుండె యీ - నాకు సారథియేని ॥యీ॥

వ. అనిపల్కి యయ్యస్త్రమ్ము విడిచిన.

తే. గీ. రోదసీకుహరమ్ము మె ♦ ఱుంగులగమి
నించి సైనికుల న్మూర్ఛ ♦ ముంచి సర్వ
భూతకంపన మొనరించి ♦ సూతసూతి
శిరము తెగిపడ ద్రుంచె నా ♦ శరవరంబు.

ఉ. అంతట కన్నువిచ్చిజను ♦ లందఱు సూడగ దివ్యతేజ మ
ల్లంతనె యుద్భుతమ్ముగ ది ♦ నాధపబింబమునందుసొచ్చె, న
త్యంతవిషాదభారమున ♦ నాత్మజు డట్లు గతించెనంచు భా
స్వంతుడు తత్క్షణంబ సనె ♦ పశ్చిమవార్నిధి దానమాడగన్.

సీ. జన్నింపు టావును ♦ జంపినందుల కల్గి
విప్రోత్తముండు శ ♦ పింపడేని
జమదగ్నిసూతి క ♦ య్యమిన నస్త్రములు స్ఫు
రింపబోవంచు శా ♦ సింపడేని

కవచకుండలములం ♦ గైకొన బాపఁడై
జేజేలఱేఁడు యా ♦ చింపఁడేని
మిన్నేటికొడు కట్లు ♦ తన్నర్థరథుఁ జేసి
బవరమం దవమాన ♦ పఱపఁడేని

తే. గీ. యాత్మజుల బ్రోవుమని కుంతి ♦ యడుగదేని
చిత్తవిస్ఫూర్తి శల్యుండు ♦ చెఱుపఁడేని
కేశవుం డక్రమంబు ♦ సాగింపఁడేని
కర్ణుని వధింపజాలు వి ♦ లుకాఁడు లేఁడు.

వ. అట్లు కర్ణుండువడఁ గాఁడ బాసిన కమలమ్ముకరణినున్న యరదమ్ముం దోలుకొని శల్యుండు దుర్యోధనునికడకుం జనన కౌరవేంద్రుండును దీనాననుండై కర్ణవధ సంజనిత దుఃఖావేశమ్మున నిట్లు వాపోవ దొడంగె.

నీలాంబరి - రూపకము

ప॥ నమ్మికొన్న కర్ణుఁడువడె - నాకికేటి బ్రతుకు ॥న॥
అ॥ ప॥ బమ్మవ్రాత దప్పింపఁగ - వశమె మానవులకు ॥నము॥

చరణము

పాండుతనయు లేవు రట్లు - బ్రతికియుండిరా
భండనమున నాతమ్ములు - ప్రాణ మెడసిరా ॥నమ్మి॥

తే. గీ. మనసుగలసిన మేటి సా ♦ మంతరాజు,
మంచిచెడ్డ నెఱింగించు ♦ మంత్రి, సంగ
డీఁడు, వెన్నంటి తిరుగాడు ♦ తోడునీడ
వాఁడిగలజోదు కర్ణుండు ♦ నేఁడు లేఁడు.

వ. అని విచారించు కురుపతికి శల్యకృపాశ్వత్థామలు ధైర్యమ్ము సెప్పుచున్నంత సంధ్యాకాలం బగుడు బోరుసాలించి కృష్ణార్జునులు పాంచజన్య దేవదత్తములు పూరించుచు శిబిరమ్ములకుం జనిరి.

శ్రీ

# మ హా భా ర త ము

## సా మ్రా జ్య సి ద్ధి

ఆనందభైరవి - రూపకము.

ప॥ పాండవ సామ్రాజ్యసిద్ధి - భవ్యచరిత మాలింపుడు ॥పాం॥

అ॥ప॥ పుండరీకనయనుని కృప - బొంది విజయముం గాంచుడు ॥పాం॥

చ ర ణ ము

కానీనుడు పడినయంత - గౌరవపతి కయ్యమ్మున
సేనాధిపతిత్వమునకు - జేసెను శల్యు నభిషిక్తు ॥పాం॥

సీ. శల్యుండు కౌరవ ♦ సైనికులం బురి
కొల్పి పెక్కురఁ నాజి ♦ గూల్చి కడకు
పాండవాగ్రజు దాకి ♦ ప్రాణము ల్గోల్పోయె
కురుసేన యంతయుం ♦ గూలె కలన;
కురునాథు డటభీతి ♦ గొని గదా కలిత మ
హా భుజుండై యొక్కఁ ♦ డై చనిచని
ద్వైపాయనంబన ♦ దనరు హ్రదమున జ
ల స్తంభనమ్మున ♦ డాగియుండె

తే. గీ. పాండుసుతు లయ్యది యెఱింగి ♦ పద్మనాభ
సహితముగ నయ్యెడకు జేరి ♦ సంతసమున
మడుపునందున్న నృపుని వె ♦ ల్వడగ జేయ
దలచుచో ధర్మజుడు సుయో ♦ ధనున కనియె.

కన్నడ - చతురశ్రగతి.

ప॥ కలవారందరి కలన గూల్పించి - జలమున మునిగినాడవా ...॥క॥
అ॥ప॥ తులువనీజాడ తెలియజాల మని-తలచి కులుకుచున్నాడవా॥కల॥

చ ర ణ ము

మానధనుడవను మాట నేటితో-మాపుకొన నెంచినాడవా
హీనపుంజావు చావ బొల్పడితి-విది మేలనుకొన్నాడవా ॥కల॥

చ. మడువునడాగినంత బరి ♦ మార్పకయుండు మె? క్షత్రధర్మమున్
విడిచితి వంతెగాక, పరు ♦ వే? కురువంశపు రాచవాని కీ
నడవడి, లోకులెల్ల నిను ♦ నవ్వరొకో? మగవాడవైన వె
ల్వడుము ప్రాదమ్మికన్ వదలు ♦ వారముగామునుమా, సుయోధనా!

చ. అవని సమస్తమేలుకొను ♦ మాలమునన్ మము గెల్చి, లేనిచో
బవరమునన్ మృతుండవయి ♦ స్వర్గసుఖమ్ములఁ జూఱగొమ్ము శా
త్రవులకు జంకి యిట్లిహప ♦ రమ్ములకుం జెడనౌనె? రాజరా
జవు రణకోవిదుండ వయి ♦ క్షత్రియగౌరవ మేటగల్పెదే?

వ. అనిపల్కు- ధర్మజునకు మానధనుండగు సుయోధనుం డిట్లనియె.

చ. అలసటనంది వచ్చితి భ ♦ యంపడి గాదు రవంత నీకు; సే
నలు వివిధాయుధమ్ములును ♦ నాకడ లే వొకరుండ నేవురీ
రలు, బవరమ్ము సెల్లునె? య ♦ రణ్యములం దపమాచరింతుభూ
వలయము నీకొసంగితి నృ ♦ పాలుడవై చిర మేలుకొమ్మికన్.

వ. అనవుడు పాండవాగ్రజుం డిట్లనియె.

చ. కల సిరి దానపూర్వకము ♦ గా గ్రహియింపగ మేము బాపన
య్యల మనుకొంటివా? కురుకు ♦ లాధమ! నిన్గలన న్వధించు టే
తలపగుగాని సర్వవసు ♦ ధావలయం బిపు డేలుకొంట మా
తలపును గాదు నీ కిచట ♦ తప్పదు మృత్యువు, లెమ్ము పోరికిన్.

ఉ. తమ్ముడు కర్ణ సౌబలులు ♦ తాము రణమ్మున జచ్చు చీయుపా
యమ్మును జెప్పిచచ్చిరె? నృ ♦ పాధమ! వల్కలధారివై యర
ణ్యమ్ములసైతమొంటెఱుతు ♦ వాశ యపవిత్ర పదమ్ములుంచి, వే
సమ్ములుం సాగ వింక భుజా ♦ సారము జూపుము రమ్ము పోరికిన్.

వ. అనిపలుక ధర్మజుని పోటుమాటలకు దుర్యోధనుండు చిత్తం బుత్తలపడ పుట్టలోపలి మహాభుజగేంద్రుంబలె రోజుచు జలస్తం బుడిపికొని మడుపు సంక్షోభింప కాలదండంబుఁబోని గదాదండం బునఁ సమీపమ్మున నమర్చుకొని బయల్వెడలి యుధిష్ఠిరాచుమత మ్మున గదాయుద్ధంబొనర్ప భీమసేనుం గోరుకొని యాతని దలపడు నెడ సర్వార్త తీర్థయాత్రలు సేవించి వచ్చిన బలరాముం డేతెంగి ప్రియశిష్యుల గదాయుద్ధమ్ము సూడ నయ్యెడ కరుదేర ధర్మజుం డెదురై యాదరించె నంతనెల్లరుం గలసి పోలికలనికిం జని భీమ దుర్యోధనుల యుద్ధభూమి న్నిలిపిరి. అంత వారిర్వురు వాసవ వృత్రాసురు లట్లొండొరుదాకి నేలవడంక లావును వేగంబును దర్పంబును జూపఁజకు వెఱగుబుట్టింప బోరుచో గొంతవడికి వాయుసూనుం డలసటం జెంది యోటువడనున్నంత గుర్తించి కృష్ణానుమతమ్మున నర్జునుం డూరుతలమ్ము కరతలమ్మున నప్ప ళించి సన్న జేయ గ్రహించి భీమసేనుండు రివ్వున కెగసి పోరాడు కురునరేంద్రుని యూరుభాగమ్ములనేయ దుర్యోధనుండు తొడలు విఱిగిపడియె నట్లు పడియున్న సుయోధనుని శిరమ్మును బకారి వామపాదమ్మునం దన్ని పలువిధమ్ముల దూఱుచు దన్ను ధర్మ జాతుండు వారించినను వినక మఱల నాతని శిరమ్ముం దన్నునంత హాలాయుధుం డల్గి ప్రళయరుద్రుంబలె మండిపడుచు నెల్లవారల కిట్లనియె.

బిలహరి – రూపకము

ప॥ చూచితిరే! కీచకారి – సూపిన పెనుదుండగమ్ము ॥చూ॥

అ॥ ప॥ పీచమడతు వీని నొక్క – వ్రేటున మీరెల్లరు గన ॥చూ॥

చరణము

న్యాయమే గదా రణమున – నాభికి దిగువం గొట్టుట?

యీ యధర్మయుద్ధము కను – లారఁ జూచి సైపనగునె ॥చూ॥

క. అని కోపవేగమున రథ
మున నున్న స్వకీయసీర ♦ ముం గైకొని భీ
మునిపై బడ నడ్డుమసని
వనజాక్షుం డిట్టులనియె ♦ బలరామునకున్

ఉ. పాండుతనూభవుల్మనకు ♦ ప్రాణసముల్ మఱదు ల్దలంప నా
పుండవు గాన నభ్యుదయ ♦ ల్సమకూర్పగ జెల్లు వీరికిన్
భండన భూమి నూరువుల ♦ భగ్నము సేయ బ్రతిజ్ఞ జేసి భీ
ముం డది నేటికిన్నెరపె ♦ మోసము గాదు శమింపు మగ్రజా!

వ. అనవిని సీరపాణియు గృష్ణా! తలదన్నినవానుల కేమి సమాధానము
జెప్పెదు వన,

ఉ. తప్పిదమౌనుగాక తల ♦ దన్నుట, యీతని దుష్కృతాళి నీ
తప్పదుసేత బోల్పగ శ ♦ తాంశముగాదు, తలంపు మీా కలిం
దప్పక నాల్గుపాదముల ♦ ధర్మమెటుల్నడచున్? బకాంతకుం
డప్పుడొనర్చె నేమొ నృపు ♦ నాదల దన్ను బ్రతిజ్ఞసేతమున్?

వ. అనిపల్కు గోపాలుని సమాధానమ్మున కేవగించుకొనుచు హాలా
యుధుండు సనె నంత ధర్మసూనుండు సుయోధను దుస్థితిం గని
జాలివడి యతనిం గౌగిలించుకొని,

ఉ. తమ్ముడ! నేడు నాదు పెద ♦ తమ్మ డొనర్చినయట్టి దుష్ట క
ర్మమ్ము సహింపు మేదికి ద ♦ రమ్మగు బూర్వకృతమ్ము దాటగా
నెమ్మెయి నీవె బల్ సుకృతి ♦ వెంతయు నీగతి బంధుకోటి నా
లమ్మున జంపి చేకొనిన ♦ రాజ్యము మాకు సుఖం బొసంగునే?

వ. అని విచారించు ధర్మజునకు వాసుదేవుం డిట్లనియె.

తే. గీ. సమరవిజయమ్ము గైకొన్న ♦ సంతసమున
కడల మ్రోగించి విజయఘం ♦ కారవమ్ము
కోరి సింగపు గద్దెపై ♦ గూరుచుండ
కేమ వేమిటి కో యమా ♦ యికపు బావ !

వ. అనినవిని దుర్యోధనుండు కోపవిచారమ్ములుముప్పిరిగొన పిఱుందు మోవ లేచి చేతుల భూతలం బూదికొని గోపాలుం జూచుచుం జూచుచు నిట్లనియె.

సావేరి - రూపకము.

ప॥ నల్లగొల్లవాడ గపట - నాటక మాడించినావ ॥న॥

అ॥ ప॥ చల్లగా దాయాదుల కిటు - సంగరమ్ముసంఘటించి ॥న॥

చ ర ణ ము

దూరమున మఱదుల కీమా - దిరి పాపపు బండితోలి

ధరణీవలయం బఖిలము - ధర్మజుతల జుట్టినావ ॥న॥

సీ. మోహారమ్మున చక్ర ♦ ముం దాల్పననితో ల్త
ప్రతిసవట్టియును చే ♦ పట్టి తీవు
కదనమందు శిఖండి ♦ నెదుట నిల్పించి క
వ్వించి శాంతనవు గూ ♦ ల్పించి తీవు
సంగరమ్మున ధర్మ ♦ జాతుచే నన్ఋతమా
డించి కుంభజుని జం ♦ పించి తీవు
పురమందు క్రీడికి ♦ దురుపదేశం బొన
రించి కర్ణుని పుని ♦ మించి తీవు

తే. గీ. తుదకు ననుగూడ రణమునం ♦ దొడలు విఱుగ
నీ వృకోదరుచేత గొ ♦ ట్టించి తీవు
భరతవంశమ్ము జెఱుప బా ♦ ల్పడితి వీవు
కంసదాసకుమార! వి ♦ జ్ఞానదూర!

ఉ. నాలుగువేదము ల్చదివి ♦ నాడ, మహేంద్రునిలీల భూతలం
బేలితి, నీప్సితమ్ముల ఘ ♦ టించితి నర్థులకెల్ల, జన్నముల్
మేలుగ జేసితి స్వశము ♦ మింటను మేదిని నిండునట్లుగా,
నాలమునందు గూలితి, ము ♦ రాంతక! నాకిక లోపమున్నదే?

ఉ. సంపద లేక, బందుగులు ♦ సైనికులు న్మరిపెమ్ము లేక, వం
శంపు ప్రశస్తిలేక, పరు ♦ షమ్ముగ కౌరవకాంతలెల్ల దూ

పింపగ ధర్మసంభవుని ♦ చే గతినాలిన పాడునేల మో
యింపుము; పెద్దకాల మిది ♦ యేగద నీదగుపూనిక-? కేశవా!

వ. అనిపలుక దుర్యోధను వెనుకటి యకృత్యమ్ముల నిర్దేశించి మెత్తి పొడుచుచు కృష్ణుండు సాత్యకి సమేతముగ పాండవులం దోడ్కొని పాడుఱియున్న కౌరవశిబిరమ్ములం బ్రవేశింపబోవదక్క-జోదులెల్లరు దమతమ విడిదుల విడిసిరి. కౌరవశిబిరమ్ములకడ గౌంతేయులు రథమ్ములు డిగ్గునెడ గాండీవాదిసాధనమ్ములు గొని కృష్ణప్రేరణమ్మున నర్జునుం డరదమ్ము డిగునంత బగ్గమ్ముల నొగల ముడిచి శౌరియు తేరుదిగునంత దత్క్షణం బారథమ్ము భగ్గునమండె నదిగని నరుం డచ్చెరువంది కేల్మోడ్చి జనార్దనున కిట్లనియె.

ఆరభి - రూపకము

ప॥ ఆనతిమ్ము బావా నా - కరదము మండిన కారణ ॥మా॥
అ॥ప॥ ఏ నిది వినదగునమోని - యెంతయు నాశ్చర్యకరం ॥బా॥

చరణము

కంటికి ఱెప్పవలె మమ్ము - గాపాడితి వింతదనుక
వెంటనంటి పున్నెంబుల - పంటవీవు కౌంతేయుల ॥కాన॥

సీ. అనిన మురారాతి ♦ యనియె వాసవి కిట్లు
ద్రోణ గాంగేయ క ♦ ర్ణుల మహాస్త్ర
పావకజ్వాలల ♦ బడియున్న దీని ర
క్షించితి నెట్టులో ♦ యింతదనుక
జగడంపుగ్రతు వింక ♦ సాంతమయ్యెం గాన
గడకిట్లు గాలగా ♦ విడచివాడ
దురము నారంభించు ♦ తఱి నాకుమధుపర్క-
మిడి నిన్నుసూపి ర ♦ క్షింపు మనుచు
తే. గీ. ధర్మజుం డప్పగించె; యు ♦ ద్ధమున నీగ
నేని నీపయి ప్రావాలగా ♦ నీక విజయ

మంద జేసి కృతార్థుఁడ ♦ నగుట కెల్ల
కారణము నాదు మేనత్త ♦ కడుపుజలువ.

తే. గీ. అని సమాధానముం జెప్పి ♦ యచ్యుతుండు
వారి నార్వుర దోడ్కొని ♦ చేరె నోఘ
వతియనందగు నొకపుణ్య ♦ వాహినికడ
కచట నిట్లనె వారికి య ♦ మాత్మజుండు.

ఉ. కౌరవనాథు నక్రమము ♦ గా బడఁగూల్చితి మంచు మమ్ము గాం
ధారి శపించునేమొకో? జ ♦ నార్దన! నీవొకతూరి పోయి య
వ్వారల నూఱడింపు మన ♦ వారిజనాభుఁడు సత్వరమ్ముగా
వారణపట్టణమ్ము సని ♦ వచ్చె వెసం బనిదీర్చి యొంతయున్.

క. వారిజనాభుఁడు పాండుకు
మారుల పనిదీర్చి సుఖము ♦ మైనుండ నటన్
గౌరవపతి తలిదండ్రుల
జేరుకొనుచు నెంతయేని ♦ విలపించె నిటుల్.

ముఖారి - ఆది

ప॥ తొడలువిఱిగి పుడమింబడి యు టిని ధూళిధూసరితదేహుఁడైనెతుది॥
అ॥ప॥ చెఱుగులైనకొడుకులనూలమ్మునగుడిచెదరాకష్టమువార్ధకమున॥

చ ర ణ ము

చీకటాల్మగలు మీకింత నేడు - చేయూతగ నొకడైన లేకుండ
బాకార్పించిన దుష్టుఁడ న్నిమ్ము - శోకార్ణవ నిర్మగ్నులంజేసి ॥తొ॥

ఉ. ఎందరి గన్న నేమి? తుద ♦ కిట్లసహాయుల జేసి నేటి కీ
కుం దొడగూర్చితిన్ విధవ♦కూతురు దిక్కుగ వార్ధకమ్మునన్
బందుగులైన లేక పగ ♦ వారల కొంపల కంపి కూటికై
కుంద సుయోధనుం డొడలు ♦ బాయు నిదే కలనన్, క్షమింపుడీ.

వ. అని విలపించుచు భానుమతిం దలచి.

చ. అరయఁగ నెండకన్నెఱుగ ♦ నట్టి లతాంగివి, నేను ద్రోవదిం
బరిభవముం బొనర్చిన నె ♦ పమ్మున వాయుసుతుండు కోపసం

భరమున మానహాని సలు ♦ పం దలపెట్టునొ నీకు? కావునన్
శరణము వేడుకొమ్మిపుడ ♦ జాతరిపున్ సమవర్తినందనున్.

గీ. ఇట్లు పలవించు ధరణీశ ♦ తేంద్రుకడకు
కృపుడు కృతవర్మ ద్రౌణియు ♦ నేగుదెంచి
సర్వము నెఱింగి బిట్టు వి ♦ చారపడిరి
వారిలో ద్రౌణి పలికె గో ♦ పమ్ముగ మర.

పూరి - ఆది

ప॥ నిన్న ధర్మయుద్ధమ్మున గూల్చిర నీటినుండి వెడలించి పాండవులు॥ని॥
అ॥ప॥ అన్న నాన్నా! తలద న్నె నా? భీము-డన్యాయముంబనితలపకశివశివ ॥ని॥

చరణము

నే డపాండవము గావించి ద్రౌణి-నీ మనోరథము దీర్పగా గలడు
వాడిసూపి రిపువారమెల్ల ను - గ్గాడువాడ నన్నభిషేకింపుము ॥ని॥

చ. అనవిని కౌరవేంద్రు డపు ♦ డా కృపుచే జలమంది ద్రోణనం
దను నభిషిక్తు జేయ బ్రమ ♦ దమ్మున ద్రౌణియు సింహనాదముం
బొనరిచి బ్రాదవోత్తము కృ ♦ పుల్దన కయ్యెడ దోడుగాగ న
ల్లన సనె పాండుపుత్ర శిబి ♦ రంబుల వంకకు, జారెసంజయున్.

ఉ. సైనికులెల్లరు న్గెలుపు ♦ సందడి నుండు రెఱింగి ముప్పురు
న్మానుగ కొంతద వ్వరిగి ♦ మార్గమున న్వటభూజ మొకెడం
గానబడ న్సమీపమున ♦ కర్కశమౌ ధరణీ తలమ్మునన్
మేనులువైవ నిద్రవోడ ♦ మెక్క గృతవర్మకు ద్రౌణిమామకున్.

సీ. క్రోధాతిశయమునన్ ♦ గురునందనుడు నిద్ర
వోవక యవ్వట ♦ భూజశాఖ
గనుగొనుచో నులూ ♦ కంబొండు కొమ్మపై
నిదురించు వాయస ♦ నివహములను
కంఠము ల్నులిమి ప ♦ క్షమ్ములు నఱికి పొ
ట్టలు వ్రచ్చుచుం జంపు ♦ ట దిలకించి
కౌశికం బల్లుప ♦ దేశమిచ్చె నటంచు
దలచి యిర్వుర మేలు ♦ కొలిపి తాను

తే. గీ. నావిధిం బాండవుల దెగ ♦ టార్చ నదచు
పాపభీతి సుంతయు లేక ♦ వదరుచున్న
భాగినేయుని సక్రమ ♦ పథమునందు
నిలుప శారద్వతుం డిట్లు ♦ పలికె నపుడు

అఠాణా - రూపకము

ప॥ నీకు వీరధర్మమగునె - నిద్రాసక్తుల గూల్చుట ॥నీ॥
అ॥ప॥ కాకమ్ముల జంపు నా - యులూకమా యుపదేశమిచ్చుట ॥నీ॥

చ ర ణ ము

1. అభిమతిపాత్రుండ ధను - రాచార్యుని పుత్రుండవు
శుభకరుడవు భాసురుడవు - శూరజనాగ్రేసరుడవు ॥నీ॥

2. క్రోధగుణము పాపములకు - గురువై చెఱచు వివేకము
క్రోధలోభముల దగిలిన - కురుపతి గూలు టెఱుంగవె ॥నీకు॥

మ. ఉపకారంబగునే? సుయోధనున కీ ♦ యుద్రేక మూహింపగా
నపకారంబగుగాక పాండవుల, కే ♦ లా వంశ విచ్ఛేద మీ
విపు డన్యాయముగా నొనర్చెదవు? కా ♦ దేని న్సమీపంబునన్
రిపులం గూల్చ మెదిర్చియట్లయిన గీ ♦ ర్తించున్ జగంబుల్మినున్.

వ. అనిపలుక కృపుని ధర్మవచనంబులు పెడచెవింబెట్టి సౌప్తిక సమయంబున బాండవుల జతురంగసమేతముగ సమయింప నమకట్టి ముందునకు నడువ శార్దూల చర్మధారియై సర్పహారమ్ములు గలిగి వాడికోఱల న్వెఱపుగొల్పుచు నొద్దెఱచి భయంకరాకారమ్మగ నొక్క భూతమ్ము కట్టెదుర నిలువ గురునందనుండు భీతిల్లక ఘోరాస్త్రమ్ము లెన్నియేని ప్రయోగింప వాని నన్నింటి నబ్భూతంబు మ్రింగ మిగుల నొచ్చి సేయునది లేక రథమ్ము డిగి మనంబున పార్వతీరమణుం దలంచుచు నాసీనుండై యుండ దన ముంగట నొక్క శిఖిజ్వాల గానంబడ నందు దనదేహం బాహుతి గావించుకొన నుఱుకునంత శివుండు ప్రత్యక్షమై యొక్క ఖడ్గం బా ద్రౌణికిచ్చి యతం డెఱుంగకుండ నతని తనువున నావేశించె నంత నశ్వత్థామ కృపాణధారియై రథారూఢుండై కృప కృత

వర్మలందోడఁగాని శిబిరంబులకడ కఱిగి యొల్ల ధృష్టద్యుమ్ను డున్నెడకుం జని శివ్రుం దలంచుచు,

సీ. ఇరుగాల మెడయు పె ♦ న్నురము ద్రొక్కి బిరాన
సమయించె ద్రుపదభూ ♦ జానితనయు
దలపట్టి యీడ్చుచు ♦ దక్కు పాంచాలుర
నెల్లర వధియించె ♦ హేతిధార
కరితురంగములపై ♦ కుఱికి మోరలు చెక్కి
పీనుగుపెంట గా ♦ వింపదొడఁగె
కోపవేగమున ను ♦ ద్దీపించి పైబడి
ద్రౌపదీతనయులం ♦ దవిలి సంపె

తే. గీ. వేగుజామున కెల్లరన్ ♦ వెస వధించి
తత్క్షణం బేగి యది సుయో ♦ ధనున కెఱుక
పఱప హర్షించి యతఁడు జీ ♦ వనముల విడిచె
ద్రౌణి వ్యాసాశ్రమము జేరె ♦ తపమొనర్ప.

చ. తెలతెలవార నయ్యుది యు ♦ ధిష్ఠిరముఖ్యు లెఱింగి కుందుచో
జలరుహనాభు గూడి పటు ♦ శౌర్యమునన్ విజయుండు భీముఁడుం
జలమున ద్రౌణి యున్నెడకు ♦ సత్వర మేగి తదాశ్రమంబునన్
లలి జపమాల ద్రిప్పుకొను ♦ రక్కసుబోలిన ద్రోణనందనున్.

వ. కనుగొని కోపసంరంభులై,

నాట - చతురశ్రగతి

ప॥ ద్రోహమనక పసిబాలురంజంపి-దొంగజపముగావించుచున్నావా॥ద్రో॥

అ॥ప॥ నీసదువంతయు నేలగలపితివా - నిద్రాణుల నిసివేళ వధింతువా॥

1. పాండుసుతుల కపకార మొనరించి-ప్రాణములకు జెడకుండు వీవిట్లు
దుండగీడవై నీ పీనాటికి - ద్రోణు ప్రతిష్ఠయు గంగగల్పితే ॥ద్రో॥

2. గురుసుతుండవను మారియాదన్నియు-భరిమార్పకుండ మేమూరకున్నను
ఉరకుండదు గదయు గాండీవం-బో విప్రాధమ! లేచిరావేమి ॥ద్రో॥

తే. గీ. అనినవిని ద్రోణనందనుం ♦ డాక్షణంబ
బ్రహ్మశిరము లోఁదలఁచియ ♦ పాండవాంబు
గా దృణంబొండు మంత్రించి ♦ కనలివిడువ
మండుచును దమ్మ గవియుచో ♦ మాధవుండు.

ఉ. కవ్వడిచే దదస్త్రమును ♦ గ్రన్నన నేయఁగ జేయ నస్త్రముల్
జివ్వకుసిద్ధమైనయటు ♦ చెచ్చెరదాకిన భస్మరాశిగా
నవ్వసుధాతలమ్ము కలఁ ♦ హాశన ముఖ్యమునివ్రజమ్ము దా
దవ్వులనుండివచ్చి వసు ♦ ధాసురపార్థుల మందలించుచున్.

తే. గీ. ఇరువురస్త్రమ్ము లుపసంహ ♦ రింపుడనఁగ
నర్జునుం డట్లొనర్చె ద్రో ♦ ణాత్మజాతు
డొప్పకున్నంత వ్యాసాదు ♦ లప్పుడతని
మందలించుచు యత్నించి ♦ సంధిజేయ.

వ. ద్రౌణిశిరంబునంగల రత్నంబును పాండవమధ్యమున క్షేపించె నంత గోపమ్ము విడువక గురునందనుం డయ్యస్త్ర మ్ముత్తరాగర్భమ్ము జెఱచుఁగాక యనిపల్క ప్రజ్వలింపజేసిన శౌరియు జక్రంబడ్డిడి తదస్త్రముఁ వారించి పరీక్షితునకు బ్రాణంబిడి మూడువేలేండ్లన్న వస్త్రమ్ములు లభింపక దుర్గంధ దూషిత దేహుండవై యుండువు గాక యని యశ్వత్థామకు శాపంబిచ్చి శిరోరత్నంబును పాండవులచే ద్రోవదికిప్పించి యామె నూరార్చె నంత ధర్మజుండును గాంధారీ ధృతరాష్ట్రముఖ్యుల నెల్ల నూరడించి కుంతివలన గర్ణుండు తనకన్న యనివిని సోదరులుం దానును జింతించి యెల్లవారికిం దర్పణాదులొసంగి యనంతరం బొక్క శుభదినమ్మున శ్రీకృష్ణానుమతంబున బట్టాభిషిక్తుండై యెల్లరకుం గన్నులపండు వొనర్చి యంపశయ్యనున్న భీష్మునివలన సమస్త ధర్మాధర్మము లెఱింగి యయ్యనఘుండు మాఘమాసమ్మున శుక్లపక్షమ్మునందలి యేకాదశినాడు శ్రీకృష్ణునందైక్యమ్ముగా హస్తిపురమ్ము సేరి వ్యాసాదులయును

మతంబున నశ్వమేధం బొనర్చి సుఖమ్ముగ పెద్దకాలమ్ము రాజ్య పాలనమొర్చుచో సకల సన్మంగళ ప్రదుండగు మాధవున కెల్లరు మంగళమ్ము పాడిరి.

మణిరంగు - మిశ్రగతి.

ప॥ హారతిగోకులబాల గొను - మాశ్రితజనానుకూల కృష్ణ ॥హార॥

అ॥ ప॥ నీరజభవసేవితపద - నిర్జరపాల నవ - సారసదళలోచనయుగ సత్యావిలోలా - గోపాల కళ్యాణశీలా ॥హార॥

చరణము

ఘోరసంగరపరాజిత - చైద్యమాగధవార ప్రమథావనపు - ద్వార ప్రతిభావిభాసిత భీష్మకరాజాత్మజా - హృ - చ్చోర నందకు-మార దురిత వి - దూర కౌస్తుభహార జాంబవతీవరా-వర కామిత జనకల్ప కా - పాహిమాం సకలాగమస్తుత లీల - కాంచనచేల దానవ - కాల నతసుర - జాల నీరద - నీలదేహ జనార్దనా పావనా - దేవ ముని సంభావనా - సద్గుణనిధాన ॥హారతి॥

క. గిరిజామనోంబురుహాబం
భర! విశ్వంభర! మహేశ! పాపవినాశా!
కరుణన్ మత్కృతభారత
చరితమ్ముగై కొనుము దీని చంద్రార్ధధరా!



## ప్రశంసాలేశః

1. తత్తద్గాథా రస మనుగతం ధావతే శబ్ద జాలం
మార్గః ప్రత్నం నవమపి మహాః సంవిధత్తే సమస్తం
సారం నీత్వాఽమృత మహహా! ఉదన్ భారత క్షీరవార్ధేః
సుబ్రహ్మణ్య! ప్రమద మతులం సార్థకీ భూతనామా.

2. రస విసర సార సాహితీ ♦ ప్రసృత సత్క
థా రచన శక్తి, సత్సభా ♦ స్థలుల గాన
కళలు వెలయించి విస్మరింపు ♦ గరిమ గలుగ
కథక వాచస్పతిత్వ మ ♦ గ్గలపు బిరుదె?

3. హరికథాకథనమున నీ ♦ యతుల శక్తి
స్వర్ణ కంకణ ఘంటికా ♦ స్వనమె తెలుపు
కొలిచి యమృతంబు దేవతా ♦ వళికి నిచ్చు
చంద్రునకు నీవిధమ్ము మ్మెల ♦ జ్జను ఘటించు.

4. ఇత్యోప్యధిక మాధురీ మృదుళ బంధ సంధానభా
జ్మనోహర కథాదికం బహుళ మోద మాపాదయేః
విరచ్య కవిచంద్ర! తద్దిగిభ దంత భూషాయితాం
యశో విమల మల్లికా కుసుమ మాలికా హేళికాం.

ఏలూరు,
18—11—37

శ్రీ వేంకట పార్థసారథి కవులు,
శతావధానులు.